**Anubandhalu**
**(Telugu)**

# అనుబంధాలు

## కథా సంపుటి

రచయిత :

అబ్దుస్సత్తార్ మణి

# విషయసూచిక

# ఇవి వాస్తవకథా 'చిత్రాలు'

డాక్టర్ ద్వా.నా.శాస్త్రి
సాహిత్య సవ్యసాచి, సారస్వత వచోనిధి
హైదరాబాద్, ఫోన్ : 98492 93376

ఆధునిక తెలుగు కథకి నూరేళ్ళకిపైగా కథ వుంది. యధార్థ జీవిత దృశ్యాలు నేటి కథకు ముడిసరుకు. నేల విడిచి సాము చేయటం అనేది కవిలో ఉండవచ్చుగానీ మంచి కథకుడిలో ఉండదు. లోకాను శీలనం, మంచి పట్ల తపన గలవాడే ఉత్తమ కథకుడు కాగలడు. 'అనుబంధాలు' సంపుటి రాసిన అబ్దుస్సత్తార్ మణి అటువంటి ఉత్తమ కథకుల జాబితాలోకి చెందుతాడు.

కొందరు కథలు రాయాలని రాస్తారు. కానీ ఈ మణి రాయకుండా ఉండలేని ఆవేదనతో రాశాడు. అందుకే ఈ కథలన్నీ మణువే! కొన్ని కథల్లో వస్తువు ప్రాధాన్యం వహిస్తే మరికొన్ని కథనం ప్రాధాన్యం వహిస్తుంది. మన రాష్ట్రంలోని ముస్లిమ్‌లలో చాలామంది ఉత్తమ కవులు, రచయితలుగా తెలుగుసాహిత్యంలో పేరుపొందారు. తెలుగు మాతృభాష గల వారు ముస్లిమ్ సాహిత్యం పట్ల వేళ్ళ మీద మాత్రమే ఆదరణ చూపించారు. మణిగారు పోలీస్ శాఖలో సీనియర్ అసిస్టెంట్‌గా స్వచ్ఛంద పదవీ విరమణ చేసి తనకిష్టమైన సాహిత్య, సామాజిక సేవారంగాలను ఎంచుకోవడం ఒక విశేషం. 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్' హైదరాబాద్ వారు ప్రచురిస్తున్న 'గీటురాయి' తెలుగు వారపత్రికకి డిప్యూటీ డైరెక్టర్‌గా పనిచేస్తున్నారు. విశాల భావాలు గల మంచిమనిషి. తెలుగు ఇస్లామిక్‌పబ్లికేషన్స్ గురించి నా అనుభవం కొంత చెప్పవలసి వుంది. పాతబస్తీలో చార్మినార్‌కి సమీపంలో ఛత్తాబజార్‌లో ఈ సంస్థ వుంది. తెలుగు భాష వ్యాప్తి కోసం వీరు చేస్తున్న కృషి తక్కువేమీకాదు. ముస్లిములకు తెలుగు అవసరం అంటూ వీరు చేస్తున్న కృషి తెలుగు వారందరకూ స్ఫూర్తిదాయకం!!

అబ్దుస్సత్తార్ మణి గారి కథలు మంచి కథలు. ఏది మంచి కథ? అంటే మనల్ని 'డిస్టర్బ్' చేసేది అన్నారు. అంటే స్పందనను కలిగించేది. కథ చదివిన తర్వాత ఊరుకోకుండా పదేపదే ఆలోచిస్తాం. అదే మంచి కథ. ఇందులో 30 కథలున్నాయి. అన్ని కథలూ వైశిష్ట్య, వైవిధ్య భరితాలు. ఒక సామాజిక దృక్పథంతో,

ఒక అంకితభావంతో రాసిన కథలివి. కొన్ని ఇస్లాం మత ప్రాధాన్యాన్ని చెప్పినవి ఉన్నా కథా శిల్పానికి వచ్చిన లోటు లేదు. ఇతర మతస్తులు పునరాలోచించదగినవి- అని చెప్తే చెప్పవచ్చు గానీ- నా దృష్టిలో ముస్లిములే బాగా ఆలోచించి సన్మార్గాన్ని అలవరుచుకోవాలని చెప్పినట్లునకుంటాను. ఏ మతస్తుడైనా, ఏ భాషీయుడైనా ముందుగా 'మానవుడే' అనే సందేశాన్నిచ్చే కథలు రాసిన అబ్దుస్సత్తార్ మణిని మనసారా అభినందిస్తున్నాను.

మొట్టమొదటి కథ 'ధర్మం చర' ఇందులో ముఖ్యపాత్ర అజీంభయ్యా. న్యాయంగా నీతిగా బతికేవాడు. అక్రమ సంపాదనకు బద్ధ వ్యతిరేకి. అటువంటి అజీంభయ్యా కూతురికి పెద్ద జబ్బు చేసింది. చికిత్స చేయించాలంటే డబ్బు కావాలి. లంచం పుచ్చుకోలేడు, 'దేహీ' అని చేయి చాచలేడు. నిజాయితీకి కట్టుబడి జీవించే వ్యక్తిగదా! చివరకు చికిత్స అందక పాప చనిపోయింది. అయినా ధర్మం బతికింది!! అజీంభయ్యా లాంటి వాళ్ళ జనాభా ఎక్కువైనప్పుడు సమాజంలో తప్పక మార్పు వస్తుందని సందేశమిచ్చే కథ ఇది!

ఇవాళ ఎక్కడ చూసినా అశ్లీలమే! అసభ్యమే!! స్త్రీని మునుపటి కంటే హీనంగా అంగాంగ ప్రదర్శనలతో ప్రదర్శిస్తూ కించపరుస్తున్నారు. సినిమాలన్నీ 'ఏ' సర్టిఫికేట్‌కి కాదు- 'ఏ ఏ' సర్టిఫికేటుకి యోగ్యమైనవే. సెన్స్‌లేని సెన్సార్ బోర్డు వుంది మనకి. టీ.వీ. ఛానల్స్‌లలో కూడా 'సెక్స్' ప్రదర్శనలే! స్త్రీవాదులు వీటిపై కలం ఝుళిపించకుండా నిమ్మకు నీరెత్తినట్టున్నారు. కానీ అబ్దుస్సత్తార్ మణి మాత్రం సహించలేకపోయాడు. 'ఈ సుడిగుండంలో మీ బిడ్డలు, మీ చెల్లెళ్ళు, మీ భార్యలూ మునిగిపోతారు. మీరు శిక్షించాల్సింది బూతు సాహిత్యాన్ని,అశ్లీల సినిమాల్ని...' అంటూ సుడిగుండం అనే కథ రాశారు.

'స్వాతంత్ర్యం ఒక మేడిపండు' అన్నారు ఆరుద్ర. ప్రజాస్వామ్యమని అనుకుంటున్నాం గానీ నిజానికి మనం రాజరిక వ్యవస్థలోనే ఉన్నాం. అలనాటి ప్రభువుల డాబూదర్పాలు, ప్రజల సొమ్ముతో కులకటం, భోగలాలస నేటి పరిపాలకులకూ ఉన్నాయి. విదేశీ ప్రయాణాలూ ఖరీదైన కార్లూ, ఉచిత సౌకర్యాలూ.. ఎన్నో! ఎన్నెన్నో! 'సెక్యూరిటీ' పేరుతో ప్రజల సొమ్ము వృథా అయిపోతోంది. భారతదేశం వంటి దేశం వీటిని భరించగలదా? వీటి కోసం ప్రపంచ బ్యాంక్ నుంచి అప్పులు తేవడం. అందుకే ఒక కవి అన్నాడిలా...

ఒకనాడు నా దేశం

ఒప్పులకుప్ప ఒయ్యారి భామ!

ఈనాడు నా దేశం

అప్పుల కుప్ప అయ్యో రామ!

ఇవన్నీ మణి గారిని కలిచివేశాయి. దిగులుకి గురిచేశాయి. అప్పుడు ఆయన గుండెచప్పుళ్ళే 'ఆకలి రాజ్యంలో రాజభోగాలు' అనే కథ.

మణిగారి ఉద్దేశ్యం మానవత్వం, మతం, హితం కోరాలి– నాశనాన్ని కాదు. తాను ముస్లిం అయివుండి కూడా 'ముస్లింలు అనబడుతున్నవారు ఇస్లాం ధర్మాలను సరిగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించమంటూ "వినిపించే ధర్మం..." కథలో హితవు పలికాడు. ఎవరైనా తన మతంలోని మూలాలను, విలువలను గ్రహించి ఆచరించి ఆచరిస్తే ఈ లోకం ప్రశాంత లోకమవుతుంది. మానవుడి ఆనందమయ జీవితం అవుతుంది.

అందుకే మణి ఇలా విన్నవిస్తాడు–

'ప్లీజ్... ప్లీజ్... వెయ్యిసార్లు ప్లీజ్. మీరు విశ్వసించిన ఇస్లాంధర్మాన్ని మీరు ఆచరణ ద్వారా చూపగలిగితే చూడాలని... రంగురంగుల లైట్లూ, సభలూ సమావేశాలు కాదు.. కార్యరూపం కావాలి"

– ఈ మాటలు అన్ని మతాల వారికి అన్వయిస్తాయి. 'చేప్పేవి నీతులు, దూరేవి దొమ్మరి గుడిసెలు' అనే సామెత వుంది. మతం చెప్పిన మానవీయ విలువల్ని విస్మరించే ఈ రోజుల్లో, ఆడంబరాలూ, అట్టహాసాలూ భక్తిగా భావించే ఈ రోజుల్లో మణి కథల అవసరం ఎంతో వుంది. ఆధునిక కథకి ఈ మణి కథలు కొత్త చేర్పు. మానవతా వాది అయిన మణికి స్వాగతం పలుకుతూ ఇటువంటి వ్యక్తిత్వ వికాస కథలు, మతాతీత మత కథలు, సమాజంలోని మేడి పండు తత్వాన్ని చూపించే కథలు మరిన్ని రాయాలని ఆకాంక్ష!

– డాక్టర్ ద్వా.నా.శాస్త్రి

# తెలుగు సాహిత్యాకాశంలో మెరిసిన మరో మణిదీపం

**- సలీం,** కేంద్ర సాహిత్య పురస్కార గ్రహీత
ఫోన్: 7588630243

**తమ** కవితల్తో, కథల్తో తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్న ముస్లిం రచయితలు ఎందరో ఉన్నారు. తమదైన గొంతుల్ని, బలమైన అభివ్యక్తితో విన్పిస్తూ ముస్లిమేతరులకు తెలీని ముస్లిం జీవితాల్లోని విభిన్న కోణాల్ని పరిచయం చేస్తున్నారు. ఇప్పుడు అబ్దుస్సత్తార్ తన 'అనుబంధాలు' అనే కథా సంపుటితో తెలుగు సాహిత్యాకాశంలో తన వంతు స్థానాన్ని పదిలపర్చుకున్నాడు.

అబ్దుస్సత్తార్ మణి గారి ఈ కథా సంపుటిలో దేనికదే పోటీ పడగల సత్తా ఉన్న 30 కథలున్నాయి. ఈ కథలు చదువుతున్నప్పుడు నన్నాకర్షించిన మొదటి విషయం రచయితకు తెలుగు భాష మీద ఉన్న పట్టు... రెండో విషయం వీటి పఠనీయత... ఇతనిది ప్రవాహ శైలి. ఒడుపుగా కథ చెప్పటం తెలిసిన నేర్పరి. రచయిత సంస్కారం, దైవభక్తి, సత్సమాజ స్థాపన కోసం పడుతున్న తపన, మానవత్వం మీద అచంచల విశ్వాసం... ఇవన్నీ కథల్లో ప్రస్ఫుటంగా కన్పిస్తాయి.

'ధర్మం చర' కథలో ఖుర్‌ఆన్ సూక్తుల ప్రకారం, ప్రవక్త ప్రవచనాలకనుగుణంగా నడుచుకునే నిజమైన ముస్లిం అజీం భయ్యా పాత్ర చాలా ఆదర్శవంతంగా చిత్రించబడింది. తను అమితంగా ప్రేమించే నాలుగేళ్ళ కూతురు హసీనా చావుబతుకుల్లో ఉన్నా, తన ధర్మాన్ని అతిక్రమించని ధీరోదాత్తుడుతడు. ఆపరేషన్ చేయకపోతే తన బంగారు తల్లి బతకదు. అందుకు డబ్బులు కావాలి. లంచం ఇవ్వడానికి తయారుగా ఉన్నాడొకడు. కానీ ఎన్నో ప్రాణాలు పోయేకన్నా ధర్మం బతకడం మిన్న అనుకున్నాడు అజీం భయ్యా. 'అధర్మ సంపాదనతో పోషింపబడిన శరీరం స్వర్గంలో ప్రవేశించదు. లంచం ఇచ్చేవారిని పుచ్చుకునేవారిని ప్రవక్త శపించాడు' అనే ప్రవచనాలు గుర్తొచ్చాయి. లంచం డబ్బు ముట్టుకోలేదు. కూతురు

చచ్చిపోయింది. అతని భార్య 'నా బంగారు తల్లి చచ్చిపోయిందండీ' అని భోరున ఏడుస్తుంటే 'ధర్మం బ్రతికింది' అంటూ అతని అంతరాత్మ ఘోషించిందంటూ కథ ముగించడం చాలా బావుంది.

'ఆకలి రాజ్యంలో రాజభోగాలు' అనే కథలో అన్నార్తులను చూసి రచయిత పడే ఆవేదన చిత్రించబడింది. ఓవైపు గుప్పెడు అన్నం మెతుకుల కోసం చెత్తకుండీ దగ్గర కుక్కల్తో పందుల్తో పోరాడే పిల్లలు.. మరోవైపు రాజభోగాల్లో తేలియాడే మనుషులు... ఏ రచయితనైనా చలింపజేసే దృశ్యం ఇది. ఈ రచయిత ఎంత సున్నిత హృదయుడో ఈ కథలోని కొన్ని పంక్తుల వల్ల తెలుస్తోంది. పందులు అన్నం మెతుకుల్ని తినేస్తే రోగంతో పడుకుని ఉన్న తన తల్లికి పెట్టడానికి ఏమీ ఉండదని ఆ పందుల్ని తరుముతున్న ఆ పసి పిల్లని చూస్తే 'నాకు అప్రయత్నంగా కళ్ళు చెమ్మగిల్లాయి. వళ్ళు గగుర్పొడించింది. పాపా అంటూ ఆ అమ్మాయిని గుండెలకు హత్తుకుని ఏడ్వాలనిపించింది' అంటాడు. దేశంలో ఎన్ని గులాబీ మొగ్గలకు ఇలాంటి చీడ పట్టిందో? ఈ దుస్థితికి కారణం ఎవరు? అంటూ వాపోతాడు.

'ఎర్రమందారం' కథలో ఆడపిల్లల్ని అత్తారింటికి పంపాక తల్లిదండ్రులు పడే క్షోభని, కట్నాలకోసం రాక్షసులుగా మారి కోడళ్ళని పాశవికంగా హతమారుస్తున్న అత్తల రాక్షసత్వాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించాడు. 'అమూల్యం' కథ జానపద కథలా సాగింది. గొప్ప సందేశం నిండిన కథ. 'సత్సమాజ నిర్మాణానికి సత్యధర్మ స్థాపనకై జరిగిన ధర్మయుద్ధంలో అమరుడైన యువకుడి రక్తాన్ని మించిన అమూల్యమైన వస్తువు ఈ లోకంలోనే ఉండదు' అని చెప్తుందీ కథ. చివరి కథ 'విన్పించే ధర్మం కన్పించాలి'లో ఉత్తమ జన్మనిచ్చిన దేవుడు మనిషిని ఉత్కృష్టంగా సృష్టిస్తే అదే మనిషికి నికృష్టంగా మారిపోతున్నందుకు రచయిత పడ్తున్న బాధ కన్పిస్తుంది.

అందమైన కవితాత్మకమైన వాక్యాలురాయడంలో రచయిత ప్రావీణ్యత కన్పిస్తుంది. మచ్చుకు కొన్ని : కట్నాల కోసం పీక్కు తినే మనుషుల గురించి చెప్తూ 'కొసరికొసరి చివరకు 30 తులాలకు ఖరారైంది. ఇక బండి నుండి పెళ్ళి కుమారుని షర్టు గుండీ వరకు అవీ ఇవీ ఉండనే ఉన్నాయి' అంటాడు.

పెళ్ళయ్యాక జరిగే అంపకాలని 'కన్నీళ్ళ పర్వం' అని వర్ణిస్తాడు. 'కన్నవారి గుండెకాయని కట్టుకున్నవాడు నిర్దయగా కోసుకుని పారిపోయే దృశ్యం' అని రాస్తాడు.

'ఎర్రటి ఓల్వో బస్సు ఎర్రమందారం షకీలాను తీసుకుని ఎర్రబడ్డ పడమటి దిక్కుకు దూసుకుపోయింది.'

'కాలమనే కెమెరా భూమిపై జరుగుతున్న సంఘటనలన్నింటిని తనలో నిక్షిప్తం చేసుకుంటూ కదిలిపోతూ ఉంటుంది'

'కాలగర్భంలో కలిసిపోయిన కోటానుకోట్ల దు:ఖిత మానవ చక్షువులు నిరంతరంగా కురిపించిన అశ్రుజలాలే ఆ సాగర జలాలు.. అవి దు:ఖ సాగర జలాలు. అందుకే అవి ఉప్పగా ఉంటాయి.'

'ఆకులు రాలిన చోటనే కొత్త చిగురులు వేయడం, కారుచీకట్లు తొలిగి కాంతిరేఖలు విరియటం, గ్రీష్మమ ముగిసి వర్షం రావటం ప్రకృతి ధర్మం'

అమూల్యం కథలో పేరుకు వజ్రఖచిత సింహాసనాన్ని అధిష్టించిందే కానీ ఆ అందాల కోమలాంగి తన ప్రజా హృదయ పీఠాలపై పరివేష్టితమై ఉంది. వారి మనో మందిరాలలో మయూరిలా విహరిస్తూ ఉంది. దైవం ఆమెకిచ్చింది ఒకే ప్రాణం కాని ఆ సామ్రాజ్యంలోని కోట్లాది ప్రజలకు ఆమెయే ప్రాణం.'

ఈ రచయిత ముందు ముందు మరిన్ని మంచి కథలతో సాహితీ వినీలాకాశాన్ని తేజోమయం చేస్తాడని ఆశిస్తూ...

అభినందనలు అబ్దుస్సత్తార్ మణి భయ్యా...

**- సలీం**

# ఆదర్శవంతం 'మణి'గారి "అనుబంధాలు" కథా సంపుటి..!!

- శైలజా మిత్ర,
ఫోన్ 9290900879

**అమ్మ** అందరికీ ఉంటుంది. ఆదరణ ఎందరికి దొరుకుతుంది? ఆలోచన అందరికీ ఉంటుంది. కానీ ఆచరణలో ఎందరిలో ఉంటుంది? ఆవేశం అందరిలో ఉంటుంది. కానీ ఆశయం ఎందరిలో కనిపిస్తుంది? అనేవి నేటి సమాజంలో జరిగే దుస్సంఘటనల తీరులో సాగిపోతున్న సామాన్యుల వ్యర్థ జీవితాలు..! బతకలేక బతుకుతున్న నిర్జీవపు చలిమంటలు..! రచయిత అబ్దుస్సత్తార్ గారి అనుబంధాలు కథానిక సంపుటిలో ప్రతి అక్షరం జరుగుతున్న వైపరీత్యం తాలూకు ఆనవాళ్ళు నన్ను ఆసాంతం తడిమి తడిమి బుట్టకెత్తుకుంటున్న అనేక జీవితాల మజిలీలను జ్ఞాపకం చేస్తాయి.

కథ వినిపించే వాస్తవాన్ని తేటతెల్లం చేసే అమృత వ్యధ! కథను చదివితే ఎందరు మారుతారు? మారుతారా లేదా? అసలు ఎంతమంది చదువుతారు? అనేవి సమాధానం లేని ప్రశ్నలనుకుంటే మేధావులు పట్టరు. పుట్టినా ఆలోచించరు. ఆలోచించినా దారిచూపే ప్రయత్నం చేయరు. రచయితలు సమాజ నిర్దేశకులు, మార్గదర్శకులు. అల్లంత దూరాన ఉన్న సమస్యను సామరస్యంతో సానుకూలం చేసే మహనీయులు. అదే నిజమనిపించింది. ఈ 'అనుబంధాలు' చదువుతుంటే! ఒక్కసారి ఖుర్ఆన్‌లోని మాటలు ఆకళింపు చేసుకుంటే 'సూర్యుడు సాక్షిగా, అతని ఎండ సాక్షిగా, దేదీప్యమానం చేసేటప్పుటి పగలు సాక్షిగా, సూర్యుణ్ణి మరుగున పరిచే రాత్రి సాక్షిగా, ఆకాశం సాక్షిగా, దీన్ని నెలకొల్పిన వాడు సాక్షిగా, నేల సాక్షిగా, దాన్ని పరిచినవాడి సాక్షిగా, మానవాత్మ సాక్షిగా, ఆత్మను తీర్చిదిద్ది ఆపై దానికి సంబంధించిన మంచి చెడులను దానికి తెలియజేసినవాని సాక్షిగా, నిశ్చయంగా తన ఆత్మను పరిశుద్ధపరచుకున్న వ్యక్తి సఫలుడయ్యాడు. దానిని అణిచివేసినవాడు విఫలుడయ్యాడు" ఎంత ప్రగాఢమైన వ్యక్తీకరణ? అనిపించకమానదు. వీరి కథలలో

మనస్సాక్షిని నమ్ముకున్న ఒక మిత్రుడు కనిపించాడు. మనో నిబ్బరపు ఛాయలు కనిపించాయి. మానవత్వపు నీడలు వెన్నంటి నడిచాయి. దైవ సంబంధిత గుణాలు జాలి, దయ, కరుణ, క్షమ లాంటివి సాక్షాత్కరించాయి.

తల్లి తండ్రి, వారి ఒకే ఒక్క ముద్దుల కూతురు ఉన్నారు. ముచ్చటైన సంసారం. చల్లగా సాగిపోతోంది. దేవుడు మానవులను పరీక్షించటానికే సృష్టించాడేమో అన్నట్లు ఉన్నట్లుండి కూతురు హసీనాకు బ్రెయిన్ ట్యూమర్ రావడం, లక్షలు పోస్తేగానీ బతకదని డాక్టర్లు చెప్పడం జరుగుతుంది. తల్లిగా ఆయెషా తన బిడ్డను బతికించు కోవడానికి కన్నీరు మున్నీరుగా విలపిస్తుంది. ఆపరేషన్ కోసం ఎలాగో ఒకలాగా డబ్బును సర్దుబాటు చేసి బిడ్డను బతికించమంటూ భర్తను వేడుకుంటుంది. కానీ వారి ఆదాయం ఎప్పటికి లక్షలకు చేరాలి? ఎప్పుడు బిడ్డను బతికించుకోవాలి? అలాంటి అజీంకు ఆఫీసులో పనిచేసే చోట శివరాం అనే వ్యక్తి ఓ పనిచేసి పెట్టడానికి యాభై వేల రూపాయల పర్సు లంచంగా ఇవ్వజూపుతాడు. డబ్బు చూశాక ఎన్నో గుర్తుకువస్తాయి. భార్య ఏడుపు, బిడ్డ స్థితి లాంటివన్నీ ఒక్కొక్కటిగా కళ్ళల్లో తిరుగు తాయి. ఊం.... తీసుకో ఒక్కగానొక్క బిడ్డను బ్రతికించుకో అంటుంది అవసరం. వద్దు వద్దు అంటుంది ధర్మం. కానీ ఏమాత్రం తొణకకుండా ఆ సమయంలో కూడా ఆలోచించి 'అధర్మ సంపాదనతో పోషించబడిన శరీరం స్వర్గంలోకి ప్రవేశించదు' అనే మహాప్రవక్త మాటలు గుర్తుకు వచ్చి వెంటనే ఆ పర్సును ఆ వ్యక్తికి తిరిగి ఇచ్చేస్తాడు. అనుకున్న సమయానికి డబ్బు సర్దుబాటు కాకపోవడంతో తాము ప్రాణానికి ప్రాణంగా పెంచుకున్న బిడ్డ చనిపోతుంది. ఇకపై బిడ్డలే పుట్టరని తెలిసిన ఆయెషా గుండెలు పగిలేలా ఏడుస్తుంది. కానీ అజీం భయ్యా మాత్రం తన బిడ్డ ప్రాణం పోయిందని బాధతో కృంగిపోతూనే 'ధర్మం గెలిచిందంటూ సమాధానపడటం ఎంతో అద్భుతంగా ఉంది. కథానికల ద్వారా సమాజానికి మార్పు వస్తుందనే మాట ఇలాంటి కథల నుండే వచ్చిందేమో అనిపించింది. 'ధర్మం చర' కథ ఒక గొప్ప కథగా అనిపించింది.

యువతరం అశ్లీల సాహిత్యం వలన, సినిమాల వలన, సెల్‌ఫోన్ సందేశాల వలన ఎంతగానో పెడదోవనపడుతుందనే విషయం అందరికీ తెలుసు? అందుకు పర్యవసానం ఖచ్చితంగా తెలియజేసిన కథ 'సుడిగుండం' అనే కథలో వీటివల్ల ఒక

అమ్మాయి ఆలోచనలు ఎంత దారుణంగా మారాయో తెలియజేస్తుంది. పైవాటి మూలంగా తన యువత తమ శరీరంలో కలిగిన స్పందనలు ఎంతటి కిరాతకంగా దారితీశాయో తెలిపిన తీరు ఎంతో ఆలోచింపజేసింది. సందేశాత్మకంగా ఉంది. క్షణికావేశంలో చేసిన తప్పుకు ఓ అమ్మాయి తన జీవితాన్ని ఎంతగా పాడుచేసుకుందో అనేది అందరికీ తెలిపేలా ఉంది.

కుల మతాలు మనుషులను వేరు చేయలేవు. అందరిలో ఉన్న రక్తం ఒకటే అని పెద్దలు ఎంతగా నీతిబోధనలు చేస్తున్నా ఈ రోజుల్లో ఇంకా పెద్ద కులం, నిమ్న జాతి కులం అనే వ్యతిరేక పదాలు రాజ్యమేలుతూనే ఉన్నాయి. 'పరివర్తన' కథలో ఒక బ్రాహ్మణుడు కులం తక్కువ వారిని చూడకూడదని, వారితో మాట్లాడకూడదనే చాదస్తంతో జీవిస్తుంటాడు. మునీర్ భాయ్ అనే స్నేహితుడు తన స్నేహితుడిలోని ఛాందసభావాల్ని ఖండిస్తూనే ఉన్నా, శాస్త్రిలో మార్పు తేలేకపోతాయి. కానీ ఒకనాడు శాస్త్రి భార్య కృష్ణవేణికి ప్రాణాంతక వ్యాధితో బాధపడుతూ రక్తం కావాల్సి వస్తే ఆఖరికి మునీర్ భాయ్, తను అంటరానివాడుగా తూలనాడిన రిక్షావాడు మద్దిలేటి ఇరువురి రక్తం సరిపోవడంతో అందించడం కృష్ణవేణి బతకడం జరుగుతుంది. అప్పుడు శాస్త్రికి బుద్ధిరావడం, తన మాటలకు తానే సిగ్గుపడేస్థితికి దారితీస్తుంది. ఈ కథలో మునీర్ భాయ్ పాత్ర ఎంతో సజీవంగా వాస్తవంగా ఉంది. కథాపరంగా, శైలిపరంగా ఎంతో ఆకట్టుకుంటుంది. మనుషులు తమ ప్రాణం మీదికి వస్తేనే తప్ప మారరు కదా అనిపిస్తుంది.

ఒకవైపు ఆకలితో చెత్తకుండీ దగ్గర నిలుచుని పారేసిన మెతుకుల కోసం ఎదురుచూస్తున్న ఒక చిన్నారి తనకు దొరకాల్సిన అన్నం మెతుకులు పందులు తింటాయేమో అని తరమడం లాంటి దారిద్ర్యం రాజ్యమేలుతుంటే మంత్రులు ప్రధాన మంత్రులు తమ తమ పర్యటనలకు కోట్ల రూపాయలు ఖర్చుపెట్టడం లాంటివి ఎంతవరకు సమంజసం అని నిలదీసే కోణంలో 'ఆకలి రాజ్యంలో రాజభోగాలు' అనే కథ ఎంతో ఆకట్టుకుంటుంది. ఇలాంటి కథానికలు నేటి సమాజానికి ఎంతో అవసరం అనిపించింది.

స్నేహానికి కులం, మతం ఉండవని అదే జీవితానికి అన్వయించుకుంటే ఎంత తేడా ఉంటుందో వివరించే కథ 'దోషం ధర్మానికి కాదు' కులమతాలు అన్నీ

ఒకటే అవ్వడానికి ముస్లింలు గుడిలోకి రావాలన్నా, అదే హిందువులు మసీదులోనికి వచ్చి పూజించాలన్నా ఇంకా కొంతకాలం పడుతుందనే విషయం తెలపకనే తెలిపిన తీరు ఎంతో హృద్యంగా మలిచారు.

ఈ గ్రంథంలోని ప్రతి కథానిక మానవ జీవితాల చుట్టూ పరిభ్రమిస్తుంది. సమాజ వాతావరణంలో కానీ, ఇంటి వాతావరణంలో కానీ నిరంతరం మనిషి చేస్తున్న తప్పులు సరిదిద్దే ప్రయత్నం చేస్తాయి. ఈ కథల ద్వారా మంచితనానికి, మానవత్వానికి ఒక దారి కనిపిస్తుంది. ఇంకా ఈగ్రంథంలో అర్తనాదం, మచ్చ, ఏం మనుషులో; అమానుషం, అనుబంధాలు, ఆచరణలేని ఆరాధనలేల?, ఓటి బతుకులు కథలు మనిషి నిత్యజీవిత విధానంలో ఖచ్చితంగా సంచలన మార్పులు తీసుకువస్తాయనే చెప్పాలి. కథానికను నడిపే తీరు, కథనం, పాత్రల సంభాషణా తీరు, రచయితగా అభివ్యక్తీకరణ అన్నీ సరికొత్త కోణాల్ని ఎంచుకున్నాయి. మంచి కథానికలు కనిపించడంలేదనే ప్రముఖులకు మణి గారి కథానికలు తృప్తిని ఇస్తాయి అనడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

కథ మనది. మనిషి జీవితంలో ఎదురయ్యే ప్రతి సమస్య మనిషిలో మార్పు తేవడానికే తప్ప మరేదీ కాదనే సత్యాన్ని చాటిచెప్పిన ఈ గ్రంథం ఎందరికో మార్గదర్శకం అవుతుంది. మరిన్ని కథానికలతో ఇలాంటి మరో గ్రంథం రావాలని ఆకాంక్షిస్తూ... అభినందిస్తూ

**– శైలజా మిత్ర**

# మనవి

**సుఖ** దుఃఖాలూ, ఆనందాలూ, ఆవేదనలూ కలగలుపుకొని సంతరించుకొన్న అదృశ్య దృశ్యాల సంకలనాలే మానవ జీవితాలు. జీవితంలో అవి అవిభాజ్యాలు. విషాదం ఎవ్వరికీ వినోదంకాదు. విషాదం అందరికీ విషాదమే కాని మానవజాతి మానవత్వాన్ని కోల్పోవడం అన్ని విషాదాలలోకెల్లా మహా విషాదం. మానవ సమాజాలలో తారసిల్లే అన్ని రుగ్మతలకూ అదే మూలకారణం. నైజసిద్ధంగానే భావవైరుధ్యాలు గల మానవ జాతి విశ్వాసాలలో కూడా వైవిధ్యం ఉండటం అసహజమైన విషయమేమీ కాదు. కాని సత్సమాజ నిర్మాణం, ధర్మ సంస్థాపనలో అందరి విశ్వాసం ఒకటిగానే ఉంటుంది, ఉండాలి కూడా. కాలగర్భంలో కలిసిపోయిన గత సమాజాలలో లాగే సమకాలీన సమాజం కూడా ఓ సంక్షేమ సమాజ స్థాపనే కోరుకుంది. వాటికిలాగానే దీనికి కూడా సంక్షోభాలే కళ్ళ ఎదుట ఎంతటి ఘోర కరాళ నృత్యం చేస్తున్నాయంటే దానవత్వమే సిగ్గుతో తలలు దించుకునేలా మహిళలపై జరుగుతున్న ఘోర అత్యాచారాల తీరు, కనుపాపలా కాపాడవలసిన కసాయి కన్న తండ్రుల నీడలే కన్నకూతుళ్ళ పాలిట కాలనాగు పడగ నీడలుగా మారిపోతున్న మానవ సమాజంలో ఇక మానవతను ఎక్కడని వెతుక్కోవాలి? ఎన్ని కళ్ళను తడుపుకోవాలి?? ఎన్ని గుండెలను తడుముకోవాలి??? పతనాలు పరాకాష్టకు చేరు కున్న సమాజం ఏం చేసుకోను?

వైఫల్యాలకు సరైన కారణాలను వెతుక్కోవడం మరిచి, విషణ్ణ వదనాలతో విలపించడం మాని సమాజం దానినే విలాసంగా భావిస్తూ చిందులు వేస్తూ ఉ ండటం నిజంగానే మహా విషాదం. స్వయంకృతాపరాధాలతో పేర్చుకున్న చితులకు చేజేతులా నిప్పంటించుకుని కాలిపోతున్న సమాజాన్ని స్వయాన ఆ సమాజంలోని ప్రజలే ఆర్పివేసుకోవాలి. లేకపోతే మానవీయ విలువలను హారతిగా చేసి సాధించుకున్న అశాశ్వత భౌతిక అభివృద్ధి ఫలాలను ఆస్వాదించటానికి ఒక్కరూ మిగలకుండా పోయేప్రమాదం పొంచి వుంది.

అనాదిగా పరిఢవిల్లుతున్న ఆధ్యాత్మికతా భావాలతో ఎంతో సారవంతమైన ఈ పుణ్యభూమి తన జానాల నైతిక పతనంతో మైలపడి నిజ దైవభావనా సరోవర

జలాలతో తలంటి తనను పునీతం చేయమంటూ రోదిస్తోంది. కనీస అవసరాలు సైతం తీరకపోయినా తీరని వెతలతో వేదనలే తన ఆహారంగా చేసుకొని మనుగడ సాగిస్తున్న కన్నీటి బ్రతుకులూ, వారి కన్నీళ్ళు తుడవటానికి సదా మధనపడే సహృదయులూ, వారిని చేతనలనుగా మలచటానికై తమ కలాలను పరుగులు తీయిస్తున్న సాహితీవేత్తలు, సర్వజన సంక్షేమ కాంక్షులు, సమాజ హితైషులు ఆశల నీలాకాశంలో నవ తరానికి తారకలైన అభ్యుదయ భావాలు గల యువతరమే ఈ దేశానికి నిజమైన సంపద. వీరి సమిష్టి కృషితోనే సమాజంలోని బాధా సర్పదష్టుల కన్నీళ్ళు ఆవిరి కాగలుగుతాయి. అలా కాని నాడు ఆ కన్నీళ్ళ వరదలే అందరినీ ముంచివేస్తాయి.

ఏదేని కథా అంశం ఒక సమస్యను వేలెత్తి చూపేదిగా మాత్రమేకాకుండా దానికి పరిష్కారం చూపేదిగా కూడా ఉన్నప్పుడే అది సమగ్రమవుతుంది అనే భావనతో పూర్తిగా ఏకీభవిస్తూ ఆ సమస్య పరిష్కారానికి భావసారూప్యత గల సమాజ హితైషులందరినీ భాగస్వాములుగా చేయటం సముచితం, సమంజసం అనే కోణంలో ఈ కథా సంపుటిలోని కథా అంశాలలో సమస్యల పరిష్కారానికై పాఠకుల భావాల వెనువెంట నడవాలని అనుకోవటమే చాలా కథల్లో పరిష్కారం కనబడకపోవడానికి కారణమని వినమ్రతతో తెలుపుకుంటున్నాను.

చివరి మాటగా నన్ను ఒక రచయితగా గుర్తిస్తున్న వారెవరైనా ఉంటే అది నా భావ వ్యక్తీకరణ యెడ వారి సహృదయతకు ఆనవాళ్ళు మాత్రమేఅని సవినయంగా విన్నవించుకుంటున్నాను. నా ఈ గోరంత ప్రయత్నానికి కొండంత స్ఫూర్తినిచ్చిన ఈ అమూల్య రతనాలను పాఠకులకు పరిచయం చేయలేకపోతే ఈ అక్షర వాహినికి అన్యాయం చేసినవాడినవుతానని భావిస్తున్నాను.

1) **"మీలో ప్రజలను మంచివైపునకు పిలిచేవారూ, మేలు చేయండి అని ఆజ్ఞాపించేవారూ, చెడు నుండి వారించేవారూ కొందరు తప్పకుండా ఉండాలి. ఈ పని చేసేవారే సాఫల్యం పొందుతారు."** (ఖుర్ఆన్ 3: 104)

(ప్రజలను మంచివైపునకు పిలుపునివ్వడం, వారిని చెడు నుండి వారించడం ధర్మంలో భాగంగా, మోక్షానికి మార్గంగా చెప్పడం జరిగింది.)

2) **"ఆ ఉపద్రవం నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి. దానివల్ల కలిగే**

**హాని ప్రత్యేకంగా మీలో పాపం చేసిన వారికి మాత్రమే పరిమితమై ఉండదు"** (దివ్యఖుర్ఆన్ 8: 24)

(అంటే సమాజానికి చెడుల వల్ల కలిగే ఆ ఆపదలో కేవలం పాపం చేసినవారు మాత్రమే చిక్కుకోరు. అలాంటి సమాజంలో ఉండటాన్ని సహిస్తూ మౌనప్రేక్షకుల్లాగా ఉండిపోయేవారు కూడా అందులో చిక్కుకుంటారని భావం.)

3) చివరి ప్రవక్త ముహమ్మద్(స) ఇలా ప్రవచించారు : **"ఎవరి వల్ల మానవాళికి శ్రేయస్సు కలుగుతుందో వారే శ్రేష్టులు."**

"మీలో ఎవరు చెడును చూస్తారో దాన్ని చేతితో (బలంతో) ఆపాలి. అంత శక్తి లేకపోతే నోటితో (మాటలతో), అదీ సాధ్యంకాకపోతే హృదయంతో. ఇది విశ్వాసంలో అత్యంత హీనస్థాయి." (అంటే, చెడును ఆపటం ఆ సమాజంలోని ప్రజల ధార్మిక, సామాజిక బాధ్యతగా చేయబడింది) రోగగ్రస్త సమాజానికి ఇది దివ్య ఔషధం.

ప్రముఖ సాహితీవేత్తలు డాక్టర్ ద్వా.నా. శాస్త్రి, శ్రీ సలీం, శ్రీమతి శైలజామిత్ర గారలు సహృదయంతో నా కోరికను మన్నించి అడిగిందే తడవుగా నా కథానికల యెడ వారి అమూల్యమైన అభిప్రాయాలు అభివ్యక్తం చేసినందుకు వారికి నా ధన్యవాదాలు, నిండా కృతజ్ఞతలు. నాలాంటి వాళ్ళు ఎవో కొన్ని పుస్తకాలను చదివి ఏదో కొంత రాయటానికి ప్రయత్నిస్తారు. రచయితల మనసులను చదివేవాళ్ళు కూడా ఉంటారనేది వారి ముందు మాటలతో నిజమనిపించింది.

హైదరాబాద్ నుండి వెలువడే 'గీటురాయి'తెలుగు వారపత్రికలో తొలుత ఈ కథానికలను ధారావాహికంగా ప్రచురించి నన్ను ఎంతగానో ప్రోత్సహించి, ఇప్పుడు ఈ కథాసంపుటిని పుస్తక రూపంలో ప్రచురించిన తెలుగుఇస్లామిక్ పబ్లికేషన్స్ట్రస్ట్ సంపాదకవర్గానికీ, సిబ్బందికీ పేరుపేరునా కృతజ్ఞతలు అర్పించుకుంటూ..

మీ

**– అబ్దుస్సత్తార్ మణి**

9247313496

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# 1

# ధర్మం చర

మానవ సమాజాలు కలలు కంటున్న ఓ సత్సమాజ సంస్థాపనం వాటి సృష్టికర్త అయిన దైవం వాటికి ఆదేశించిన జీవన విధానంపై మనుగడ సాగించినప్పుడే సాధ్యం అనే విశ్వాసం నరనరాల్లో జీర్ణించుకుపోయింది అజీం భయ్యాకు. ఆయనతో తారసపడే వారందరికి ఆయన ఓ కారుణ్య సరస్సు. సకల అధర్మ ఇన్‌కంలకు 'కంఇన్' అంటూ స్వాగతిస్తున్న మనసులు మసలుతున్న సమాజంలో అజీం భయ్యా హృదయ కవాటాలపై వాటికి ఎప్పుడూ "నో అడ్మిషన్" అక్షరాలు ప్రత్యక్షమౌతాయి. "మానవ జీవితం అశాశ్వితం. తరలిపోయేకాలం దాపురించినప్పుడు చేసే విశ్వప్రయత్నాలు మూకుమ్మడిగా చేతులెత్తి దానికి వీడ్కోలు చెప్పడం వినా మరేమీ చేయలేవు. మానవరాశికై దైవం ఆదేశించిన ధర్మం శాశ్వితం. అశాశ్విత మానవ జీవితం కోసం శాశ్విత ధర్మాన్ని బలిచేయటం అధర్మం. యావత్ మానవాళికి అవసరమైన శాశ్విత దైవధర్మ పరిరక్షణలో అశాశ్విత మానవ దేహం ఒరిగిపోయినా తరిగిపోయేదేమీ ఉండదు. అలా అది ఒరిగి పోవటమే ధర్మం అనే భావనకు అంకితమై పోయాడు అజీంభయ్యా. ఆయన ఆశయాలకు ఆచరణకు పువ్వు తావిలాంటి అనుబంధం. ఆ ఆఫీసులో అలాంటి ఆయన ఒకే ఒక్కడు.

తనను బలపరిచేవారిపై బలప్రయోగం చేస్తుంది ధర్మం, నిగ్గు తేలినవారిని చూడాలనే దాని నైజంగా. కాలం పెట్టిన ఎన్నో పరీక్షల్లో తన విశ్వాసబలంతో నెగ్గుతూ వచ్చిన అజీం భయ్యాకు ఇప్పుడు ఓ పెద్ద పరీక్ష "ఇప్పుడేమంటావ్!" అంటూ గాండ్రిస్తూ నిలువెత్తుగా నిలిచిన ఆ పరీక్ష తనముందు మరుగుజ్జుగా కనిపిస్తున్న అజీం భయ్యా వైపు చూస్తూంటె ఇంటిల్లిపాది వణికిపోయారు. తన భావాలకు చేదోడుగా నిలిచిన తన అర్ధాంగి ఆయిషా నిస్సహాయంగా కంటికి మంటికి ఏకధారగా విలపిస్తూ ఉ ంది. తన పాతికేళ్ల ప్రాయంలో పెళ్లయిన పదిహేనేళ్లకు అందరూ ఆశలు వదులుకున్న సమయంలో అల్లాహ్ కారుణ్యం ఓ అందాల బొమ్మ రూపంలో తనను నాన్నా అనిపిలవటానికి తన జీవితంలో ప్రవేవించింది. కష్టమైన ఆ కాన్పు నాడే చెప్పారు

డాక్టర్లు ఆయిషాకు ఇదే చివరి కాన్పుఅని. పేరుకు తగ్గట్టుగానే కుందనపు బొమ్మలాంటి హసీనా జనాల ముద్దుల వర్షంలో ఎదుగుతూ ఉంది. అస్తమానం అందరినీ అలరించి హసీనా రాత్రి అమ్మానాన్నల ఎదలపై వొరిగిపోయేది. వారు తమ వరాలపంట ముద్దు మోమును చూస్తున్న మైకంలో నిద్రలోకి జారుకునేవారు. హసీనా తన అమ్మ నాన్నలకు ప్రతిరోజు ఉదయం సాయంత్రం తప్పనిసరిగా ఇచ్చేవరం చెరోముద్దు.

కమ్మగా నడుస్తున్న అజీం భయ్యా కాలానికి గ్రహణంలా తనగారాల నాలుగేళ్ల కూతురు హసీనా అంతుతెలియని వ్యాధితో మంచం పట్టింది. రోజు రోజుకూ వ్యాధి పెరుగుతూ ఉంది. విప్పారిన కలువల్లాంటి ఆమె కళ్లు సగం మూసుకు పోయాయి. చిలుకపలుకుల హసీనా నోట "అమ్మ", "అబ్బా" తప్ప మరేమీ వినిపిం చటం లేదు. తల్లడిల్లిపోతున్న తల్లి కన్నీళ్లు ఆరటం లేదు. వైద్య పరీక్షల రిపోర్టు అజీం భయ్యా దంపతులపై వేయి పిడుగులు కురిపించింది. హసీనాకు బ్రెయిన్ ట్యూమర్ మెదడులో అరుదైన కణితి. హైదరాబాద్ తీసుకెళ్లి ఆపరేషన్ చేయించాలి. లేకుంటే దక్కదు. ఇది విన్న అజంభయ్యా భార్య ఆయిషా కుప్ప కూలి పోయింది. అంతా కలిపి అయిదు లక్షలకు పైగానే ఖర్చవుతుంది. కనీసం యాభైవేలయినా అడ్వాన్స్‌గా చెల్లించాలి. ఇంట్లో ఐదు వేలకు కాస్త తక్కువగా  ఉంది పైకం. అయిన వాళ్లంతా పేదవాళ్లే. అధర్మ ఆర్జన కలవాళ్ల వద్ద చేయిచాచటం అజీం భయ్యాకు మనస్కరించదు. స్థానిక డాక్టర్ల చికిత్సతో రోజులు గడుస్తున్నాయి. హసీనా పరిస్థితి నానాటికి దిగజారిపోతూ ఉంది. ఓ వారం రోజులలో ఆపరేషన్ చేయించాలి ఈ లోగా ఏం జరిగినా జరుగవచ్చు. ఆలస్యం చేయటం మంచిది కాదు అన్నారు డాక్టర్లు. ఆ రాత్రంతా భార్యను ఓదారుస్తూనే గడిపాడు అజీం భయ్యా.

ఉదయాన్నే హొటల్‌కెళ్లి నాలుగు ఇడ్లీలు తెచ్చి తాను రెండు తిని బలవంతాన భార్యకు ఒక ఇడ్లి తినిపించగలిగాడు. కడుపులోకి వేసిన ట్యూబ్‌లో నుంచి కాసిన్ని పాలుపోశాడు హసీనాకు. హసీనాను అలా చూస్తున్న అజీం భయ్యాకు ఆనాడు ఎందుకో దుఃఖం కట్టలు తెంచుకుంది. హసీనా ముఖాన్నంతా ముద్దులు పెట్టుకుంటూ చంటి పిల్లాడిలా భోరున ఏడుస్తున్నాడు. ఆ దృశ్యం చూసిన అజీం భయ్యా భార్య బిడ్డకు ఏమైందోనని భయపడి కెవ్వున కేకపెట్టింది. పరుగున వచ్చిన పొరుగువారు "పాకు ఏమీకాలేదు... అంటూ ఉంటే వారిలో అజంభయ్యా స్నేహితుడొకడు" "అజీం.... నీవుకూడా ఇలా.... అంటూ ఉండగా మధ్యలోనే "అవునురా... ఇంతకాలం దేన్నీ ఆశించకుండా బ్రతికాను.... నా బంగారుతల్లి లేకపోతే నేను బ్రతకలేనురా...

బ్రతకలేను....” అంటూ అతణ్ణి పట్టుకొని భోరున ఏడ్చాడు.... అజీం భయ్యా. “సరే... సరేలే..... వదినెకు ధైర్యం చెప్పవలసినవాడివి నువ్వే ఇలా అయిపోతే ఎలా?.... అంతా అల్లా నిర్ణయం.... ” అంటూ ఓదార్చి ఎవరిదారినవారు వెళ్లిపోయారు. ముఖంపై కాసిని నీళ్ళు చల్లుకొని కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ అన్నీ సర్దుకొని యాంత్రికంగా ఆఫీసుకు బయలుదేరుతున్న అజీం భయ్యా ఎదుట చీరె చెరుగుచాచి నిలుచున్న తన భార్య ఆయిషాను చూసి ఆశ్చర్యంతో “ఆయిషా!.... ఏమిటిది.....? మధ్యలోనే అందుకొన్న ఆయిషా కట్టలు తెంచుకున్న దుఃఖంతో “ఏమండీ.... మీ భార్యగా ఇన్నేళ్ల నా జీవితంలో మిమ్మల్ని నేనేమైనా అడిగానా?.... చెప్పండి.... ఏమైనా అడిగానా? ఇదొక్కటే అడుగుతున్నాను.... ఆ తరువాత జీవితంలో ఇంకేదీ అడుగనండీ.... నా చిట్టితల్లిని భిక్షగా అడుగుతున్నాను.... ఈ వేళ ఎక్కడైనా ప్రయత్నించి పైకం తీసుకురండి..... పాపను హైదరాబాద్ తీసుకెడదా మండీ మన బంగారు తల్లిని బ్రతికించుకుందామండీ..... ఇదొక్క సహాయం చెయ్యండీ’ అంటూ విలపిస్తూ భర్త భుజాలపై వాలిపోయి చంటి పిల్లలా భోరున ఏడుస్తూ ఉంది. అంతే వేగంతో పొరలివస్తున్న దుఃఖాన్ని పెదవులతో బిగపట్టి ఆమెతల నిమురుతూ “ఊర్కో ఆయిషా.... ఊర్కో... మానవ జీవితాలలో ఇవన్నీ సహజమే.... అల్లాహ్ మానవులను సృష్టించింది పరీక్షించటానికేగా?..... డబ్బుకోసం ప్రయత్నిస్తూనే ఉన్నాను.... అల్లా అభీష్టమైతే చూద్దాం..... ఓ అర్జెంట్ ఫైల్ కావాలని ఆఫీసర్ ఫోన్ చేశాడు. డబ్బు విషయం కూడా చూడాలి.... అదిగో పాప కదులుతూ ఉంది వెళ్లు” అంటూ బయటికి వెళ్లిపోయాడు అజీం భయ్యా బరువుగా అడుగులు వేసుకుంటూ.

ఆఫీస్ గడియారంలో తొమ్మిది కావస్తుంది. అడుగుపెడుతూనే “నమస్తే సార్..... పాపకు ఎలా ఉంది? అంటూ పలుకరించింది” అప్పుడే తన పని ముగించు కొని చేతులు కడుక్కుంటున్న ఆఫీస్ స్వీపర్ ఆదెమ్మ...” “పాపను హైదరాబాద్ తీసుకెళ్లాలమ్మా” అంటూ కావలసిన ఫైల్ వెతకటంలో పడిపోయాడు అజీం భయ్యా. “పాపను దేవుడు సల్లగా సూడాల” అనుకుంటూ అటువైపు వెళ్లిపోయింది ఆదెమ్మ. కావలసిన ఫైల్ దొరికిపోయింది. ఆఫీస్ టైం కావటానికి ఇంకా నలభై నిమిషాలుంది. దొరికిన ఫైల్‌ను ప్యాడ్‌లో కట్టి టేబుల్‌పై పెట్టి దీర్ఘ ఆలోచనల్లో పడిపోయాడు అజీంభయ్యా. ఫ్యాన్ మెల్లిగా తిరుగుతూ ఉంది. అంతవరకూ ఆవరించిన నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఓ టాటా ఇండికా కారు ఆఫీస్ పోర్టికోలో సడన్‌బ్రేక్‌తో ఆగింది. ప్రముఖ నోవా కన్‌స్ట్రక్షన్స్ మేనేజింగ్ డైరెక్టర్ మహేష్‌బాబు మరో ఇద్దరితో కలిసి

రిసిప్షన్‌లోకి వెళ్లగా వారిలో అజీం భయ్యాకు పరిచయమున్న ఆయన పి.ఏ. శివరాం "గుడ్‌మార్నింగ్ అజీం సార్... మీకోసం ఇంటికెడితే ఇక్కడున్నారని తెలిసి వచ్చాం..... పాపను చూశా.... మీరేమీ కంగారు పడకండి" అంటూ సగం తెరిచి ఉన్న పర్స్ టేబుల్‌పై పెట్టాడు. పర్స్‌లో నుంచి వెయ్యి రూపాయల నోట్లు కనపడుతున్నాయి. నిమిషంపాటు నిశ్శబ్దం... "పాతిక వేలున్నాయి.... ఇంకా ఉంటుంది.... మొన్న చెప్పిన ఆ పనికాస్త.... "నసుగుతూ అలా టాయ్‌లెట్‌వైపు వెళ్లిపోయాడు శివరాం. ఆ హటాత్పరిణామానికి స్థాణువైపోయిన అజీం భయ్యాకు మాటలు పెకలలేదు. "ఆపరేషన్ చేయించకపోతే అమ్మాయి దక్కదు" అన్న డాక్టర్ మాటలు. మంచంపై అరమూత కళ్లతో "అబ్బా" అంటూ పలవరిస్తున్న హసీనా, కాస్సేపటికిత్రమే ఆమె ముఖంపై ఆయన కురిపించిన ముద్దులు. "నా చిట్టి తల్లిని బ్రతికించండీ" అంటూ భార్య తన భుజంపై తలవాల్చి భోరున విలపించిన దృశ్యం ఒక్కొక్కటిగా కళ్లలో తిరుగుతూ ఉంటే ఇంకోవైపు టేబుల్‌పై పర్సులోని కరెన్సీ నోట్లు ఫ్యాన్‌గాలికి కదులుతూ ఉంటే, మరోవైపు "అధర్మ సంపాదనతో పోషింపబడిన శరీరం స్వర్గంలో ప్రవేశించదు.... లంచం పుచ్చుకునే వారినీ ఇచ్చుకునేవారిని మహాప్రవక్త శపించారు..... అనే ప్రవక్త ప్రవచనాలు, ఈ సంపదా సంతానం కేవలం ఐహిక అలంకారాలు మాత్రమే..... ధర్మ, అధర్మాల మధ్య జరిగే పోరాటంలో స్థైర్యం చూపేవారే సత్పురుషులు, వాస్తవంగా సత్యసంధులు" అనే ఖుర్‌ఆన్ సూక్తులు అంతకన్నా పెద్దశబ్దంతో ఘోషిస్తున్నాయి. సంతానంపై ప్రేమపాశం, అధర్మ ఆచరణ ఎడ దైవభీతి, ఈ ధర్మ అధర్మాల పోరులోని హోరులో కురిసిన ముచ్చెమటల్లో తడిసి ముద్దయిపోయాడు అజీం భయ్యా. జీవితంలో ఎన్నడూ అనుభవించి ఎరుగని ఓ తీవ్ర మనో ఘర్షణ. "ప్రభూ! నిఖిలలోక నియామకా" ఒకవేళ మేము ఈ ఖుర్‌ఆన్‌ను ఏ పర్వతంపైనైనా అవతరింపజేసి ఉంటే అది అల్లాహ్ భయం వల్ల క్రుంగి బ్రద్ధలైపోయేది అనే నీ మాట ఎంతనిజమో ఇప్పుడు అర్థమైపోయింది. నిజమే నా స్వార్థం కోసం యావత్ మానవరాశి మనుగడకై నీవు ఆదేశించిన శాశ్విత ధర్మానికి విఘాతం కలిగించటం అధర్మం. ఎన్నో ప్రాణాలు పోయేకన్నా ఒక ధర్మం బ్రతకటం మిన్న. ధర్మం చచ్చిన తరువాత ప్రాణం మిగిలిమాత్రం ఏం చేస్తుంది" అనే తన అంతరాత్మ ఘోష పరాకాష్ట నందుకుంది. కర్చీఫ్‌తో చెమటలు తుడుచుకుంటూ లేచి ఫైల్ తీసుకుని వెడుతూ ఎదురొచ్చిన శివరాంతో "మీ పర్స్ టేబుల్‌పై ఉంది వెళ్లి తీసుకోండి" ముక్తసరిగా అంటూ ఆఫీసర్ గదిలోకి వెళ్లిపోయాడు. అజీంభయ్యా, 'అజీం... రండి... రండి... కూర్చోండి... అమ్మాయికి ఎలా ఉంది?

అంటూ ప్రశ్నించిన ఆఫీసర్‌కు విషయం వివరిస్తూ ఉండగానే ఫోన్ మోగింది. రిసీవర్ తీసుకున్న ఆఫీసర్....ఆc...ఆc... ఇక్కడే ఉన్నారు... మాట్లాడండి... అజీం మీఫోన్" అంటూనే రిసీవర్ తీసుకుని వింటున్న అజీం భయ్యా ముఖ కవళికలు క్షణమొక విధంగా మమారిపోతున్నాయ్.... ఇదిగో ఇప్పుడే వస్తున్నా" అంటూ రిసీవర్ పెట్టేసి "సార్.... అమ్మాయికి సీరియస్‌గా ఉంటే హాస్పిటల్‌కు తీసుకెళ్లారట.... లీవ్ పెట్టి వెడతాను ఇదిగో ఆ ఫైల్...." ఇంకా ఏదో చెబుతూ ఉంటే వినిపించుకోకుండా "అదంతా అలా ఉండనివ్వండి. ముందు మీరు వెంటనే వెళ్లండి' అంటూ గబగబా వెడుతున్న అజీం భయ్యాతో "ఆఫీస్ జీప్ తీసుకెళ్లండి.... డ్రైవర్ లేకపోతే నా కారు తీసుకెళ్లండి" అంటున్న ఆఫీసర్ మాటలు ముగియక ముందే తలుపుదాటి వెళ్లిపోయాడు అజీంభయ్యా. ఎంవతవరకూ స్టార్ట్ కాని తనపాత మోపెడ్‌ను అక్కడే వదలి ఇంటికెళ్లి పైకం తీసుకెడదామని ఆటో ఎక్కాడు. కల్లోల మనసులో లక్షలాది సునామీలు. హసీనాకు ఏదైనా అయితే... ఓ అల్లాహ్ అది జరుగనీయకు! ఇల్లు దగ్గర పడింది. అక్కడ గుమిగూడిన జనాన్ని దూరం నుంచే చూసిన అజీం భయ్యా అమ్మాయిని హాస్పిటల్ నుండి క్షేమంగానే తీసుకొచ్చారనుకున్నాడు. ఇల్లు దగ్గరపడేకొద్ది అక్కడ దృశ్యాలు అజీం భయ్యా ఊహల్ని క్షణక్షణం మార్చేస్తున్నాయి. డ్రైవరుకు పైసలిచ్చి ఆటోదిగి వేగంగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి వెడుతూ ఉంటే కళ్ళు తుడుచుకుంటున్న జనం తప్పుకుంటూ ఉంటే ఇంట్లో అడుగుపెట్టిన అజీం భయ్యాను చూస్తూనే అంతవరకూ చుట్టూముగి పట్టుకొని ఓదారుస్తున్న స్త్రీల గుంపు నుండి బలంగా విడిపించుకొని పెద్దగా కేకపెడుతూ దూసుకువచ్చిన అజీంభయ్యా భార్య ఆయిషా భర్తను చుట్టేసుకుని "ఏమండీ!... వెళ్లిపోయిందండీ నా బంగారు తల్లి వెళ్లిపోయిందండీ... అబ్బా, అబ్బా అంటూ కేకలు పెడుతూ ఎంతకూ రాకపోతే మిమ్మల్ని వెతుక్కుంటూ వెళ్లిపోయిందండీ" అంటూ భర్త ఎదపై పిడికిళ్లతో పిచ్చిగా కొడుతూ భోరున ఏడుస్తూ ఉన్నపాటుగా మౌనంగా ఉండిపోయిన ఆయిషా భర్తవైపు అదోవిధంగా చూస్తూ "ఔనూ.. మీకు పాప కనిపించలేదా?.... కనిపించి ఉంటుంది ఆమెను బ్రతికించుకోటానికి డబ్బు తేలేకపోయిన మీరే ముఖం చాటేసుకుని ఉంటారు. ఔనా... ఔనా.... పిచ్చిగా అంటూ దూసుకెళ్లి హసీనా శవంపై పడి వళ్లంతా ముద్దులతో తడిపేస్తూ ఉంటే అక్కడున్న స్త్రీలు ఆమెను బలవంతంగా పక్కకు తీసుకెళ్లారు. "అంత అందమైన బొమ్మను దేవుడు ఉంచడు... ఆ ఇంత పాపకు అదేం తెలివో... పెద్దోళ్ల మాదిరి మాట్లాడతాది.... పానం పోయేముందు తన తెలివంతా సూపింది. అందరి కెల్లి సూస్తూ తలాం... తలాం అంటూ సలాం చేస్తూ

వెళ్లిపోయింది సిట్టితల్లి" అంటూ గుంపులో నుంచి ఎవరో ఒకావిడ అమాయకంగా చెబుతూ భోరున ఏడుస్తూనే కట్టలు తెంచుకున్న దుఃఖంతో కూతురు శవంపై పడి నుదుటిని గట్టిగా ముద్దు పెట్టుకుంటూ "వెళ్లిపోయావా బిడ్డా... వెళ్లిపోయావా... నాకు అల్లాహ్ హాఫిజ్ జెప్పకుండానే వెళ్లిపోయావా" అంటూ చంటి పిల్లాడిలా భోరున ఏడుస్తున్న అజీం భయ్యాతో "మీరు కూడా ఇలా అయితే ఇక ఆమెను ఎవరు ఓదారుస్తారు?... మాకంతా ధైర్యం చెప్పేవారు మీరూ ఇలా అయితే ఎలా?...." అంటూ ఆయనను అలా పక్కకు తీసుకెళ్లారు అక్కడున్నవారు. అటువైపు అజీం భయ్యా భార్య ఆయిషా ఏదేదో పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ సొమ్మసిల్లిపోయింది.

❖ ❖ ❖

సంస్కారాలైపోయి వారం గడిచినా బిడ్డను పోగొట్టుకున్న షాక్‌తో కోలుకోలేని ఆయిషా పరిస్థితి అప్పుడప్పుడే కాస్త కుదుటపడుతూ ఉంది. పరిచర్యలు చేసుకుంటూ ఆమెను కనిపెట్టుకొని ఉన్న అజీం భయ్యా తన జీవితంలోని ఈ పెద్ద మలుపును జీర్ణించుకోలేక పోతున్నాడు. కళ్లముందు గతం ఆగని చక్రంలా తిరుగుతూనే ఉంది. అంతలో ఆయిషా కాస్త మసలుతూ మగతగా కళ్లు తెరిచి పక్కన కూర్చున్న భర్త కళ్లల్లోకి చూస్తూ ఎక్కడో గుండెల లోతులలో నుండి వస్తున్న బలహీన స్వరంతో "ఏమండీ.... మీరు కాస్సేపు పడుకోండి" అంటూ బిడ్డ గుర్తుకురావడంతో పొంగివస్తున్న దుఃఖాన్ని పెదవులతో గట్టిగా బిగబట్టి ధారగా కురుస్తున్న కన్నీళ్లతో... "ఏమండీ.... నా చిట్టితల్లి ఇక రాదు కదూ... చచ్చిపోయిందండీ నా బంగారు కొండ చచ్చిపోయిందండీ.... చచ్చి పోయిందండీ..." అంటూ భోరున ఏడుస్తూ ఉంటే "ధర్మం బ్రతికింది!...... ధర్మం బ్రతికింది!... ధర్మం బ్రతికింది!" అంటూ అజీం భయ్యా అంతరా త్మ చేస్తున్న ఘోషకు ఆ వీధిలోని మసీదు శిఖరాలనుండి మ్రోగుతున్న అజాన్, మందిరంలోని గంటల సవ్వడి, చర్చిగంట శబ్దాలు అన్నీ కలిసి ఒక్కసారిగా అందుకు వంతపాడుతున్నట్లు చేస్తున్న శబ్దాలతో అవి వినపడకుండా పోయాయి.





# సుడిగుండం

ఆర్నెల్ల క్రితం పట్టణంలో సంచలనం రేకెత్తించిన సునీల్‌హత్యకేసులో ఫైనల్ బి.ఎస్.సి. విద్యార్థిని కుమారి లావణ్యను పోలీసులు స్పెషల్ కోర్టులో హాజరు పరిచారు. లావణ్య తన చీరె చెరుగును తలపై వేసుకొని అడుగులో అడుగు వేసుకుంటూ నేరుగా ముద్దాయి బోనులో ప్రవేశించింది. ఓ క్షణం నిశ్శబ్దం ఆవరించింది. పబ్లిక్ ప్రాసిక్యూటర్ రంగనాథం జడ్జివైపు చూశారు. తన వాదనను ప్రారంభించమన్నట్టు తల ఊపారు జడ్జిగారు.

కోటు సర్దుకుంటూ లావణ్య వైపు రెండు అడుగులు వేసి ప్రారంభించారు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"యువర్ ఆనర్ ఎంతో అమాయకంగా కనిపించే అందమయిన ఈ అమ్మాయి రూపం వెనుక ఓ భయంకర స్వరూపం దాగివుంది. అందమయిన ఆ కళ్ళల్లో ఎన్నో విష వలయాలు ఆవరించి వున్నాయి. కోమలమయిన ఈమె చేతుల్లో కసాయితనం తొంగిచూస్తూ ఉంది. ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ మిస్టర్ రాబర్ట్స్ గారి ఏకైక పుత్రుడు సునీల్‌ను వలలో వేసుకొని కొంత కాలం ప్రేమ కలాపం సాగించింది. పాపం, అభం శుభ తెలియని సునీల్ ఈమె కబంధహస్తాలలో చిక్కుకొని బయటపడలేకపోయాడు. సునీల్ బలహీనతను ఆసరగా తీసుకొని అతని వద్దనుండి లక్షలు కాజేసింది.

"ఆనాడు డిసెంబరు 31వ తేదీ. ఆ సంవత్సరానికి అది చివరి దినం. తన జీవితానికి కూడా అదే చివరి దినమని గ్రహించలేకపోయాడు సునీల్. అలవాటు ప్రకారం హొటల్ మనోహర్‌లో కుమారి వనజ అనే మారుపేరుతో ఈ అమ్మాయి రూం నెంబరు 302ను బుక్ చేసుకొని సునీల్‌ను రూంకు తీసుకెళ్ళింది. రూం బాయ్‌తో విస్కీ తెప్పించి ఎక్కువ మోతాదులో తాపించింది. తప్ప తాగిన మైకంలో నిద్రపోతున్న సునీల్‌ను రాత్రి రెండు మూడు గంటల మధ్య కాలంలో కత్తితో అనేకసార్లు గుండెల్లో

పొడిచింది. మైకంలో మూతపడిన సునీల్ కళ్ళు శాశ్వతంగా మూతపడ్డాయి. హత్యానేరం తనపై పడకుండా తప్పించుకోటానికి ఈ మాయలాడి కేకలు పెడుతూ పెద్దగా ఏడ్వసాగింది. లాడ్జిలోని జనం అంతా రూం వైపుకు పరుగులు తీసి ఆ ఘోరాన్ని కళ్లారా చూశారు. ఇన్నాళ్లు జరిగిన విచారణలో ఈ విషయం నిర్ధారణ అయిపోయింది. "యువర్ ఆనర్, ఐ.పి.సి. సెక్షన్ 302 క్రింద ఈమెకు మరణ శిక్ష విధించకపోతే ఇలాంటి హత్యలు ఇంకెన్నయినా చేస్తుంది కాబట్టి, ఈమెకు మరణ శిక్ష విధించమని మనవి చేస్తున్నాను" అంటూ తన వాదనను ముగించారు పబ్లిక్ ప్రాసిక్యూటర్ విశ్వనాథం.

తెల్లటి షిఫాన్‌చీరె అదే రంగు బ్లౌజుతో, తలపై వేసుకున్న చెరుగు చివరను ఎడమ చేత్తో పట్టుకొని బోనులో నిశ్చలంగా నిలబడి ఉంది లావణ్య.

"అమ్మాయ్! నీ తరపున వాదించటానికి ఎవరైనా ఉన్నారా? అడిగారు జడ్జిగారు ఆమెవైపు చూస్తూ.

లేరన్నట్లు మెల్లిగా తల ఊపింది లావణ్య.

"మరి నీపై మోపబడిన ఈ అభియోగానికి నీవేమయిన చెప్పదలచుకున్నావా?"

"ఔను యువర్‌ఆనర్" అంటూ కొంచెంగా తలపైకెత్తి జడ్జివైపు చూస్తూనే అంతవరకు కళ్లల్లో నిండిన అశ్రువులు చెక్కిళ్లపై జలజలరాలాయి.

"సునీల్‌ను హత్య చేసింది నీవేనా?" అడిగారు జడ్జిగారు బల్లపై ఉన్న పెన్నుకు క్యాప్ బిగిస్తూ.

"అవును... నేనే" అంది లావణ్య ముక్తసరిగా.

"నీకు సునీల్ ఏమవుతాడు?

"ఏ సంబంధమూ లేదు. ఉన్నదల్లా ఒకే సంబంధం... అక్రమ సంబంధం."

"చదువుకున్న దానివి. పెళ్లి కావలసిన దానివి, ఇలాంటి నీచానికి ఎందుకు పాల్పడ్డావు."

ఆ విషయం గురించే చెప్పదలుచుకున్నాను యువర్‌ఆనర్ అని బలహీనంగా అంటూ హాల్లో కూర్చున్న అందరివైపు ఒకసారి కలయజూసింది లావణ్య.

"యువర్ ఆనర్, మీరన్నట్టు నేను చదువుకున్నదాన్నే, సంపన్న కుటుంబం

నుండే వచ్చాను. మా తల్లిదండ్రులు నన్ను ఎంతో గారాబంగా పెంచారు. నాపై గంపెడాశతో పెద్ద చదువులకని నన్ను ఇక్కడికి పంపించారు. కొంతకాలం నా చదువు సాఫీగానే సాగిపోయింది. ఆ తరువాత సమాజంలోని దుష్టశక్తులు తమ పంజాలను ఒక్కొక్కటిగా నాపై విసిరాయి. వాటినుండి తప్పించుకోవటానికి నా శక్తికొద్దీ పరుగులు తీశాను. కాని ఎంతని పరుగెత్తను? ఎక్కడికని తప్పించుకోను? అలసి పోయాను. పరుగులో ఓడిపోయాను. అంతే, ఆ కబంధ హస్తాల్లో చిక్కుకొని నలిగిపోయాను.

"చూడమ్మా! కోర్టు కావలసింది వర్ణన కాదు, వాస్తవం జరిగిందేదో వివరంగా చెప్పు" కళ్ళజోడు సవరించుకుంటూ అన్నారు జడ్జిగారు.

లావణ్య తలపైకెత్తి జడ్జి వైపు తీక్షణంగా చూస్తూ "యువర్ ఆనర్ ప్రతి ఆర్తనాదాన్ని కవిత్వమని, ప్రతి వాస్తవాన్ని వర్ణనని అనుకుంటూ మేధావులు, సంస్కర్తలు తమ కర్తవ్యాలను గాలికి వదిలివేయటం కారణంగానే ఈనాడు యావత్ సమాజం పరిస్థితులకు బానిసైపోయింది. పాఠ్యపుస్తకాలకన్నా ఈనాడు అధిక సంఖ్యలో బూతు సాహిత్యం విలయతాండవం చేస్తూ వుంది. వాటిని ముట్టుకోకూడదని ఎంతగానో ప్రయత్నించాను. కాని ఒకసారి నా స్నేహితురాళ్ల బలవంతం మీద ఇష్టంలేకపోయినా ఒక పుస్తకం చదివాను. అంతే మళ్లీ మళ్లీ చదవాలనిపించింది. ఆ తరువాత అలాంటి ఎన్నో పుస్తకాలు చదివేశాను. అక్కడే నాలో లైంగిక వాంఛలు పెల్లుబికాయి. పుస్తకాల్లో చదివింది అనుభవించాలని తపన ప్రారంభమయింది. కాని సాహసించలేకపోయాను.

"ఈ విషవలయం నుండి బయటపడటానికి మనసు మళ్లించుకోటానికని సినిమాలకు వెళ్లటం ప్రారంభించాను. ఆ లైంగిక విశృంఖలత్వం నన్ను అక్కడా వదల్లేదు. పుస్తకాల్లో చదివింది తెరపై కనబడింది. ఏ సినిమా చూసినా అదే. తెరపై చూసిన సెక్సు సన్నివేశాలు నన్ను మరీ మరీ రెచ్చగొట్టాయి. థియేటర్ నుండి బయటపడి వెడుతూ ఉంటే అంతకన్నా దారుణంగా వివిధ భంగిమల్లో గోడలపైని అశ్లీల సినిమా పోస్టర్లు నన్ను వెక్కిరించాయి. లైంగిక ఆలోచనలతో నా తల పగిలిపోయేది. మనశ్శాంతి కోసం కాస్త రేడియో ఆన్ చేస్తే ద్వంద్వ అర్థాలుగల బూతు పాటలు, టీవీ సన్నివేశాలు నన్ను మరీ కవ్వించేవి. ఈ తాపం భరించలేక అలా పార్కులకు వెళితే పుస్తకాల్లో చదివింది, సినిమాల్లో చూసింది, పాటల్లో విన్నది,

అన్నీ అక్కడ ప్రత్యక్షంగా కనిపించేవి. దాంతో నా హృదయంలో రగులుతున్న కామతృష్ణకట్టలు తెంచుకుంది. నేనూ ఒక మనిషినే. ఆ వేడిని భరించలేకపోయింది నా హృదయం.

"ఈ పరిస్థితుల్లో సునీల్ నాకు పరిచయమయ్యాడు. అనతి కాలంలోనే మా స్నేహం పెరిగిపోయింది. నన్ను పెళ్లిచేసుకుంటానని ప్రమాణం చేశాడు. అందుకు నేను అంగీకరించకపోతే ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. సెక్సుమైకం ఆవరించిన నా కళ్లకు అంతా నిజంగానే కనిపించింది. అంతే కాలుజారిపోయాను. కాలం జరిగిపోయింది. మైకం దిగిపోయింది. అప్పుడు గాని అర్థం చేసుకోలేకపోయాను. సునీల్ పచ్చిమోసగాడని. పెళ్లిచేసుకోమని అడిగితే వెటకారంగా నవ్వాడు. ఇలా చెప్పిన వాళ్లందర్నీ పెళ్లి చేసుకుని ఉంటే నేను నూట ఒకటో భార్యనౌతానని అన్నాడు."

ఆ తరువాత హఠాత్తుగా ఆగిపోయింది లావణ్య. పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోటానికి వణుకుతున్న పెదాలను మునిపళ్లతో అదిమిపట్టడానికి ప్రయత్నిస్తూ.. అంది. "కాళ్లు పట్టుకుని ప్రాధేయపడ్డాను. నాకోసం కాకపోయినా నా కడుపులో పెరుగుతున్న బిడ్డకోసమయినా నన్ను పెళ్లిచేసుకోమని." "అయినా ఆ కిరాతకుడికి జాలి కలుగలేదు. పట్టుకున్న కాళ్లతోనే నన్ను బలంగా తన్నాడు. యువర్ ఆనర్.. కడుపులో పెరుగుతున్న పసికందుని కూడా కనికరించలేదు యువర్ ఆనర్..." అంటూ పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక వలవల ఏడ్చింది లావణ్య.

"విపరీతమైన బాధతో నేను కాస్సేపటిదాకా లేవలేకపోయాను. అప్పటిదాకా నాలో అణగివున్న కసి ఒక్కసారి బుసలుకొట్టింది. వీడు బ్రతికి ఉంటే నాలాంటి ఇంకా ఎంతమంది కన్నె పిల్లల జీవితాలు నాశనం చేస్తాడో. నేను చచ్చినా పరవాలేదు. వాడిని చంపాలనుకున్నాను. మైకంలో బాగా నిద్రపోతున్న సమయంలో నేను వాడి గుండెల్లో కత్తితో కసితీరా పొడిచాను. ఔను నేనే చంపాను యువర్ ఆనర్! ... వాడిని నేనే చంపాను. కసితీరా పొడిచాను" అంటూ రెండు చేతులు ముఖానికి పెట్టుకొని బోనుకర్రపై తలవాల్చి భోరున ఏడ్వసాగింది లావణ్య.

కోర్టు హాలులో అందరూ గుండెలు బిగబట్టుకున్నారు. కొందరి కళ్లు చెమ్మగిల్లాయి... కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది.

లావణ్య మెల్లిగా తలపైకెత్తి కళ్లు పెద్దవిగా చేసి

"ఇక్కడ కూర్చున్న పెద్దమనుషులూ, అండ్ యువర్ ఆనర్! ఇప్పుడు చెప్పండి. నా పతనానికి కారణం ఎవరు? హూ ఈజ్ రెస్పాన్స్‌బుల్ ఫర్‌మై ఫాల్? సమాజంలో సినిమా రూపంలో, సాహిత్య రూపంలో, సంస్కృతి కళల పేరిట అశ్లీల, అసభ్యత విశృంఖలంగా విలయతాండవం చేస్తూ యువతరాన్ని భ్రష్టుపట్టిస్తూ ఉంటే మేధావులనబడే వారు ఏనాడయినా పెదవి విప్పారా? సంస్కర్తలని పిలువబడుతున్న మీరు సన్మానాలు చేయించుకొని సంబరపడ్డారే కాని సమాజాన్ని సంస్కరించాలనే ఆలోచన ఏనాడయినా కలిగిందా మీలో? నా పతనానికి కారణం సునీల్ కాదు. మీరు. ముమ్మాటికి మీరే. సమాజంలో చోటుచేసుకున్న అశ్లీలాన్ని, చెడును మొగ్గలోనే తుంచి వేసి ఉంటే ఈనాడు నా జీవితం ఇలా నాశనమయ్యేది కాదు. నేనే కాదు, ఈ సుడిగుండంలో మీ బిడ్డలు, మీ చెల్లెళ్లు, మీ భార్యలు కూడా మునిగిపోతారు... అంతా మునిగిపోతారు.

"యువర్ ఆనర్, ఏ ఆశాలేని దాన్ని నేను శిక్షకు భయపడటం లేదు. అయినా నన్ను శిక్షించటం ఈ సమస్యకు పరిష్కారం కాదు. మీరు శిక్షించగలిగితే డబ్బుకు కక్కుర్తిపడి బూతు సాహిత్యాన్ని వ్రాసే వెధవల్ని శిక్షించండి... అశ్లీల సినిమాలు తీసే కుక్కల్ని నడిబజారులో నిలబెట్టి ఉరితీయండి... ఫ్యాషన్‌ల పేరిట అర్థనగ్న వస్త్రధారణతో తప్పతాగి సంస్కృతీ సభ్యతలను విడిచి నడిబజారులో చెట్టాపట్టాలు వేసుకొని అసభ్యంగా తిరిగే కోతులను కొరడాలతో కొట్టించండి."

అంటూ ఆవేశంతో లావణ్య చెబుతుండగానే గడియారం 5గంటలు కొట్టింది. "తీర్పును రేపటికి వాయిదా వేస్తున్నాను." అంటూ చలించి పోయినట్లుగా కనిపించిన జడ్జీగారు కుర్చీనుంచి లేచారు. మిగిలిన వాళ్లంతా నిట్టూర్పు విడిచి ఏదో ఆలోచిస్తున్న వారిలా బయటికి నడిచారు.



# 3

# పరివర్తన

'పి. శ్రీనివాసశాస్త్రి' మసకబారిన నేమ్ బోర్డ్ చూస్తూనే "హమ్మయ్యా... ఊరంతా తిప్పావు గదరా శ్రీనివాసా తృప్తిగా మనసులో అనుకుంటూ కాలింగ్ బెల్ నొక్కిన కొద్ది క్షణాల్లోనే

"ఆఁ... ఎవరూ... వస్తున్నా... వస్తున్నా ఉండవయ్యా బాబూ" అంటూ తలుపు తెరిచి

"ఎవరండీ మీరు... ఏం కావాలి" అంటున్న శాస్త్రిని చూసి తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. పిలకా, సాంప్రదాయక ధోవతి, జంధ్యం, ఒళ్లంతా మంచిగంధపు నామాలు. ఎంచక్కా సినిమా హీరోలా టక్ చేసుకొని స్కూటర్‌పై చక్కర్లుకొట్టిన శాస్త్రి వీడేనా అనిపించింది.

మునీర్‌భాయ్‌ని తదేకంగా చూస్తూ గుర్తు తెచ్చుకోటానికి శాస్త్రిగారు అతికష్టంగా ప్రయత్నిస్తున్నట్టనిపించింది.

"శాస్త్రీ... నేను... నేనురా... మునీర్‌ను" మాట పూర్తి కాకముందే అందుకున్న శాస్త్రి

"ఒరేయ్ మునీర్... నువ్వటరా... అమ్మో! అమ్మో!! ఎంతకాలమైంది నిన్ను చూసి" అనుకుంటూ ఇద్దరూ అమాంతంగా కౌగిలించుకున్నారు. ఆ ఉద్వేగంతో శాస్త్రిగారు మడిలో ఉన్న విషయం కూడా మరిచిపోయారు.

గత స్మృతుల సంచారంలో గంటల సమయం క్షణాల్లా గడిచిపోయింది. కాఫీ ఫలహారాలు యాంత్రికంగా జరిగిపోయాయి. శాస్త్రిగారు తన ఈడొచ్చిన పిల్లల్ని మునీర్‌భాయ్‌కు పరిచయం చేశాడు.

"చిన్న చిన్న బుడతలు. ఎంతవాళ్లయ్యార్రా.... అవునూ ఇందాకటి నుంచి చూస్తున్నాను. క్రిష్ణవేణమ్మ వదిన ఎక్కడ? అడిగాడు మునీర్‌భాయ్.

"ఆమె ఆరోగ్యం బాగా లేదురా... హాస్పిటల్‌లో అడ్మిషన్‌లో ఉంది" అన్నాడు శాస్త్రి విచారంగా.

"అలాగా... జనరల్ హాస్పటల్‌లోనేనా"

"అవును"

"వెళ్లి చూస్తాను... వదిన చేతి పొంగల్ తరుచూ జ్ఞాపకం వస్తూ ఉంటుంది అన్నాడు మునీర్ గతాన్ని గుర్తు చేసుకుంటూ.

"ఐనా... నువ్వేంటి... ఇలా అచ్చంగా ముల్లాలా తయారయ్యావు" అన్నాడు శాస్త్రి నవ్వుతూ.

"నువ్వేమో తక్కువ తిన్నట్టు... నూరుపాళ్ల పురోహితుడవయ్యావు" ఇద్దరూ నవ్వుకున్నారు.

ఇంటి ముందు రిక్షా ఆపి ఒక చేతితో క్యారియర్, మరో చేతిలో ఫ్లాస్క్ పట్టుకొని వస్తున్న ఆ రిక్షా అబ్బాయిని చూస్తూ, "ఇవన్నీ నీతో ఎందుకు పంపిందిరా... ఛ... ఎంత చెప్పిన అర్థం కాదు ఆవిడగారికి.... విసుగు, కోపం, అసహనం మేళవించుకుంటూ అన్నాడు శాస్త్రి.

"అమ్మగారు ఇచ్చారండి" అణుకువగా భయపడుతూ అన్నాడు రిక్షావాడు.

"అఘోరించావులే... పెరట్లో పెట్టి వెళ్లిపో" కాస్త హెచ్చు స్వరంతో అన్నాడు శాస్త్రి చీదరింపుగా.

కరుడుగట్టిన ఛాందసభావాలు స్పష్టంగా గోచరించిన మునీర్‌భాయ్‌కు ఆ దృశ్యం సంకటంగా తోచింది.

"శాస్త్రీ... ఏమిటిరా ఇది.... అన్నీ తెలిసిన వాడివి... ఈ కాలంలో కూడా... మునీర్ మనస్తత్వాన్ని తెలిసిన శాస్త్రి మధ్యలోనే అందుకుని "తెలిసినవాణ్ని కాబట్టే అన్నాను... వాళ్లను తాకితే మైలపడిపోతాము." అన్నాడు శాస్త్రి అసహ్యం వ్యక్తపరుస్తూ.

"వాళ్లూ మనలాంటి మనుషులేగా? అన్నాడు మునీర్‌భాయ్ జాలిగా"

"పూలన్నీ ఒకటేనంటావా?... ఉమ్మెత్త పూలు పూజకు పనికివస్తాయా?"

ఒకే రక్తం గల మనుషులను ఎన్నో రకాల రంగులపూలతో పోలికా!.. అన్నాడు మునీర్ శాస్త్రిని సమాధానపరచటానికి ప్రయత్నిస్తూ.

"ఆ మాటకొస్తే వీళ్ల రక్తంలోనే ఉంది దోషమంతా... మలిన రక్తం... అందుకే వారి మనసూ, దేహం అంతా మురికే... వారిది మురికి జన్మ" నరనరాల్లో కరుడుగట్టిన ఛాందసభావంతో కసిగా అన్నాడు శాస్త్రి.

శాస్త్రిగారి సంకుచిత తత్వంపై మునీర్‌భాయ్‌కు జాలితోపాటు అసహనం కూడా చోటుచేసుకుంది. ఎదుటివారికి నచ్చకపోయినా సామాజిక ధర్మాన్ని కుండబద్దలు కొట్టేలా మాట్లాడే మునీర్‌భాయ్.

"వారు అంత మురికివారు... నీచులు.. నికృష్టులు అయితే వారితో పల్లకీ మోయించుకోవటం మాత్రం ఎందుకు? వారితో ఎందుకు పనులు చేయించుకుంటారు?' అన్నాడు మునీర్‌భాయ్.

"అల్పులు.. అధములు కాబట్టే వారికి ఆ శిక్ష" ఏవగింపుగా అన్నాడు శాస్త్రి.

ఇక శాస్త్రితో వాదించటం వృథా అనిపించింది మునీర్‌భాయ్‌కి.

"ఐనా... శాస్త్రీ... తాపీగా ఆలోచించు... సాటి మనిషిని మనిషిగా గుర్తించలేని మనిషికి మనిషి అనే బిరుదు శోభించదు... ఈ విషయాలు తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాంగాని... టైం అయింది వెళ్లొస్తా ఈ ఊళ్లోనూ బంధువులున్నారు. నాలుగు రోజులు ఇక్కడే ఉంటాను. వదినెను చూడటానికి రేపు ఆసుపత్రికి వెడతాను.' అంటూ లేచాడు మునీర్‌భాయ్.

"ఒరేయ్ మునీర్... రేపు నీవు నా వెంట లంచ్ తీసుకోవాలి. హోటల్ కామత్‌లో నీకోసం ఎదురు చూస్తూ ఉంటాను. తప్పక రావాలి' అన్నాడు శాస్త్రి.

అవున్లే... నీకు నేనూ అంటరానివాడినేగా... అందుకే హోటల్‌కు రమ్మంటున్నావ్" అన్నాడు మునీర్‌భాయ్ నవ్వుతూ ఎత్తిపొడుపుగా.

"అబ్బే... అదేం లేదురా... ఇంట్లో పరిస్థితి చూస్తున్నావుగా."

"ఆఁ నేను కూడా తమాషాగా అన్నాను లేవోయ్".. అంటూ బయట వదిలిన బూట్లను వేసుకొని, శాస్త్రీ వస్తాను మరి" అంటూ వెళ్లిపోయాడు మునీర్‌భాయ్.

ఆనాడు సాయంత్రం ఐదు గంటలు కావస్తూ ఉంది. జనరల్ హాస్పిటల్ తోరాసిక్ వార్డు లోపల ఎంతటి గంభీర వాతావరణం అలుముకుందో బయట అంత రద్దీగా ఉంది. జనం ఉరుకులు పరుగులపై ఉన్నారు... వారి ముఖాల్లో

ఆదుర్దా, ఆందోళనలు అలుముకున్నాయి. అసలు విషయమేమిటి అని అడిగినా ఎవరి నుండీ జవాబు దొరికే చాయలు కనిపించటం లేదు. శాస్త్రిగారి భార్యను చూడటానికి వస్తున్న మునీర్‌భాయ్‌కు అంతదూరం నుండే పరిస్థితి అర్థమైపోయింది. ఎవరో పాపం కష్టాల్లో ఉన్నట్టున్నారు. అనుకుంటూ ముందుకు సాగిపోయాడు.

రెండు చేతులను ముఖానికి అడ్డంగా పెట్టుకుని ఏడుస్తున్న వ్యక్తిని దూరం నుండి చూసిన మునీర్‌భాయ్ గుండె ఆగిపోయినంత పనైంది.

"వాడు... వాడు... శాస్త్రీ ఏమైంది వదినెకు? నడకలో వేగం పెంచిన మునీర్ అందరిని తొలగించుకుంటూ జనంలోకి వెళ్లాడు. మునీర్‌ను చూస్తూనే శాస్త్రి దుఃఖం కట్టలు తెంచుకుంది.

"ఒరేయ్ మునీర్ మీ వదినె దక్కదటరా...." అంటూ మునీర్‌భాయ్‌ను చుట్టేసుకొని చంటి పిల్లాడిలా ఏడుస్తున్నాడు.

"శాస్త్రిని ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు మునీర్ భాయ్‌కు.

"అరె... అరె...ఏం... ఏం అసలు ఏం జరిగిందిరా.. ఉండు... ఉండు.... నీవు ధైర్యంగా ఉండు." అంటూ శాస్త్రి భుజం తడుతూ "ఏమండీ... ఏం జరిగింది" అంటూ పక్కనే ఉన్న శాస్త్రి గారి బంధువుల్లో ఒకరిని చూస్తూ అడిగాడు మునీర్‌భాయ్.

"ఆమెకు ఉదయం నుండి నోటివెంట రక్తం పడుతూ ఉందండి... గంటక్రితం నుండి పరిస్తితి ప్రమాదకరంగా మారిపోయింది... వెంటనే రక్తం కావాలట. ఆమెకు మా బంధువులలో ఎవరి రక్తమూ సూట్ కావటం లేదు. హాస్పటల్‌లో ఆ గ్రూప్ రక్తం లేదట" అన్నాడు ఆ వ్యక్తి.

పరిస్థితి అర్థమైపోయింది మునీర్‌భాయ్‌కి.

"అలాగా... సరే.. పద" అంటూ శాస్త్రిని తీసుకొని బ్లడ్ బ్యాంక్‌వైపు నడిచాడు మునీర్.

మునీర్‌భాయ్ తన రక్తాన్ని పరీక్ష చేస్తున్న డాక్టర్ ముఖంలోకి తదేకంగా ఆశగా చూస్తున్నాడు.

"....ఓకే..ఈ రక్తం సూటైంది... కాని మీ వయసు...." నసుగుతున్న డాక్టర్‌తో. "సార్ మరేమీ అనకండి.... ఇదిగో ఇటు చూడండి.... నేను బాగా వ్యాయామం

చేసిన వాణ్ని నాతో ఈనాటి యువకులు ఎవరూ సాటి రాలేరు" అంటూ తన షేర్వానీ గుండీలు తొలగించి తన దేహ దారుఢ్యాన్ని చూపిస్తూ...

"నా రక్తం తీసుకోండి. ఒక నిండు ప్రాణాన్ని కాపాడండి." ప్రాధేయపడ్డట్టుగా అన్నాడు మునీర్‌భాయ్.

డాక్టర్ దీర్ఘంగా నిట్టూర్చుతూ.

"సరే... రండి. ఇంకో బాటిల్ కోసం ఎవరినైనా తీసుకురండి" అంటూ మునీర్‌భాయ్‌ని రక్తం తీసే గదిలోకి పంపించాడు. గదిలోనికి మునీర్ భాయ్ తృప్తిగా వెడుతూ ఉంటే శాస్త్రిగారి కళ్లు కృతజ్ఞతా భావంతో చెమ్మగిల్లాయి.

"ఆ బాటిల్ స్టోర్ చేశాం.. అది అయిపోయేలోగా మరో బాటిల్ కావాలి. బ్లడ్ బ్యాంక్‌కు వెళ్లి రెడీ చేయించండి." అని చెప్పి వార్డులోకి వెళ్లిపోయాడు డాక్టరు. మునీర్‌బాయ్ ముఖం లోకి ప్రశ్నార్థకంగా చూశాడు శాస్త్రి.

"పద.. పోదాం." అంటూ నడిచాడు మునీర్ భాయ్. రక్తం ఇచ్చిన కారణంగా కాస్త నీరసంగా ఉన్నా "శాంపిల్స్ ఇచ్చిన వాళ్లలో ఇంకెవరిదైనా సూట్ అయిందా సార్." ఆశగా అడిగాడు మునీర్ భాయ్.

"చూడండి మీ పేషంట్‌కోసం రక్తం ఇవ్వటానికి వచ్చిన చాలా మందిలో ఎవరిదీ సూట్ అయినట్టులేదు. రిజిస్టర్‌లోని పేజీలను ఒక్కొక్కటిగా తిరగేస్తూ వివరాలను జాగ్రత్తగా గమనిస్తున్నాడు.

ఒక పేరు వద్ద బాల్‌పెన్ ఆగిపోయింది.

"ఆఁ... ఇతనిది సూట్ అయిందండి" అన్నాడు డాక్టర్.

పోయిన ప్రాణం తిరిగొచ్చినట్టనిపించింది శాస్త్రి, మునీర్‌భాయ్‌కి.

"పేరు చెప్పండి సార్ తీసుకొస్తాం" ఆశగా అన్నాడు మునీర్‌భాయ్.

గొలుసురాతలో అస్పష్టంగా ఉన్న పేరును అతి కష్టంగా చదువుతూ "మది...ద్ది...ఆఁ... మద్దిలేటి అటండీ... ఏడీ ఉన్నాడా? రెడీగా ఉంచండి."

ఆ పేరు విన్న శాస్త్రి స్థాణువులా నిలిచిపోయి "ఏమిటి...? మద్దిలేటి.... రక్తం ఇవ్వటానికి వచ్చాడా...? వాడి రక్తం నా భార్యకు సూట్ అయిందా..! అంటూ ఉంటే అక్కడ ఓ మూలన వొదిగి నిలబడి ఉన్న మద్దిలేటి చేతులు జోడించి ఏడుస్తూ....

"నా బంగారు తల్లి ఆ యమ్మ సావు బతుకుల్లో ఉంటే నేను సూడలేసు బాబూ... ఆ యమ్మ పెట్టిన అన్నంతో పెరిగిన శరీరం బాబూ ఇది.... నా రగతం అంతా ఇచ్చినా ఆ మా తల్లి రుణం తీర్చుకోలేను బాబూ... ఎవరికీ తెలియకుండా రగతం ఇచ్చి ఎల్లిపోదామనుకున్నాను... వద్దనకండి బాబూ... వద్దనకండి సామీ...మల్లెప్పుడూ రానులే సామి.. రాను. రానే రానులే.... నా రగతం తీసుకుని మా యమ్మను బతికించండి బాబూ... దేవుడా ఆ యమ్మను సల్లగా సూడు సామీ... సల్లగా సూడు, అంటూ ఉంటే మునీర్‌భాయ్ కన్నీరు ఆగింది కాదు. ఒకచేత్తో కర్చీఫ్‌తో కన్నీరు వొత్తు కుంటూ మరో చేత్తో మద్దిలేటి భుజం తడుతూ శాస్త్రిని అలా "పక్కకు తీసుకెళ్లి కదిలించివేసిన ఆ సన్నివేశాన్ని అవకాశంగా తీసుకొని శాస్త్రి నరనరాల్లో జీర్ణించుకుపోయిన ఛాందస భావాన్ని తొలగించి సర్వమానవ సమానత్వ సత్యాన్ని తెలుసుకునేలా చేయాలనుకున్న మునీర్‌భాయ్ నటిస్తూ శాస్త్రితో మెల్లిగా "ఒరేయ్... వాడి రక్తం వద్దు.. ఇంకెవరిదైనా చూద్దాం" అన్నాడు.

"అదేమిటిరా... వాడి రక్తం సూటైందిగా...?' మైనంలా మెత్తబడ్డ హృదయంతో అన్నాడు శాస్త్రి.

"ఐతే అయింది... వాడిది మురిగిన రక్తం... వాడు జన్మతః అంటరానివాడు.... వాడి నీడ తగిలితేనే మైలపడిపోతామే... వాడి రక్తం వదినె శరీరంలోనికి ఎక్కించాలా? అలా వాడి రక్తం జీవితాంతం వదినె నరాల్లో ప్రవహిస్తూ ఉంటే ఆమెతో నువ్వు సంసారం చెయ్యాలా? అంతకన్నా... అంటూ శాస్త్రిని ఉడికిస్తూ ఉండే మునీర్ మాటలు పూర్తికానివ్వకుండానే మధ్యలో అందుకుని "మునీర్... చాలురా... చాలు మద్దిలేటి ములుకుల మాటలకే చచ్చిపోయాడు ఆ ఛాందస శాస్త్రిగాడు.. వాడు ఇంకా ఎక్కడున్నాడని నీ మాటలు వినటానికి...?" అన్నాడు శాస్త్రి పరితప్త హృదయంతో.

ఓ మహా సంగ్రామాన్ని అతి సులువుగా గెలిచినంత ఆనందం వ్యక్తం చేస్తూ, కంగ్రాట్స్‌రా శాస్త్రి.. కంగ్రాట్స్ నీలోని ఒక ఛాందసుణ్ని హతమార్చి మమతానురాగాల మానవుణ్ని మేల్కొలిపావు అన్నాడు మునీర్‌భాయ్ శాస్త్రి భుజాలను తడుముతూ.

"ఆమెకు ప్రమాదం తొలగిపోయింది" అన్నాడు డాక్టర్. మబ్బులు తొలగి వెలుతురు ప్రసరించినట్లు ఇద్దరి ముఖాల్లో ఆనందం వ్యక్తమయింది. ఇద్దరూ వార్డులోకి

నడిచారు. మద్దిలేటి కృష్ణవేణమ్మ కాళ్లవైపు నిలుచున్నాడు. రెండు సీసాల రక్తం ఇచ్చిన తరువాత ఇప్పుడు ఆమె మాట్లాడగలుగుతుంది. జరిగిందంతా తెలుసుకున్న ఆమె, మునీర్‌భాయ్‌ని, మద్దిలేటిని దగ్గరికి పిలిచి ఎడమవైపున నిలబడ్డ మునీర్‌భాయ్‌ని చూస్తూ ఈయన నా అన్నయ్య. కుడివైపున ఉన్న మద్దిలేటి వైపు చూస్తూ వీడు నా తమ్ముడండీ అంది వణుకుతున్న పెదాలతో ప్రేమ, అనురాగం, అభిమానం, కృతజ్ఞతాభావం మేళవింపుల సుమధుర మధుర పానీయంలా ఉన్నాయి ఆమె పలుకులు. అక్కడున్నవారిని కదిలించివేసింది ఆ దృశ్యం. ఆ గంభీర వాతావరణాన్ని మార్చే ప్రయత్నంగా "అంటే సద్బ్రాహ్మణులైన శాస్త్రిగారు అంటరానివారికి బావగారన్నమాట... భలే... భలే..." అన్నాడు మునీర్‌భాయ్.

"ఒరేయ్ మునీర్ చచ్చిన పామును ఇంకా ఎందుకు చంపుతావురా..." అన్నాడు శాస్త్రి.

"అంటే చచ్చినా ఇంకా పామునేనంటావు? అన్నాడు మునీర్‌భాయ్ తమాషాగా. ఆ జోక్ అందరినీ నవ్వించింది. "నా పేరు శ్రీనివాస శాస్త్రి కాదు నా బావమరుదులైన మునీర్, మద్దిలేటిని నాతో లీనం చేసుకొని ఈవాల్టి నుండి నేను "మద్ధిముని శాస్త్రి"గా అవతరిస్తున్నాను అంటూ శాస్త్రి కూడా ఒక జోక్ వేశాడు. తృప్తిగా నవ్వింది కృష్ణవేణమ్మ.



# 4

# ఆకలి రాజ్యంలో రాజభోగాలు

ఉన్నపాటుగా వాతావరణం చల్లబడింది. నల్లటి మేఘాలు ఆకాశాన దట్టంగా కమ్ముకున్నాయి. చూస్తూ ఉండగానే ఉరుములు మెరుపులతో వర్షం ప్రారంభమైంది. ఓ మోస్తరు చినుకులు కురుస్తున్నాయి. సైకిల్ స్టాండువేసి ఆ దగ్గర్లోని ఓ కొట్టు వరండాలో వెళ్లి నిలుచున్నాను. వర్షం కాస్త తగ్గుముఖం పడితే ఇంటికి ప్రయాణం సాగిద్దామని. ఆ పక్కనే మురికి ప్రదేశంలో ఓ చెత్తకుండీ చుట్టూ చేరుతున్న పందుల్ని అదేపనిగా తరుముతూ వర్షంలో తడుస్తూ నిలబడ్డ ఓ ఎనిమిదేళ్ల బాలికపై పడింది నా దృష్టి.

బాగా మాసిపోయి పూర్తిగా చిరిగిపోయిన గౌనుతో వర్షానికి ముద్దగా తడిసి పోవటం వల్ల చిందరవందరగా ఉన్న వెంట్రుకల నుండి నీళ్ళు కారుతూ ఉంటే ఈదురుగాలికి భరించలేక ఎదపై గట్టిగా చేతులు కట్టుకొని వర్షంలో తడుస్తున్న ఆ చిన్నారి పెదవులు చలికి వణికిపోతున్నాయ్. నిలబడి అదే పనిగా ఆ పందుల్ని అలా ఎందుకు తరుముతూ ఉందో అర్థం కాలేదు. వర్షంలో తడుస్తూ నిలబడ్డ ఆ చిన్నారిని ఎవరూ పట్టించుకోవటం లేదు. ఎవరికి వారే యమునా తీరే ఏం మనుషులో అనిపించింది. ఎంతోసేపు చూడలేక ఆ చిన్నారిని వర్షంలో తడవకుండా ఉండేందుకు వరండాలోనికి రమ్మని పిలిచాను. తనను కాదన్నట్టుగా అలాగే నిలబడిపోయింది.

"పాపా ఎందుకమ్మా వర్షంలో తడుస్తూ అక్కడ నిలబడ్డావు. ఇలారా" అని గట్టిగా పిలిచాను. నాలాగే అక్కడ నిలబడ్డ వారందరూ నావైపు వింతగా చూశారు అసహ్యంగా కనిపిస్తున్న ఆ అమ్మాయిని ఎందుకు పిలుస్తున్నాడో ఈ పెద్ద మనిషి అనుకుంటున్నట్లుగా. "ఉహూఁ అక్కడికి వస్తే ఆ అంగడి షావుకారు కొడతాడు... నిన్న కూడా కొట్టినాడు" అంది దెబ్బలు తగిలిన మోచేతిని అమాయకంగా చూపిస్తూ. చలికి వణికిపోతున్న పెదాలతో అన్న ఆ మాటలు అస్పష్టంగా వినిపించాయి. చలించిపోయాను. ఆ షావుకారును తన్నాలనిపించింది. "అతను ఏమన్నా అంటే

నేనున్నానుగా... రా" మళ్లీ పిలిచాను. రానన్నట్టుగా తల ఊపుతూ ఆ చెత్తకుండి వద్దకు వస్తున్న పందుల్ని మళ్లీ తరిమింది. "అది సరే వర్షంలో తడుస్తూ అదే పనిగా ఆ పందుల్ని అలా ఎందుకు తరుముతున్నావు- తెలుసుకుందామని అడిగాను. మాటకు ముందు "ఊఁ" అనే పదాన్ని పలకటం అలవాటై పోయింది కాబోలు. "ఊఁ మరేమో ఆ హెూటలు వాళ్లు అన్నం తిన్న ఇస్తరాకుల్ని ఇక్కడ ఏస్తారు. అందులో అన్నం తీసుకోకపోతే మా అమ్మ కొడుతుంది. ఊఁ మా అమ్మకు జ్వరం వచ్చి పడుకుంది. ఈ పందులు తినేస్తే నాకు అన్నం దొరకదు అందుకని... ఊఁ..... అందుకని...." ఏదో అనబోయింది. ఆ మాటలు విన్న నాకు అప్రయత్నంగా కళ్లు చెమ్మగిల్లాయి. వళ్లు గగుర్పొడిచింది. పాపా అంటూ ఆ అమ్మాయిని గుండెలకు హత్తుకొని ఏడ్వాలనిపించింది. వర్షం తగ్గుముఖం పట్టింది. ఆ అమ్మాయి దగ్గరికెళ్లాను. ఆ అమ్మాయి తల నిమురాలనిపించింది. నన్ను చూసి ఆ అమ్మాయి రెండడుగులు వెనక్కు వేస్తూ "కొడతావా..." అంది బెదురు చూపులతో నా ముఖం వైపు చూస్తూ. "లేదమ్మా.... కొట్టను మీ అమ్మకు జ్వరం వచ్చిందన్నావుగా, ఇదిగో ఈ రొట్టె తీసుకెళ్లి మీ అమ్మకు ఇవ్వు" అంటూ బ్యాగ్‌లో ఉన్న బ్రెడ్ తీసి అమ్మాయి చేతుల్లో పెట్టి సైకిలెక్కి ఇంటిముఖం పట్టాను. యాంత్రికంగా సైకిల్ నడుపుతున్నానేకాని ఆ పాప విదారక పరిస్థితే నా కళ్లలో తిరుగుతూ ఉంది. చాచా నెహ్రూ ఏ గులాబి బాలలను ముద్దాడారో మరి? పిడికెడు ఎంగిలి మెతుకుల కోసం బాలలు బజార్లలో పందులతో పోట్లాడుతూ ఉంటే కోట్లాది రూపాయలతో నిర్మించిన అతి సుందర బాల భవనాలు ఏ బాలల కోసమో మరి? దేశంలో ఎన్ని గులాబి మొగ్గలకు ఇలాంటి చీడపట్టిందో? ఈ దుస్థితికి కారణం ఎవరు? ఎవరు? అంటూ పరిపరివిధాలా ప్రశ్నించింది మస్తిష్కం.

ఇంటికెళ్లి నాలుగు మెతుకులు ఎంగిలిపడి పాలుపోక దినప్రతిక తిరగేస్తున్న నాకు "రాజభోగ ప్రయాణం" శీర్షిక కంటపడింది. కామన్‌వెల్త్ దేశాధినేతల సమావేశానికి హాజరయ్యేందుకు వాంకోవర్ వెళ్లే యాత్రా విశేషాలు అవి. దినానినికి కోటి రూపాయలు అర్జించే రెండు బోయింగ్ విమానాలలో మంది మార్బలంతో ప్రయాణం కట్టారట ఆ దేశ ప్రధానమంత్రి గారు. సబ్బు మొదలుకొని భోజనం దాకా ప్రపంచంలో ఏది ఉత్తమం అనిపిస్తే అది తీసుకొచ్చి పెట్టారట ఆ విమానాల్లో. పసందైన ఎండ్రకాయల మాంసం, ఊరబెట్టిన చేపలు, వెన్న పదార్థాలు చాక్‌లెట్లు ఉన్నాయట ఆహారంగా. మద్యం విషయానికి వస్తే 87 సీసాల అత్యుత్తమ విదేశీ

మద్యం సేకరించి పెట్టారట. డన్‌హిల్, రోత్‌మన్. బెన్సన్ అండ్ హెడ్జెన్, స్టేట్ ఎక్స్‌ప్రెస్ వంటి విదేశీ సిగరెట్లు 80 పెట్టెల నిండా ఉన్నాయట. కోకాకోలా, పెప్సీ కోలా బిట్టర్ లెమన్, మినరల్‌వాటర్, సెవెన్ అప్ లాంటి విదేశీ శీతల పానీయాలు, మద్యం అందించే బల్లలపై డమాస్కస్ నుంచి తెప్పించిన లినెన్ వస్త్రం తువాళ్లు ఉంచారట. స్పటికలాంటి స్వచ్ఛమయిన గ్లాసులను ఖరీదయిన రాయల్ డాల్టన్ పళ్లాలను తెప్పించారట. ఆయన వెంట వెళ్లిన వారి కోసం వెండి చంచాలను తదితర సామాగ్రిని తెప్పించారట. విమానంలో ప్రధాని క్యాబిన్‌ను ప్రత్యేక శిల్క్ వస్త్రాలతో అలంకరించారట. ఢిల్లీ టోక్యో సెక్టార్‌లో ఉదయం పూట ఇచ్చేందుకని తాజా పళ్లరసాలు, ఉడికించిన కోడిగుడ్లు, చికెన్ సాసేజి, మేక పిల్ల మాంసంతో చేసిన ఛాప్స్, చట్నీతో దోసె టోస్టనట్ బ్రెడ్ బట్టర్, జామ్, తేనె, జిలేబి, టీ, కాఫీ, హాట్ చాక్‌లెట్లు అమర్చారట. ఇక తిరుగు ప్రయాణంలో ఫ్రాంక్‌ఫర్ట్ ఢిల్లీ మధ్య ప్రయాణంలో మధ్యాహ్న భోజనానికని ఒకటి రెండు మూడు కాదు లెక్కలేనన్ని ఖరీదైన ఆహార పదార్థాలు ఉంచారట. కాఫీ, టీలకు తోడుగా పాన్ మసాలాలు ఐదు రకాలయిన సుపారీలు లక్నోకి సూప్‌లు ఎన్నెన్నో ఉంచారట, ఆహార పదార్థాల జాబితాను అందమయిన శిల్క్ తెరతో కప్పి దిగుమతి చేసుకున్న అందమయిన వెండి తీగెలు చుట్టారట.

ప్రధాని ఈ విధంగా చేసిన మొత్తం ఓ వారం ప్రయాణం ఖర్చు వంద కోట్ల రూపాయలట. ఇదంతా చదువుతూ ఉంటే తల తిరిగిపోయింది. గుక్కెడు గంజికి దోసెడు మంచినీటికి నోచుకోలేని కోట్లాది దరిద్ర నారాయణులు, పిడికెడు ఎంగిలి మెతుకులకై పందులతో పోట్లాడే లక్షలాది బాలలు, ఎండిన స్తనాల్లో ఓ చుక్క పాలు కరువై గుక్కపట్టిన బిడ్డలను ఓదార్చగలేని ఆర్తనాదాలు చేస్తున్న అసంఖ్యాక అమ్మలు, పూటగడవక నడిబజార్లలో శీలాన్ని అమ్మేసుకుంటున్న అభాగినులు. కష్టాల కడలిలో నిరుద్యోగ నావలో ఈసురోమంటూ పయనిస్తున్న లక్షలాది తమ్ముళ్లు, లక్షలాది కోట్ల రూపాయల విదేశీ అప్పుల వరదలో కొట్టుకుపోతున్న దేశాన్ని పాలించే ప్రధాని ఇలాంటి రాజభోగాల్లో ఓలలాడటం ఎంతటి ఘోరం? ఎంతటి పాతకం?.... "ప్రభూ!.... ఈ దేశాన్ని ఎలా కాపాడతావో" అంటూ దీర్ఘంగా నిట్టూర్చి పడకపై మేను వాల్చడం వినా చేయగలిగింది ఏదీ లేదనిపించింది.

కళ్లు మూసుకుంటే ఆ వెనుకటి దినమే ఓ పుస్తకంలో చదివిన ఆ మహనీయుని

పాలనలో ఓ ఘట్టం కళ్లముందు కదలాడింది. హజ్రత్ ఉమర్ పరిపాలన సాగిస్తున్న కాలమది. దేశంలో కనీవినీ ఎరుగని క్షామం తాండవిస్తూ ఉంది. అన్నపానీయాలు కరువై జనం కటకటలాడిపోతున్నారు. ఓ ముద్ద తిండి దొరకటం గగనకుసుమమయిపోయింది ప్రజలకు. ప్రభుత్వ ధాన్యాగారంలో ఉన్న కొద్దిపాటి ఆహారం ప్రజలకు సమానంగా సమకూర్చటం జరుగుతూ ఉంది. చాలీచాలని ఆహారంతో కాలే కడుపులు చేత్తో పట్టుకుని తిరుగుతున్నారు జనం. ప్రజా పరిపాలకులైన హజ్రత్ ఉమర్‌గారు కూడా అందరితోపాటుగానే చాలీచాలని ఆహారంతో పూటగడుపుతూ విపత్కర పరిస్థితినీ ఎదుర్కొనే ప్రయత్నంలో తలమునకలై ఉన్నారు. ఒకనాడు హజరత్ ఉమర్ అస్తమానం పరిపాలనా వ్యవహారాలు చూసి అలసి దస్సి ఇల్లు చేరుకునేసరికి వారి కుమారుడు ఆకలి బాధకు తాళలేక ఎక్కడో సేకరించుకున్న ఓ కరబూజ పండు ముక్కను తింటూ కనిపించాడు. ఆకలితో అలమటించే ప్రజల బాధలన్నీ వారి కళ్లలో తిరిగాయి. ఠక్కున అడుగు ముందుకు వేసి కొడుకు నోటి వద్ద నుండి పండును లాక్కొని “దేశంలో జనం కనీస అవసరాలు కరువై గుక్కెడు గంజికి కటకటలాడుతూ ఉంటే నీవొక్కడివి ఈ పండు తినటం భావ్యం కాదు” అంటూ అవల విసిరి వేశారు.

దైవభీతి పరులైన హజ్రత్ ఉమర్ గారి అలనాటి ధర్మపరిపాలన గాథ మస్తిష్కంలో మెదులుతూ ఉంటే “ప్రభూ! ఈ దేశానికి ఒక ఉమర్‌ను ప్రసాదించు” అన్నాయి నా అధరాలు అప్రయత్నంగా.



# 5

# అమ్మ

పేదవారింట మనిషిగా పుట్టేకంటే కల వారింట కుక్కగా పుట్టడం మేలంటారు పూటగడవని పేదవారు, కలవారింట ఆ కుక్క అనుభవిస్తున్న భోగభాగ్యాలను చూసి. అలాంటి ఒక జాతికుక్క పెరుగుతూ ఉంది ఆ ఊళ్ళోని ఓ ఆఫీసర్ ఇంట్లో. భార్యా ఇద్దరు కొడుకులు, ఒక కూతురు హైస్కూల్లో చదువుతున్నారు. జీతం గీతం మాంచి జోరులో ఉన్నాయి. ఇల్లే కైలాసం, బొందే స్వర్గం, సతీమణే సర్వస్వంలా సర్వ సుందరంగా గడిచిపోతూ ఉంది ఆయన గారి సంసారం. అలనాడు సీత కూడా గీత దాటింది కాని భార్య గీసిన గీత దాటి ఎరుగని ఆదర్శ భర్త ఆయన. డెబ్బై ఏళ్ళ తల్లి శాంతమ్మకు. తన ఏడుపదుల సంసార మహా ప్రస్థానంలో అన్నీ చేదు అనుభవాలే. పేరులో తప్ప ఆమె జీవితపు నిఘంటువులో ఎంత వెదికినా శాంతి అనే పదానికి అర్థమే కనపడలేదు. ఆమె పట్టాన ఆమెను వదిలి పెద్దాయన పైలోకాలకు వెళ్ళి చాలాకాలమైంది. కోరికలంటే ఏమిటో అవి ఎలా ఉంటాయో కూడా తెలియని ఆమెకు ఉన్న చివరి కోరికల్లా ఒక్కటే. ఓ ఐదేళ్ళుగా ఆమె మనోవేదనంతా ఒక్కటే. ఎలాగూ పదిమంది పిల్లలు. అంతా మగ సంతానాన్నిచ్చి ఎంతో మేలు చేసిన ఆ దేవుడు ఇంకా ఇద్దరు పిల్లల్ని ఇచ్చి ఉంటే కాస్తయినా ఊరట ఉండేదనిపించేది ఆమెకు.

నవమాసాలు కడుపున మోసి పాలిచ్చి తను పస్తులుంటూ పది మంది పిల్లల్ని పెంచి పెద్దవారిని చేస్తే ఎద్దుల్లా బలిసిన ఆ పదిమంది కొడుకులు కాటికి కాళ్ళు చాచిన ఆ ముసలి తల్లి భారమై పూటకూళ్ళలా ఆమెను తలా ఒక నెల కోసం పంచుకున్నారు. పాపం అక్టోబర్ నెల మొదటి తేదీ నుండే ఆ ముసలమ్మ గుండె వేగం ఒక్కసారిగా పెరిగిపోతుంది. రాబోయే నవంబర్, డిసెంబర్ మాసాల్లో ఎక్కడుండాలి? ప్రతి కోడలు తమవంతు అయిపోయిందటే ఒక్క గంట కూడా ఇంట ఉండనియ్యదు. చవట భర్తలు బుర్రకథల్లోని వంతల్లాగా తందాన తానా అంటారు.

ఆ కోడళ్ళలో అందరికంటే మంచిదైన ఒకే ఒక్క సాధ్వీమణి ఆమైతే ఆ

కొడుకు ఇంటి నుండి తన ఇంటికి వచ్చే ఆటో ఛార్జీలు ఆ ముసలమ్మే భరించాలం టుంది. గత సంవత్సరమే ఆమెకు ఆదర్శ మహిళ అవార్డు వచ్చిందనుకోండి, అది వేరే విషయం. ఇంకా ఇద్దరు కొడుకులు ఉండి ఉంటే సంవత్సరంలోని ఆ మిగిలిన రెండు మాసాల బెడద తీరిపోయేది అనుకుంటూ కుమిలిపోయేది పాపం పదిమందిని కన్న ఆ తల్లి.

ఉన్నవారూ, ఊరూ పొమ్మంటూ ఒకే బలవంతం చేస్తున్నా కాదు రమ్మనకుంటే నేనెలా పోయేది అంటూ గుండెలు పగిలేలా మౌనంగానే ఏడ్చేది ఆ తల్లి. ఆనాడు ఉదయం నుంచీ ఆమె ఎంతో నీరసంగా ఉంది. పిల్లల్ని తన పక్కన పడుకోవటంతోనే కడుపు నింపుకొనేది. కాని డాక్టర్ ఆ ముసలమ్మకు క్షయ అని చెప్పినప్పటి నుంచి పిల్లల్ని ఆమె వద్దకు పంపేది కాదు కోడలు. ఇక భర్తనైతే పెరటి వాకిటి నుండే రాకపోకలు సాగించమనేది. ఆ ఇంట్లోనే కాదు ఆ ఊరిలోని బుద్ధి జీవులైన మనుషులందరిలో మాణిక్యం ఆ ఇంట్లోని పెంపుడు కుక్క మోతి. ఎముకలు కొరుక్కుతినే చలిలో ఏ దాపులేని వరండా లో మోతీయే ఆ ముసలమ్మకు తోడు. తనకోసం పళ్ళెంలో పెట్టిన ఆహా రాన్ని ఆ అమ్మ తినగా మిగిలిందే తినేది. చలికి వణికిపోతున్న ఆమెకు వేడి కలిగించటానికని ఆమెను అనుకొని పడు కునేది మోతి. అలా చేస్తే ఆమె క్షయరోగం కుక్కకు వస్తుందని అత్తను చీవాట్లు పెట్టేది కోడలు. డాక్టర్ వద్దకు తీసుకెళ్ళి మోతీకి వైద్యపరీక్ష చేయించేవాడు కాని తల్లిని చూపించేవాడు కాదు ఆ ఆఫీసర్ కొడుకు. 'కాస్త డాక్టర్‌కు చూపించరా' అని అడిగితే ఈ ముసలితనంలో అందరికీ ఇంతేలేవమ్మా. వ్యాధికి మందు ఉంటుంది కాని ముసలితనానికి మందెక్కడుందమ్మా విసిగించక మోతీకి దూరంగా పడుకో' అనేవాడు ఆ కుమార రత్నం.

ఆనాడు ముసలమ్మ అన్నం తిననందుకు మోతీ కూడా మెతుకు ముట్టలేదు. మోతీ అన్నం మానేసినందుకు ఆ కోడలికి ఒకే బెంగ. తినిపించటానికి ఆమె ప్రయత్నం చేసినప్పుడల్లా భౌ...భౌ మంటూ పెద్దగా అరిచేది. 'నీకేమైనా బుద్ధుందా.... నువ్వు మనిషివేనా... అమ్మకు అలా ఉంటే నేనెలా తినాలి... అన్నట్టు. ఆ రాత్రంతా ఆ ముసలమ్మ వరండాలో చలికి వణికిపోతూ బాధతో మూల్గుతూ ఉండిపోయింది. మూసిన తలుపులు ఉదయం పని మనిషి వచ్చినప్పుడే తెరుచుకున్నాయి. కోడలు మేడం గారు లేచిన అలికిడి విన్న పని మనిషి ఇవాళ "అమ్మకు బాగా నిద్రపట్టిందమ్మ గారూ... ఇంకా లేవలేదు..." అంటూ బయట వరండాలో శుభ్రం చేయటానికని

వచ్చిన పనిమనిషి కోడలిగారిని పిలిచింది.. మోతీ ఆ ముసలమ్మ పాదాలను తన నాలుకతో నాకుతూ ఉంటే 'అదేమిటే అలా చూస్తున్నావు... మోతీని పక్కకు తీసుకురా... ఆ రోగం దానికీ వస్తుంది' అని అంటూ ఉంటే దగ్గరికి వెళ్ళిన పని మనిషి భయంతో వణికిపోతూ ఎంతపని జరిగిపోయిం దమ్మగారూ అంది. 'ఏమి జరిగిందే...' 'అమ్మగారు ఎల్లిపోయారమ్మా...' అంటూ చీర చెరుగు నోటికి పెట్టుకొని ఏడ్వ సాగింది. కొండంత పేదరికంతో పర్వత మంత సంసార భారాన్ని మోస్తూ అలుపెరుగని జీవన ప్రస్థానాన్ని సాగించి అలసిపోయిన అమ్మ దీర్ఘ విశ్రాంతి కోసం తిరిగిరాలేని అనంత లోకాలకు తరలిపోయింది. విషయం తెలుసుకున్న ఇరుగుపొరుగు వారు ఆనవాయితిగానే తలా ఒకవిధంగా మాట్లాడుకుంటున్నారు. రాత్రంతా ఆ కుక్క మోరపైకెత్తి అదే పనిగా ఏడుస్తూ ఉంటే ఏమో అనుకున్నాం...' అంది వారిలో ఒక కంఠం.

వచ్చేవాళ్ళు వస్తున్నారు, పనులు చకచకా జరిగిపోతున్నాయి. ఈ భూమి మీద పుట్టిన ప్రతి ఒక్కరినీ ఒక్కొక్కరిగా అందరినీ చేర్చవలసిన ఆ శాశ్వత సమాధికి ఆ అమ్మను కూడా చేర్చటానికి. ఆ ముసలమ్మ కొడుకులు, కోడళ్ళు అందరూ కలిసి ఉన్న దినాన్ని చూడాలని ఆ అమ్మ జీవితాంతం కన్న కలలు కల్లలుగానే మిగిలి పోగా తీరా అది నిజమయిన ఆ వేళకు అమ్మ వెళ్ళిపోయింది. ఆ ఐదెకరాల పొలాన్ని ఆమె తదనంతరమే కొడుకులు పంచుకోవాలని వ్రాసిపోయాడట ఆ పెద్దయ్య' అంటూ అక్కడికొచ్చిన వాళ్ళలో ఎవరో అన్నారు.

సమాధి అయిపోయింది. తాము ముద్రించుకున్న కాగితపు కరెన్సీ ముక్కలకు తామే సాష్టాంగపడుతూ కన్నవారి కన్నా కాంచానమే మిన్న అనుకుంటూ మసలుతున్న ఈ అశాశ్వత ఐహిక మానవ లోకానికి దూరంగా, బహుదూరంగా తన సమాధిలో శాశ్వతంగా నిద్రపోయింది అమ్మ. ఆ తరువాత అక్కడ ఎవరికేం పని మళ్ళీ తమ వంతువచ్చినప్పుడు కదా... అంతవరకూ మోతీని ఎవరూ గమనించలేదు. అమ్మ సమాధి వద్ద తన ముందు కాళ్ళ వైపు మోరను ఆనించి పడుకుంది. తన యజమాని ఎంత పిలిచినా రానంటూ మొరాయిస్తూ సమాధి వద్దనే ఉండిపోయింది తడి ఆరని కళ్ళతో. అక్కడ దూరాన లాటరీ టికెట్లు అమ్ముకుంటున్న ఆటోలోని లౌడ్‌స్పీకర్ నుండి సినిమా పాట వినపడుతూ ఉంది 'జాలి గుండెలేని కొడుకు కన్నా కుక్క మేలురా....' అంటూ.

అమ్మా! మానవ జాతిని కన్నతల్లీ ఏ గణములతో నీ గుణములు వ్రాసేది! ఏ గళములతో నీ మమతను చాటేది!!



# అనురాగవాహిని

"షమా... ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్. మానసిక ఒత్తిడి నీ ఆరోగ్యానికి మంచిది కాదని డాక్టర్లు చెబుతూ ఉంటే నీవిలా అస్తమానం ఆలోచించుకుంటూ కూర్చుంటే... ఎన్ని మందులు తిని మాత్రం ఏం లాభం... నిన్నటి దినం నీ బ్లడ్ ప్రెషర్ అమాంతంగా పెరిగి పోయి... " మాట పూర్తికాకముందే అందుకొని "పాపిష్టిదాన్ని... నా వల్ల మీకు అన్నీ కష్టాలే ..... అల్లాహ్ నన్ను తీసుకుపోయినా బాగుండేది... "దిండుకు తల ఆనించి చంటి పిల్లలా భోరున ఏడుస్తూ అంది షమీమ్. "షమా... ఏమిటిది.. ఊర్కో... నువ్వు ఏడవటం నీ ఆరోగ్యానికి మంచిదికాదు" అన్నాడు ఆమె పక్కగా కూర్చొని ఓదార్పుగా తలనిమురుతూ షౌకత్.

"అసలు నా ఆరోగ్యానికి ఏది మంచిదో చెప్పండి" అంది షమా ఏడుస్తూనే. "ఇప్పుడు ఏమైందని" అన్నాడు షౌకత్.

"రమజాన్ శుభమాసం... చూస్తూ చూస్తూనే పది ఉపవాసాలు జరిగిపోయాయి... ఉపవాసం పాటించే అదృష్టం నాకు ఎటూ లేకుండా పోయింది... కనీసం మీకు వండిపెట్టే భాగ్యానికైనా నోచుకోలేదు... పది రోజులుగా అలా మీరు ఎండు రొట్టెలు చద్ది అన్నంతో సహరీ చేస్తూ ఉంటే గుండె తరుక్కుపోతూ ఉంది.... ఇంతకన్నా ఏం జరగాలి" పొర్లివస్తున్న కన్నీటిని చెరుగుతో తుడుచుకుంటూ అంది షమీమ్.

"ఓస్.... అదా.... నాకు ఎలాంటి అసౌకర్యమూ కలగటం లేదు.... అల్లాహ్ కృప అంతా.... తృప్తిగా జరిగిపోతూ ఉంది... నువ్వేమి బాధపడకు... ఊఁ.. లే ఆ మాత్రలు వేసుకో" అన్నాడు విషయాన్ని అర్థం చేసుకున్న షౌకత్.



ఆనాడు యధావిధిగా సహరీ తినటానికని వేకువన లేచిన షౌకత్ గడియారం వైపు చూశాడు, నాలుగు కావస్తూ ఉంది. ముఖం కడుక్కుని కాచుకున్న టీ తాగుతూ పేపర్‌బాయ్ అప్పుడే పడేసి పోయిన దినపత్రిక తిరగేస్తున్నాడు. తన నలుగురు పిల్లలు తల్లి షమీమ్‌ను చుట్టుకుని తలా ఒక భంగిమలో గాఢనిద్రలో పడివున్న దృశ్యాన్ని చూసిన షౌకత్ క్షణంపాటు నవ్వుకొని "ప్రభూ... ఆ బంధాలు అలాగే ఉండనియ్... ఆ పసికందులనుండి తల్లిని వేరు చేయకు ప్రభూ... వేరు చేయకు..." అంటూ కంట తడిపెట్టాడు. కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది. తిరిగి పేపర్‌ను తిరగేస్తున్నాడు.

బయట ఎవరో తలుపుతట్టిన శబ్దం బలహీనంగా వినబడితే పట్టించుకోలేదు. అదే శబ్దం మళ్లీ, మళ్లీ వినిపించింది. ఈసారి శబ్దంతోపాటు స్త్రీ కంఠం కూడా వినబడుతూ ఉంది. తుళ్లిపడిన షౌకత్ పత్రికను టేబుల్‌పై పడేసి తలుపు తెరిచాడు. ముందున్న వరండా తలుపు ఇనుప చువ్వలది కారణంగా బయట నుంచున్న స్త్రీ ఆకారం దూరంగా వెలుగుతున్న వీధి దీపాల వెలుగులో అస్పష్టంగా కనబడుతూ ఉంది. విరబోసుకున్న పొడవాటి కురులు ఆమె ముఖానికి అడ్డుపడుతూ ఉంటే ఎడమచేత్తో సవరించుకుంటూ ఉంది. క్షణంపాటు ఒళ్లు జలదరిచింది షౌకత్‌కు. మూఢ విశ్వాసాలకు అతీతుడైన షౌకత్ తేరుకొని "ఎవరూ...?" అంటూ లోపలి నుండే వరండాలోని లైట్ వేశాడు. ఆశ్చర్యం... తన కళ్లను నమ్మలేకపోయాడు.... ఇది కలా.... నిజమా అనుకుంటూ తన చేతిని ఒకసారి గిచ్చుకుంటూ మెల్లిగా వరండా తలుపు వద్దకు వచ్చాడు. అతి కష్టంగా తేరుకుంటూ ఉండగానే "అన్నయ్యా.... నేను.... ఏమిటి అలా చూస్తున్నావ్... తలుపుతియ్.... ఇప్పుడే లేచావా? .... వదిన పడుకుందా..... నమాజుకు వెళ్లిన నీవు రాత్రి పదకొండుదాకా రాలేదు. ఎందుకంత ఆలస్యమైంది?" ప్రశ్నల వర్షానికి తేరుకున్న షౌకత్ "అమ్మా... వాణీ.... నువ్వా... ఏమిటిది..? ఇంత వేకువన.... బాబును తీసుకొని ఇదంతా ఏమిటి? అంటూ ఉండగానే కిట్టు గుడ్ మార్నింగ్ మామయ్యా..." అంటూ ఉంటే లోపలికి వెళ్లి వాణి తెచ్చిన రకరకాల వంటకాలతో నిండిన పళ్లాన్ని టేబుల్‌పై పెడుతూ... "ఏం అన్నయ్యా... వదినెతో వంటకాకపోతే నాతో ఒక్క మాటైనా చెప్పలేకపోయావా...

నేను ఆ మాత్రం చెయ్యకూడదా ఏమిటి?.... ఈ పది రోజులుగా ఏంతింటున్నావో ఏమో... ఇక నుండి ఈ రమజాన్ మాసమంతా నేనే సహరీకి వండి తీసుకువస్తాను... ఈ చలికాలంలో సాయంత్రం వండిన పదార్థాలు మరీ చల్లగా ఉంటాయి... "అంటూ ఉంటే ఆ ప్యాయత, అనురాగ ప్రవాహంలో కొట్టుకుపోతున్న షౌకత్ ఇదంతా చూస్తూ ఉంటే ఏడీ వాడు.... భాస్కర్..... అంతా వాడిపనే అయి ఉంటుంది." పక్క ఇల్లే కావటం వల్ల భాస్కర్... భాస్కర్.... అంటూ షౌకత్ బయటికి వెళ్లిపోతూ ఉంటే "ఈ విషయం తెలిసి నీపై మండిపడుతూ నీకోసం రాత్రి పదిన్నర వరకు ఎదురుచూసి ఆఫీసుపని మీద హైద్రాబాద్ వెళ్లారు. ఊఁ పద... పద సహరీకి ఆలస్యమవుతుంది. భోంచెయ్... వదినెను లేపకు ఆమె ఎంతగా నిద్రపోతే అంత మంచిదట. "అంతవరకూ దినపత్రికపై ఏవో పిచ్చిగీతలు గీస్తున్న కిట్టు చేయిపట్టుకొని "లేవరా గడుగ్గాయి... వీడికి ఎప్పుడూ సినిమా బొమ్మలే కావాలి... వస్తానన్నయ్యా.... నీవు భోంచెయ్....." అంటూ వెళ్లబోయిన వాణి అమ్మా.... వాణీ అన్న షౌకత్ పిలుపుకు ఆగిపోయింది. "వాణీ.... నీ ఈ అనురాగపు విలువ ఎంతో తెలుసా..?"

"అన్నయ్యా చావు బ్రతుకులో నన్ను కాపాడిన నీ రక్తం కన్నానా? అంది సూటిగా వాణి. తన కాన్పులో ప్రాణాపాయస్థితిలో ఉన్న తనకు రక్తం ఇచ్చి ఆదుకున్న సందర్భాన్ని గుర్తు చేసుకుంటూ.

"అమ్మా.... వాణీ.... ఆ విషయం నీకు ఇంకా గుర్తుందా?" అన్నాడు చలించిపోయిన షౌకత్.

"అన్నయ్యా.... నా నరాల్లో ప్రవహిస్తున్న నీ రక్తం సాక్షిగా చెబుతున్నాను.... నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను. లేకపోతే నా ఈ చిట్టి తండ్రి తల్లిలేని వాడుగా...." కళ్లు చెమ్మగిల్లి స్వరం బొంగురు పోవటంతో మాట పెగలలేక ఆగిపోయింది వాణి.

"లేదమ్మా... అంత మాట అనకు... అంతా అల్లాహ్ కృప... పద... పద... ఎప్పుడనంగా లేచావో ఏమో... వెళ్లి పడుకో" అంటూ వాణి విరబోసుకున్న కురులను చూస్తూ "వాణీ అసలే రెండు రోజులుగా చలి బాగా ఉంది. పైగా ఇంత వేకువనే తలంటుపోసుకోకపోతే ఏం."

"పవిత్ర రమజాన్ సహరీ వంట అలా చేయాలనిపించింది..." అంది తృప్తిగా.

"పిచ్చి తల్లీ... సహరీ వంటకోసం...! తలంటు పోసుకున్నావా...! ఎవరు చెప్పారమ్మా అలా చేయాలని? అన్నాడు ఆశ్చర్యంగా ఆమె మనోభావానికి ముగ్ధుడైన షౌకత్.

"ఏమో నాకు అలా అనిపించింది... చేశాను.

సరే... సరే... నువ్వు భోంచేయ్..

నాన్నా కిట్టూ పద మామయ్య భోంచెయ్యనీ..." అంటూ వెడుతూ ఉంటే "మామయ్యా... టా....టా" అంటూ అమ్మను వెంబడించాడు కిట్టు.

"ప్రభూ మా భారతావనిలో ఈ అనురాగవాహిని ఆచంద్రతార్కారం అప్రతిహతంగా సాగనీ... పరవళ్లతో పొరలి పారనీ" అనుకుంటూ సహరీ భుజించటానికి ఉపక్రమించాడు షౌకత్.



# 7

# రక్త తర్పణం

క్రిక్కిరిసిన జనం కల కలంతో అంతవరకూ హోరెత్తిపోయిన కోర్టు ఆవరణంలో ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది. తమ స్థానంలో ఆశీనులైన జడ్జిగారు గోరంతలు కొండంతలుగా పెరిగిన ఒక కేసులో తీర్పు చదువుతున్నారు. "అర్జీదారుడు ఘుమఘుమలాడే అంతటి రుచికరమైన ఆహార పదార్థాలను ఆరుబయట తెరిచి పెడితే వాటిని పొరుగింటి కుక్క తినేస్తే దాని యజమాని చేసిన నేరమేమిటో ప్రాసిక్యూషన్ వివరించలేకపోయింది. దాచి ఉంచవలసిన పదార్థాలను అశ్రద్ధతో బహిరంగంగా ఆరుబయట ఉంచటం మూలానే వాటిని కుక్క తినేసింది ఇందులో ఆ కుక్కను గాని, ఆ కుక్క యజమానిని గాని శిక్షించటంలో ఏ కారణమూ కనిపించని కారణంగా ఈ కేసును కొట్టివేయడమైనది. విలువైన కోర్టు సమయాన్ని హరించి వేసే ఇలాంటి కేసులు కోర్టుకు తీసుకువచ్చేముందు పోలీసులు బాగా ఆలోచించుకోవాలి. అంటూ ముక్తసరిగా ముగిస్తూ నెక్స్ట్... అంటూ బల్లపై ఉన్న గ్లాసులోని నీటిని కొద్ది కొద్దిగా తాగుతున్నారు జడ్జిగారు. తరువాత తీసుకోబోయే కేసు కాగితాలను ఒక్కొక్కటిగా తిప్పుతూ..

"తేజా..... తేజా..... తేజా....." అంటూ కోర్టు జవాను మూడుసార్లు తనదైన సాంప్రదాయ శైలిలో ఎలుగెత్తి పిలుస్తూ ఉంటే అంతవరకూ అక్కడే చెట్టు నీడన నుంచున్న పాతిక మంది యువకుల గుంపులో నుండి ఓ పాతికేళ్ల యువకుడు వడివడిగా కోర్టు హాలులోకి వెడుతూ ఉంటే అతని అనుసరిస్తున్న మిగతా యువకులను వరండాలోనే ఆపివేశారు కోర్టు సిబ్బంది. ఇన్‌షర్ట్ చేసి నుదిటిపై జారిపడుతున్న వెంట్రుకల క్రాఫ్‌తో ఎర్రగా అందంగా ఉన్న ఆ యువకుడు చదువుకున్న వాడిలా ఉన్నాడు. అతని వెంట కోర్టుకు వచ్చిన జనం, మంది మార్బలం చూస్తూంటే అతడు సంపన్న కుటుంబానికి చెందిన వాడిలా ఉంది. తన భావోద్వేగంలో ఎంతటి సాహసానికైనా వొడిగట్టగల నైజానికి పేరుపడ్డ ఆ యువకుడు బోనులో తన రెండు చేతుల్ని రెండు వైపుల ఉన్న కర్రలపై మోపి నిర్భయంగా నిలబడిన వైనం, అతనికి

ఎదురుగా ఉన్న బోనులో లేటెస్ట్ ఫ్యాషన్ వస్త్రాలంకరణతో మిస్ ఇండియాను మరపిస్తూ అర్ధనగ్న వస్త్రధారణతో హొయలు వొలకబోస్తున్న ఓ ఇరవైఏళ్ల అందాల భరిణ, వాలకం చూస్తూ ఉంటే ఈ కేసులో వాదోపవాదాలు రసవత్తరంగా సాగుతూ విని తీరవసినవిగా ఉంటాయనిపించింది.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి "యువర్ ఆనర్ అనటం, కాగితాలను ఒక్కొక్కటిగా తిప్పుతూ జడ్జిగారు "యస్ ప్రొసీడ్" అనటం ఒక్కసారిగా జరిగిపోయింది. "యువర్ ఆనర్ ఈ కేసులో ప్రాసిక్యూషన్ సాక్ష్యాలన్నీ కోర్టువారు వినటం జరిగింది..... సుతిమెత్తగా ..... అందంగా.... అమాయకంగా కనిపిస్తున్న ఈ యువకుని నిజస్వరూపం చాలా భయంకరంగా ఉంది. వీడు ఓ ......మధ్యలో అందుకొని కోపంగా అబ్జెక్షన్ యువర్ ఆనర్, వాడు........ వీడు అంటూ ఏమిటిది? పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారిని మర్యాదగా మాట్లాడమనండి అంటూ తేజ అంటూనే జడ్జిగారు "అబ్జెక్షన్ సస్టైన్డ్" అనటం పబ్లిక్ ప్రాసిక్యూటర్ సారి యువర్ ఆనర్ అనటం వెంట వెంటనే జరిగిపోయి తన వాదనను కొనసాగిస్తూ యువర్ ఆనర్ ఇతడు ఓ పచ్చి కామాంధుడు. తనదైన ఓ ముఠా కట్టి బజార్లలో ఏమరుపాటు ఉన్న యువతులపై ఒకే విధమైన నేరం చేస్తాడు. వారి వెనుకంటగా వెడుతూ అవకాశం చూసి కనబడేవారి వీపు, నడుము భాగాలను స్పృశించి పారిపోతాడు. అంతకు మించి మరే నేరమూ చేసిన విషయం ఇంత వరకూ పోలీసుల దృష్టికి రాలేదు. ఇలాంటి పైశాచిక ఆనందాన్ని అనుభవిస్తూ ఇంతకాలం పోలీసుల నుండి తప్పించుకుని తిరుగుతున్నాడు. బయట తిరిగే స్త్రీలకు ఇతను ఒక పెద్ద సమస్యగా తయారయ్యాడు. ఇతనివల్ల మహిళలకు భద్రత లేకుండా పోతూ ఉంది. ఎక్కడ ఎవరిపై దాడి చేస్తాడో తెలియక భయంతో స్త్రీలు బయటికి వెళ్లటానికి సాహసించలేకపోతున్నారు. ఇతణ్ణి కఠినంగా శిక్షించకపోతే ఇలాంటి అత్యాచారాలు ఇంకెన్ని చేస్తాడో తన ముఠాలో తన లాంటి వాళ్లను ఇంకా ఎంతమందిని తయారు చేస్తాడో. సమాజంలోని మహిళల భద్రత, గౌరవ మర్యాదల దృష్ట్యా ఇతణ్ణి కఠినంగా శిక్షించాలని కోర్టు వారికి మనవి చేసుకుంటున్నాను." అంటూ తన స్థానంలో కూర్చున్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్. అంతావిని తనలో తాను వెటకారంగా నవ్వుకుంటున్న తేజ వైపు చూస్తూ "నీ తరపున వాదించటానికి న్యాయవాది ఎవరైనా ఉన్నారా? అని అడిగారు జడ్జిగారు. కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది. నుదుటిపై జారుతున్న వెంట్రుకలను అలవాటు ప్రకారంగా ఎడమ చేత్తో సవరించుకుంటూ ప్రశాంత స్వరంతో క్షమించాలి యువర్ ఆనర్. పోలీసులు,

న్యాయస్థానాల దృష్టిలో ఇది కొన్ని కాగితాలకు పరిమితమైన ఒక కేసు కావచ్చు. కాని ఇది సమాజాన్ని పట్టి పీడుస్తున్న అంఖ్యాక చెడులలో ఇది ఫ్యాషన్‌ల ముసుగులో యువకుల మస్తిష్కాలను కలచివేసే కాలకూట విషం దీని నిజస్వరూపాన్ని వెల్లడించటానికి కావలసింది వాదన కాదు...... వేదన. పైసలకోసం న్యాయాన్ని వ్యాపార వస్తువుగా చేసుకొన్న న్యాయవాదుల నిఘంటువుల్లో వాదనేగాని వేదనకు తావులేదు. ఐనా లేనిది ఉన్నట్టు ఉన్నది లేనట్టు చేయటానికైతే వకీలు అవసరం కాని ఈ కేసులో ఉన్నది ఉన్నట్టు చెప్పటానికి నాకు నాకంటే మంచి న్యాయవాది మరొకరు లేరని భావిస్తున్నాను. తమరు అనుమతిస్తే.... మాట పూర్తికాక ముందే "యస్ ప్రొసీడ్" అన్నారు జడ్జిగారు. తేజ గొంతు సవరించుకుంటూ "యువర్ ఆనర్ ఏ విషయమైతే ఒక నేరం రూపంలో నన్ను ముద్దాయిగా ఈనాడు ఈ స్థితిలో మీ ముందు నిలబెట్టిందో దీనిని మానవ విరచిత ప్రతి శిక్షాస్మృతి తరతరాలుగా పలురకాలుగా శిక్షిస్తూ వస్తూ ఉన్నా సమస్యకు అసలు పరిష్కారం కనుగొనలేకపోయింది. సమస్య పరిష్కారం కాలేదు సరికదా అసంఖ్యాక సమస్యల్ని సృష్టిస్తూ ఉంది. కారణం వ్యాధి ఒకటైతే మందు మరొకటిగా ప్రవరిస్తూ ఉంది ఈ వ్యవస్థ. విలువైన మానవ జీవన కాలం వృథా కాకుండా ఈ నిష్ప్రయోజన నాటకానికి ఇకనైనా తెరపడాలంటే విషయాన్ని మానవ సహజ నైజకోణం నుండి పరిశీలించమంటూ తమకు చేతులెత్తి మొక్కుతున్నాను" అంటూ తలవంచి, రెండు చేతులూ జోడించాడు తేజ. కోర్టులోని జనంలో ఉత్కంఠత ఆవరించింది. ఆ మాటలకు జడ్జిగారు సైతం ప్రభావితులైనట్టుగా అక్కడున్న కాగితాలు పక్కకు జరిపి పెన్నుకు క్యాప్ బిగించి సర్దుకుంటూ "సరే ఏం చెప్పదలుచుకున్నావో చెప్పు" అంటూ తేజ మాటల్ని శ్రద్ధగా వినటానికి సిద్ధమయ్యారు. ఒక సుదీర్ఘ ప్రసంగాన్ని ప్రారంభిస్తున్నట్లుగా ఇన్‌షర్ట్ చేసిన తన ఫ్యాంట్‌ను సర్దుకుంటూ" యువర్ ఆనర్ పసితనం పాలకోసం, బాల్యం బొమ్మల కోసం, వృద్ధాప్యం ఆశ్రయం కోసం అలమటించటం ఎంత సహజమో యవ్వనం లైంగిక సుఖం కోసం పరితపించటం కూడా అంతే సహజం. సహజమే కాదు అది జన్మతః మానవ నైజం కూడా. అంతకన్నా అది ప్రకృతి ధర్మం. నేనైతే ఇంకొక అడుగు ముందుకు వేసి అది యవ్వనపు హక్కు అంటాను. యువర్ ఆనర్ పరవళ్లు తొక్కే యవ్వన దశలో చెలరేగే లైంగిక దాహానికి స్త్రీ ఒక కొలను లాంటిది లైంగిక దాహార్థి ఆ కొలనులో తనివి తీరా త్రాగి దాహం తీర్చుకోవాలనుకోవటం సహజం కూడా.... మధ్యలో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారు దిగ్గున

లేచి "అబ్జెక్షన్ యువర్ ఆనర్ ముద్దాయి స్త్రీ జాతినే అవమానిస్తున్నాడు... అంటూ ఉండగానే తేజ "యువర్ ఆనర్ ఇది తరతరాలుగా యువతరాన్ని వేధిస్తున్న సమస్య. భారత స్త్రీ గౌరవ మర్యాదలకు సంబంధించిన సమస్య దేశ భవితను నిర్దేశించే నిజం. అందుకే అరమరికలు లేకుండా చర్చించుకోవటం ఎంతయినా అవసరం. ఐనా యవ్వన దశలో ఉన్న మీకందరికి తెలుసు నేను చెప్పేది నూటికి నూరుపాళు నిజమని. ఇది అబద్ధం అసహజం అని ఎవరైనా అంటే వారి మగసిరినే శంకించవలసి ఉంటుంది.... "అంటూనే జడ్జితో సహా అక్కడ ఉన్నవాళ్లంతా లోలోన నవ్వుకున్నారు. "అబ్జెక్షన్ ఓవర్ రూల్డ్... ప్రొసీడ్" అన్నారు జడ్జీగారు శ్రద్ధగా వింటూ. అలవాటు ప్రకారంగా తేజ తన వెంట్రుకలను సర్దుకుంటూ "థ్యాంక్యూ యువర్ ఆనర్" అంటూ "అయ్యా మీరు నన్ను చూస్తున్నారు...... నేను యవ్వనంలో ఉన్నాను. ధర్మాలు మంచి చెడులు వంట బట్టని నాలో చెలరేగే యవ్వన కోరికల్ని బంధించగలిగే ధార్మిక శృంఖలాలు నావద్దలేవు మా విద్యా విధానంలో కూడా అలాంటిదేమీ లేదు. అలాంటి నన్ను, నాలాంటి అసంఖ్యాక యువతను మా పట్టాన మమ్మల్నీ వదలలేదు ఈ సమాజం. డబ్బు కక్కుర్తితో బూతులు వ్రాసి సాహిత్యాన్ని కలుషితం చేశారు రచయితలు, కవితలను పతితలనుగా చేశారు కవులు. కూడబలుక్కొని స్త్రీ గౌరవ గర్భంలో గునపాలు దించారు సినిమా వాళ్లు, టి.వి.ల వాళ్లు.

వాటన్నిటినీ వదిలి పరుగెత్తగలిగినా మేమున్నాముగా అంటూ అడుగడుగునా పలుకరించే అశ్లీల సాహిత్యం, నగ్న సినిమా పోస్టర్లు, నీలిచిత్రాలు ఒకటేమిటి సకల కళలు బూతుతో కళ కళ లాడుతున్నాయి. అణు బాంబులు తయారు చేసి అగ్రరాజ్యాల వరసన నిలబడ్డామని చెప్పుకుంటున్న ప్రభుత్వమే వీటిని ఆపలేక వీటి ధాటికి చేతులెత్తి దాసోహపడుతూ ఉంటే వేడెక్కి పోయిన నేను ఎక్కడికని తిరగను? ఎంతదూరమని వెళ్లను?? ఎంత కాలమని పరుగెత్తను??? ఆవేశంగా అంటూ జారుతున్న వెంట్రుకలను సర్దుకుంటూ యువర్ ఆనర్ ఇక అసలు విషయానికి వస్తే ఈ వాతావరణంలో వేడెక్కిన మస్తిష్కం పట్టుతప్పిన స్థితిలో బయటికి వెడితే ఎక్కడ చూసినా స్త్రీ బెత్తెడు రవికతో అర్థనగ్నంగా దర్శనమిస్తూ ఉంది. మదిలో రగిలే కామాగ్ని పర్వతాలపై వాటిని మరీ రగిల్చే తన శరీర భాగాలను బహిర్గతం చేస్తూ వాటికి ఆజ్యంపోస్తూ ఉంది. యువర్ ఆనర్ మహా మహులకు సైతం వల్లకాని మనోబలం ఎక్కడినుండి తెచ్చుకోవాలినేను? ఎక్కడెక్కడని చూపులు దించుకోవాలి? ఎంత కాలమని కళ్లు మూసుకుని తిరగాలి?..... చెప్పండి..... చెప్పండి యువర్

ఆనర్ చెప్పండి. ఇది మగవాళ్లపై ఆడవాళ్లు చేసే నిశ్శబ్ద అత్యాచారం కాదా? నేను జబార్లలో తిరిగే యువతుల వీపులను నడుము భాగాలను స్పృశిస్తారనే అభియోగంతో నాపై ఈ కేసును నడుపుతున్నారు పోలీసులు. నిజమే ఆ పని నేను చేయటం లేదు. కవ్వింపజేసే వారి అర్థనగ్న వస్త్రధారణ నాతో ఆ పని చేయిస్తూ ఉంది. చలించకుండా ఉండటానికి నేను రాయిని కాదు, మనో నేత్రాలు మూసుకోవటానికి మహర్షిని అంతకన్నా కాను.... చేస్తాను అర్థనగ్న వస్త్రధారణతో, కవ్వించే స్త్రీల శరీర భాగాలను వారు వాటిని కనపడకుండా కప్పుకునేవరకూ అలా చేస్తూనేపోతాను. ఎర్రగా ఉన్న తేజ ముఖం ఉద్రేకంలో మరీ ఎర్రబారింది. ఒక చేత్తో వెంట్రుకలను మరో చేత్తో కర్చీఫ్‌తో చెమటలు పట్టిన ముఖాన్ని తుడుచుకుంటూ ఇంకా మాట్లాడటానికి మొదలు పెట్టకముందే అంతవరకూ ఈ మాటలింటూ రెచ్చిపోయిన ఎదుటి బోనులో నుంచున్న ఆ అమ్మాయి కోపంగా.... షటప్..... ఏమిటి..... నోటికి వచ్చినట్టల్లా వాగుతున్నావు? అంటూనే ఆర్డర్.... ఆర్డర్ అంటూ జడ్జిగారు బల్ల చరుస్తూ ఉన్నా వినిపించుకోకుండా ఆ అమ్మాయి "నా సింగారంపై నా వస్త్రధారణపై ఏమిటీ నీ పెత్తనం? అంది "నీ సింగారం నలుగురు నడిచే బజారులో కాదు.. బహిరంగం ఏ ఒక్కరి తాతసొత్తూ కాదు. దానికి కొన్ని సామాజిక కట్టుబాట్లు ఉన్నాయ్. బెత్తడు రవికతో మూరెడు వీపు బారెడు నడుము చూపుతూ లోహిప్పు చీరెకట్టుతో నీవు చేసే ఈ అంగాంగ ప్రదర్శన నీ ఇంట్లో చేసుకో..... ఇది స్త్రీ లక్షణం కాదు అన్నాడు తేజ అంతే తీక్షణంగా.

"నన్ను శాశించే అధికారం ఎవరిచ్చారు నీకు? మరీ రెచ్చిపోతూ అంది ఆ అమ్మాయి.

"నన్ను కవ్వించే అనుమతి నీకెవరిచ్చారు? ప్రశ్నకు ప్రశ్నే సమాధానంగా అంతకన్నా రెట్టింపుగా అన్నాడు తేజ.

"అసలు నావైపు నిన్నెవరు చూడమన్నారు"? "చూడు నీ గుండెలపై చెయ్యి వేసి చెప్పు ఎదిటి వారు చూడాలని కాకపోతే ఇంత అతిగా ఎందుకు సింగారించుకుంటావు?" అన్నాడు తేజ జారుతున్న వెంట్రుకలను సర్దుకుంటూ, రసవత్తరంగా సాగుతున్న వారి వాదోపవాదాలు వింటూ నిశ్శబ్దంగా లోలోన నవ్వుకుంటున్నారు జడ్జి, ప్రాసిక్యూటర్. ఆ అమ్మాయి మరీ రెచ్చిపోతూ 'నేను ఇలాగే తిరుగుతాను... ఈ దేహం నాది.... నాయిష్టం."

"నేనూ ఇలాగే చేస్తాను కనపడే అంగాలను స్పృశించి ఆనందిస్తూ ఉంటాను... నా బుద్ధి... నా చెయ్యి... నా ఇష్టం అన్నాడు తేజ.

అంతవరకు అసహనంగా ఉన్న ప్రాసిక్యూటర్ విసురుగా లేచి అబ్జెక్షన్ యువర్ ఆనర్... ముద్దాయి హద్దులు మీరి ప్రవర్తిస్తున్నాడు అన్నాడు.

జడ్జిగారు అబ్జెక్షన్ సస్టెయిండ్ అంటూ తేజవైపు చూస్తూ చూడు... ఇది కోర్టు... నీ నిర్దోషిత్వాన్ని నిరూపించుకునే తీరు ఇది కాదు" అంటూ కళ్లజోడు సవరించుకుంటూ "సరే... ఇంకా ఏమైనా చెప్పదలచుకున్నావా?" అని జడ్జిగారు అంటూనే "క్షమించండి యువర్ ఆనర్... అంతా ఆవేశం... అసహనం.. అశాంతి మమ్మల్ని ఎక్కడ ప్రశాతంగా ఉండనిచ్చింది ఈ సమాజం" అంటూ "యువర్ ఆనర్... నేను పోలీస్ సబ్ఇన్స్పెక్టర్ గారిని ప్రశ్నించదలుచుకున్నాను" అంటూనే జడ్జిగారు ఆదేశంతో బోనులోనికి వచ్చి నిలబడిన ఎస్సై వైపు చూస్తూ "ఎస్సై గారూ... నేరం చేసినవాడు నేరస్థుడైతే ఆ నేరం చేయటానికి ప్రేరేపించిన వాణ్ణి ఏమంటారు?" అడిగాడు తేజ. "వాడూ నేరస్తుల జాబితాలోనికే వస్తాడు" అంటూ ముక్తసరిగా సమాధానం ఇస్తూనే "థ్యాంక్యూ... దట్సాల్" అంటూ తేజ జడ్జి వైపు తిరిగి యువర్ ఆనర్.... ఏ భాగాన్ని చూడటం, స్పృశించటం నేరమో ఆ భాగాలను చూపటం కూడా నేరమే కదా? అని అంటూ "క్షమించాలి ఇంతకు ముందు కేసులో "తినదగ్గ పదార్థాలను తెరిచి ఉంచటం తప్పుగాని అలా తెరిచి ఉంచగా వాటిని తిన్న కుక్కది నేరం కాదు అంటూ తమరే తీర్పు ఇచ్చారు... మరి... మాట ముగియక ముందే జడ్జిగారు అందుకొని .... అది కుక్క విషయం నీవు మనిషివి కదా?"

"నేను మనిషినే కాని ధర్మాధర్మాల మర్మాలు తెలియని నా బుద్ధి కుక్క బుద్ధి.... వేళ్లపై లెక్కించ తగ్గ వాళ్లు తప్ప ఈ సమాజంలో మసలే వాళ్లంతా నాలాంటి వాళ్లే... ఇలాంటి సమాజమని తెలిసి కూడా కవ్విపంపజేసే తమ అంగాలను, అందాలను ప్రదర్శిస్తూ తిరిగే స్త్రీలు నిజమైన దోషులు, నేరస్థులు, బరితెగించి తిరుగుతూ మగవాళు మస్తిష్కాలకు పిచ్చెత్తిక్కించే ఇలాంటి స్త్రీలు సామాజిక నేరస్థులు, వీరు శిక్షార్హులు..... జారుతున్న వెంట్రుకలను తలపైకి సర్దుకుంటూ "యువర్ ఆనర్... మగవాళ్లను నైజ సిద్ధంగా రెచ్చగొట్టే తమ శరీర భాగాలను స్త్రీలు పనిగట్టుకొని ఒకవైపు ప్రదర్శించుకుంటూ, బజార్లలో విచ్చలవిడిగా తిరుగుతూ పైగా యువకులు కళ్లు మూసుకొని బుద్ధిగా ఉండాలని ఆశించటం సమంజసమా? తపోనిష్టా గరిష్టులైన వారికే సాధ్యం కాని పని నిత్యం అశ్లీలంతో అభ్యగన స్నానం చేస్తూ, బూతుల ఊబిలో కూరుకోపోతున్న ఈనాటి యువతకు ఇది సాధ్యమా? ఇది తప్పు అని మేము చదివిన పుస్తకాల్లో ఎక్కడా లేదే? ఏ ఉపాధ్యాయుడూ మాకు ఈ విషయం

చెప్పలేదే? మీ చట్టం ప్రకారం నడుచుకోవాలంటే ఈ దేశంలో మగవాళ్లంతా గుడ్డి వాళ్లుగానో లేక నపుంసకులుగానో పుట్టాలి..... ఇలా అంటున్నందకు క్షమించాలి యువర్ ఆనర్. ఈ కేసుకు ఇదే సరైన భాష మరే భాషలో చెప్పినా విషయపు లోతులు అర్థం కావు" అంటూ "యువర్ ఆనర్ మరొక్క మాట... ఇదేనా చివరి మాట ఆ అమ్మాయిని ఆ స్థితిలో చూస్తున్న ఇక్కడ ఉన్న మగవాళ్లందరిలో 'ఆ'.... అంటే 'ఆ' ఆలోచనలు కలగటం లేదా? ఇక్కడున్న మగవాళ్ల మనసులన్నీ ఒకే రూపం ధరించి నాలో ప్రవేశించగలిగితే "నేను" తడబడకుండా ఠక్కున చెప్పేది ఒకే ఒక్క మాట 'ఇది నిజం.. నిజం... నిజం" ఔనా కాదా? "ఆవేశంగా గద్దించాడు తేజ నిశ్శబ్దం ఆవరించింది. అది నిజమే అని ఒప్పుకున్నట్టు కనబడుతున్న జడ్జిగారు ఆ అమ్మాయి వైపు చూస్తూ "అమ్మాయ్ ఆ శరీర భాగాలు కనపడే ఈ వస్త్రధారణలో నీకు ఎలాంటి సౌకర్యం ఉంది? అలా కాకుండా వాటిని ఆచ్ఛాదించే వస్త్రాలు ధరించటం వల్ల నీకు ఏదైనా అసౌకర్యంగా ఉంటుందా? అడిగారు జడ్జిగారు. ఏం చెప్పాలో తెలియక ఆ అమ్మాయి తడబడుతూ "యువర్ ఆనర్.. మరి... మరి.... ఏదో అలవాటుగా వస్తున్న దీనిని మానుకో లేకుండా ఈ వస్త్రధారణ చేసుకుంటున్నాము. నిండుగా ఆచ్ఛాదించుకునే వస్త్రాలతో ఎలాంటి అసౌకర్యం ఉ ండదు. పైగా నిండుగా ధరించే వస్త్రాలకు అలవాటు పడ్డ నా స్నేహితురాలు ఆయేషా నాకంటే ఎంతో నిర్భయంగా నింపాదిగా గౌరవంగా ఉంటుంది. ఆమె ఎలాంటి వేధింపులకు పోకిరి చూపులకు గురికావటం లేదు. ఎటొచ్చీ ఏదో అర్థం లేని సంస్కృతిలో పెరిగిన నేను దీని నుండి బయటపడలేక పోతున్నాను. ఒక్కోసారి నా తల్లి దండ్రులపై కోపం వస్తుంది. మొదటి నుండి నాకు ఆయెషా లాంటి గౌరవ ప్రదమైన నిండు వస్త్రధారణ ఎందుకు అలవాటు చేయక పోయారా? అని. చెమ్మగిల్లిన కళ్లను రెప్పలతో ఒత్తుకుంటూ యువర్ ఆనర్.... సమాజంలో తండ్రులు, అన్నలు, భర్తలు, కుమారులు మేధావులు, సంఘ సంస్కర్తలు, నాయకులు న్యాయకోవిదులు ఏ ఒక్కరూ దీన్ని అసభ్యంగా భావించి అభ్యంతరం చెప్పి ఆపలేకపోయారు. కారణం వీరిదంతా ఒకే జాతి, స్త్రీని వీలైనంత నగ్నంగా చూస్తూ ఆనందించే నైజం గల పురుష జాతి వారిచే తరతరాలు ఈ దుస్థితిలో మలచబడిన అమాయక స్త్రీ తన అలవాటు నుండి బయటపడలేకపోతూ ఉంది. ఇది మగవాళ్లపై ఇంతటి దుష్ప్రభావం చూపుతూ ఉందనే స్పృహకూడా మాకులేదు. ఇప్పుడే తెలిసింది ఇలాంటి ఫ్యాషన్ల వస్త్రాలు ధరించటంతో తమకు తెలియకుండానే మా ఫ్యాషన్ వస్త్రధారణ వల్ల

సమాజానికి ఎంత కీడు కలుగుతుందో.... ఎక్కడ లోపం? ఏది పరిష్కారం?? ఎవరో రావాలి... సమాజాన్ని సంస్కరించాలి... ఎవరో... వారెవరో...." అంది ఆ అమ్మాయి వేదాంత ధోరణిలో. ఇది నిజం... నిజం అంటూ ఐదు గంటలు కొట్టింది గడియారుం. "తీర్పు రేపటికి వాయిదా వేస్తున్నాను అంటూ" తన స్థానం నుంచి లేచి ఛాంబర్‌లోకి వెళ్లిపోయారు జడ్జిగారు.



ఆ మరునాడు కోర్టు కొలువు తీరింది. ఆ అమ్మాయి ముద్దాయి తేజ నించున్న బోనుకు దగ్గరగా ప్రేక్షకుల గ్యాలరీలో ముందు వరసన కూర్చుంది. తీర్పు వినటానికి వచ్చిన జనంతో కోర్టు కిటకిటలాడింది. ఎంతో గంభీరంగా కనబడుతున్న జడ్జిగారు తీర్పును చదవటం ప్రారంభించారు."వాదోపవాదాలు విన్న తరువాత ఈ కేసులో నేను మొదటి సారిగా రెండు తీర్పులు ఇస్తున్నాను. చట్టానికి ఆవలి పరిధిలో ముద్దాయి చెప్పింది నూటికి నూరుపాళ్లు నిజం. పురుషుల లైంగిక భావాలను రెచ్చగొట్టే వస్త్రధారణ స్త్రీకి విహితం కాదు, గౌరవనీయం కాదు. ముద్దాయి చెప్పినట్టు ఒక విధంగా ఇది పురుషులపై స్త్రీల పరోక్ష అత్యాచారమే అవుతుంది. సమాజంలో దీనిపై చర్చ అవసరం. ఈ విషయంలో స్త్రీలు స్వచ్ఛందంగానూ వారి సంరక్షకులైన పురుషులు వారిని సమాధాన పరచటం మూలంగానూ స్త్రీలలో హద్దులు మీరిపోతున్న అభ్యంతకర వస్త్రధారణను విశృంఖల ప్రవర్తనను నిలువరింపజేయటానికి కృషిచేయాలి ఇందులోనే స్త్రీ భద్రత దేశ గౌరవం ఇమిడి ఉన్నాయి. రెండవది అలా అని ముద్దాయి చేసింది నేరం కాదు అనటానికి అమలులో ఉన్న చట్టం ఒప్పుకోదు. ఆ కారణంగా ముద్దాయి ఆ అమ్మాయిలో కనపడే వీపు, నడుము భాగాలను స్పృశించటం చట్ట రీత్యా నేరం అందుకు భారత శిక్షాస్మృతి 354 ప్రకారం ముద్దాయి తేజకు మూడేళ్ళ కారాగార శిక్ష విధించడమైనది"...... అంటూ ఇంకా చదువుతూ ఉండగానే తేజ తలపై వేల పిడుగులు ఒక్కసారిగా విరుచుకో పడినట్టనిపించింది. దెబ్బతిన్న పులిలా కోర్టు హాలు దద్దరిల్లిపోయెదా "జైలుకా..... నో..... అంటూ గర్జిస్తూ "నో..... నో యువర్ ఆనర్ ....నో అంతకంటే చచ్చిపోవటం మేలు అంటూ ప్రాధేయపడేలా " ప్లీజ్ యువర్ ఆనర్...... ప్లీజ్ నన్ను శిక్షించకండి. మా తల్లిదండ్రులకు నేను ఒక్కడినే....... నేను వారి ప్రాణాన్ని.... ఈ విషయం తెలిస్తే వంశగౌరవమే ఊపిరిగా బ్రతుకుతున్న నా తల్లిదండ్రుల గుండెలు పగిలి చచ్చిపోతారు. నేను ఓ అరగంట కనపడకపోతే నాకోసం పిచ్చిదానిలా తిరిగే మా అమ్మ ఇక బ్రతకదు.... యువర్

ఆనర్ నేను..... మాట పూర్తికా ముందే జడ్జిగారు అందుకొని "చట్టం ముందు మనం.... మధ్యలో అదే ధీటున అందుకొని తేజ "చట్టం..... చట్టం...... చట్టం..... ఎక్కడుంది చట్టం ఎందరో అమాయక కన్నె పిల్లల మానాలతో నిత్యం దాహం తీర్చుకునే నరరూప రాక్షసులే సమాజంలో ఘరానా మనుషులై విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటే ఎక్కడ నిద్రపోయింది మీ చట్టం? మతం పేరిట మనుషుల మధ్య వైషమ్యాలను పెంచి మారణ హోమాలను రగిలిస్తూ దేశభక్తులుగా, నేతలుగా చలామణీ అవుతూ ఉంటే ఎక్కడ చచ్చింది మీ చట్టం? అంటూ ఆవేశంతో ముఖమంతా చెమటలు పోసి నుదిటిపై వాలిన వెంట్రుకలను ఎగేసుకోటానికి తలను బలంగా పంకిస్తూ ఏదో అంతిమ నిర్ణయం చెప్పబోతున్నట్టు గంభీరంగా "యువర్ ఆనర్..... పురుషులను రెచ్చగొట్టే అర్థనగ్న వస్త్రధారణా సింగారాలతో స్త్రీ బరితెగించి బజార్లలో సంచరిస్తున్నంత కాలం ఇలాంటివే కాదు ఇంతకన్నా ఘోరమైన నేరాలు జరుగుతునే ఉంటాయి.... కేవలం నన్ను శిక్షించటంతోనే ఈ సమస్య పరిష్కారమౌతుందనుకుంటే మీ గుడ్డి చట్టం వేసే ఈ తేలిక పాటి శిక్షతో ఏమీ సాధించలేరు. మరణశిక్ష వేయండి.... చంపండి.... దేశంలోని మగవాళ్లనందరినీ చంపండి.... ఆ తరువాత స్త్రీలను అర్థనగ్నంగా కాదు నగ్నంగా తైతక్క లాడమనండి" అంటూ ఆ అమ్మాయి వైపు చూస్తూ "ఓ స్త్రీ నీవు ఓ అందమైన హంతకురాలివి, నీ విచ్చలవిడితనానికి, నీ హొయ లయలతో నిత్యం ఎంతో మంది పురుషులపై మానసిక అత్యాచారం చేస్తూ కూడా ఎవరికి పట్టుపడని, గాడి తప్పి, పెడదారి పట్టిన నీ నైజానికి నా విషాదాభినందనలు. ఫ్యాషన్ల ముసుగులో నీ విశృంఖల అంగాంగ ప్రదర్శనా విషాలింగనంలో మరెందరినో జీవ సమాధి చేస్తున్న అపరాధివై కూడా నిరపరాధివై తిరుగుతున్న ఓ నారీమణీ! నీకివే నా నిస్సహాయ జోహార్లు. నీకు చేతులెత్తి మొక్కుతున్నాను. ఇకనైనా చాలించు నీ తియ్యని విష స్వరూపం, నీ అర్థనగ్న స్వరూపం అందుకు స్వీకరించు యావత్ పురుష జాతి తరపున నేను నీకు సమర్పించుకుంటున్న నా రక్తతర్పణం.... కనుకరించు... ఇంతటితోనైనా శాంతించు... ఇకనైనా మానుకో ఈ అంగాంగ ప్రదర్శనం ఆవేశంగా అంటూ రెప్పపాటుతో తన ఫ్యాంటు జేబులో నుండి రివాల్వర్ తీసి కణతకు గురిపెట్టి పేల్చుకుని బోనులోనే కుప్పకూలిపోయాడు. తల నుండి ధారగా చిమ్ముతున్న రక్తం ఆమె వైపు మెల్లిగా పారుతూ కనిపించింది. ఈ హటాత్పరిణామానికి కాలచక్రం ఒక్కసారిగా ఆగిపోయిందా అన్నట్టు కోర్టులోని జనం నిశ్చేష్టులైపోయారు. తేరుకున్న జనం

కలకలంతో కోర్టు హోరెత్తిపోయింది గుండెలు బాదుకుంటూ రెచ్చిపోతున్న తేజ స్నేహితులతో, చేతులు ముఖాలకు పెట్టుకుని రోదిస్తున్న మహిళలతో. ఎవరు ఏం మాట్లాడుతున్నారో ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియని భయం.... ఆ అమ్మాయిని చూస్తూ "ఇంకా చూస్తావేరా.... ఎయ్....." అంటున్న తేజ స్నేహితులు. అక్కడ అదుపుతప్పుతూ విషమిస్తున్న పరిస్థితిని గమనించిన పోలీసులు లాఠీలు ఘుళిపిస్తూ జనాన్ని అతికష్టంగా బయటికి నెట్టేసినా జనం కోర్టు బయట రోడ్డుపై గుంపులు గుంపులుగా నిలబడి పోయారు. విషయం ఆ నోటా ఈ నోటా ఊరంతా పాకిపోయింది. "లేకున్నా ఈ మధ్య ఫ్యాషన్‌లతో మరీ బరితెగించిపోతున్నారండి ఈ ఆడవాళ్లు....... సినిమాలు చూస్తూ మితిమీరి పోతున్నారు...... బెత్తెడు రవిక బిగువుగా కట్టిన ఉల్లి పొరలాంటి చీరెలు.... ఏమైపోవాలి జనం..... అరె మగవాళ్లం మనం మేలు గదయ్యా నిండుగా ఉంటాయి మన గుడ్డలు.... ఈ ఆడాళ్లకే మొచ్చిందయ్యా మరీ సిగ్గు లేకుండా.... "ప్చ్...... అనుకుంటే ఏం లాభం.... ఆ బుద్ధి మనకుండొద్దూ... పరాయి మగవాళ్లు మన ఆడోళ్ల అందాలను మన ముందే రెప్పవాల్చకుండా లొట్టలు వేసుకుంటూ చూస్తూ ఉంటే మనకు చీమకుట్టినట్టయినా ఉందా?...... అసలు సిగ్గులేంది మనకు..... మనం గట్టిగా చెబితే ఎంత దూరం పోతారయ్యా ఆడోళ్లు... అంటూ జనం తమకు తోచినట్టల్లా మాట్లాడుకుంటు ఉ ంటే ఆ దారిన వెడుతూ విషయం గ్రహించిన స్త్రీలు చెరుగులతో తమ దేహాలను నిండుగా చుట్టేసుకొని వెడుతున్నారు.

రెచ్చిపోయిన ఆ గుంపు నుండి ఆ అమ్మాయి సురక్షితంగా బయటికి వెళ్లే పరిస్థితులు లేని కారణంగా పోలీసులు రక్షణగా ఆమె అన్నలు ఆమెను చెరోవైపు పట్టుకొని పోలీసు వ్యాన్‌వైపు నడిపించుకో వస్తున్నారు.

చెరుగుతో దేహాన్ని నిండుగా చుట్టుకొని ముఖం కూడా కనపడనంతగా తలపై నుండి చెరుగు వేసుకొని తలవంచుకొని రెండు చేతులు ముఖానికి పెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ భారంగా నడిచి వస్తూ ఉంటే రోడ్లపైన రెచ్చిపోయిన జనం ఒక్కసారిగా "ఓ..... అంటూ పెద్దగా అరుస్తూ ఉంటే తిట్లు, శాపనార్థాలు అల్లరి రోదల మధ్య ఆమె కూర్చున్న పోలీసు వ్యాను రాళ్లవర్షంతో ప్రజల మధ్య నుండి వేగంగా దూసుకుపోయింది.



# 8

# మౌన సందేశం

ముప్ఫై ఆరు గంటల రైలు ప్రయాణంలో ఒక్కొక్క గంటను దాటేసుకోపోయే కంటే వెలగబెట్టేది ఏముంటుంది గనుక? ఈ (కాల) శకటం తనలో పయనించే జనాన్ని వారి గమ్యాలకు చేర్చుతూ నిరంతరం పయనిస్తూనే ఉంటుంది. ఇలా ఎంతకాలమో...? ఏమో..? ఈ క్షణానికి తనలో పయనించే జనాల్లో నేనూ ఒకణ్ణి. నా గమ్యం చేరే వరకూ కాలూ చెయ్యి కదిలిస్తూనే ఉండాలిగా. ఈ ఆలోచనలతో ఒక్కొక్క బటానీ గింజ నోట్లో వేసుకుంటూ యాంత్రికంగా నములుతూ ఉన్న నాకు కాంతివంతమైన రెండు పెన్‌టార్చ్‌లు వెలుగుతున్నట్టు కళ్లు మిటకరిస్తూ నోటిలో వేళ్లు పెట్టుకొని అమ్మ భుజంపై తన చిరుగడ్డాన్ని ఆనించి నావైపు బోసిగా నవ్వుతూ కనిపించిన ఏడాది నిండిన ఆ బాబు ఎంత ముద్దొస్తున్నాడో! ఇద్దరం కాస్సేపు మూగ భాషలో మాట్లాడుకున్నాం. ఎంత నిర్మల హృదయం వాడిది? నుదుట చారెడంత కుంకుమ దిద్దుకున్న గోముఖ వ్యాఘ్రాలు మారణహోమాలు సృష్టించి మానవ రక్తపుటేరులు పారించిన దృశ్యాలు మదిన మెదిలినప్పుడు వాడి నుదిటి బొట్టు కనిపించీ కనిపించని చుక్కలా చిన్నగా ఉన్నా ఆ పాల బుగ్గల పసివాడు కనిపించిన వారందరినీ కళ్లతో పలుకరిస్తూ కరువుతీరా చిరునవ్వులు పంచిపెడుతున్నాడు. అసలు ఈ భూమిపై వాడే ఓ సెక్యులరిజం అనిపించింది. వాడికి తినిపిద్దామని నా జేబులోని ఓ చాక్‌లెట్ తీసి పైకాగితం తొలిగిస్తూ ఉండగనే నోరు తెరిచాడు. ఓరి పిడుగా... అనుకుంటూ వాడినోట్లో చాక్లెట్ పెట్టడం, అది చూసి పక్కన ఉన్న మా బంధువు ఓ పెద్దాయన వారిస్తూ నా చేయిని బలంగా లాగుతూనే వాడి నోట్లోని చాక్లెట్ కిందపడిపోవటం ఒక్కసారిగా జరిగిపోయిన దానికి నేను విస్తుపోయి చూస్తుంటే, అందుకు మా పెద్దాయన నా చెవిలో ఏదో చెబుతూ ఉంటే రైలు బ్రిడ్జిమీద పయనిస్తున్న కారణంగా ఆ శబ్దంలో ఆయన మాటలు అస్పష్టంగా వినిపించాయి. క్రిందపడ్డ చాక్లెట్ వైపు వాడు ఆశగా చూస్తున్నాడు. నాకు ఏం చెయ్యాలో అర్థం కాలేదు. నోటిదాకా వచ్చినే

చాక్లెట్ కింద పడిపోవటం వల్ల వాడి గులాబి పెదవులు వంకర్లు తిరిగి ఏడ్పులంఘించుకుంటూ ఉంటే అంతవరకూ ఇదంతా గమనిస్తున్న వాళ్ల అమ్మ వాడి పెదాలకు అంటుకున్న ఆ కాస్త చాక్లెట్ జిగటను మాకంటపడకుండా తన చెరుగుతో శుభ్రం చేసింది. ఇదంతా చూస్తున్న నాకు మతిపోయినట్టనిపించింది. కొద్ది క్షణాల్లోనే ఏదో పెద్ద స్టేషన్ రావటం, బండి ఆగకముందే ప్లాట్‌ఫారంపై కోలాహలంలో ఏదో అనౌన్స్‌మెంట్, "ప్రయాణీకులకు హెచ్చరిక. ఎవరైనా అపరిచితులు ఇచ్చే పదార్థాలు తినకండి, మీ పిల్లలు తినకుండా చూడండి. అందులో మత్తు మందు కలిపి మీ సామానులను, పిల్లలను ఎత్తుకుపోయే దొంగలున్నారు జాగ్రత్త!" అంటూ ప్రకటన విన్న తరువాత నాకు అంతకుముందు జరిగిన చాక్లెట్ ప్రహసనం అర్థమైపోయింది. ప్రయాణంలో ఎవరు ఏమిచ్చినా తినటానికి నోచుకోని దుర్దశకు చేరుకుందన్నమాట పరిస్థితి.

ఏడ్పు చాలించిన ఆ బుడతడు ఈ సారి నావైపు అపహాస్యంగా చూస్తూ నన్ను ప్రశ్నిస్తున్నట్లు అనిపించింది. "ఏం అంకుల్! వైజ్ఞానిక విప్లవంతో భూగోళాన్ని ఒక కుగ్రామంగా మార్చుకున్నంత ఎదిగామని విర్రవీగుతున్న మీ సమాజంలో పసిపిల్లలకు ముద్దుగా ఒక్క చాక్లెట్ తినిపించే భాగ్యం మీకూ, తినే అదృష్టం మాకూ లేకుండా పోయిందానికి మీరు సిగ్గుపడటం లేదా?" అంటూ వాడు నిలదీస్తున్నట్టనిపిస్తే, "నిజమేరా బా...బూ... చిన్న వాడివైనా ఉన్నమాట చెప్పి నా చెంపఛెళ్లనిపించావు" అంటూ ముద్దాయిలా తలదించుకుంటూ ఉంటే, వాడు మళ్లీ "అంకుల్ అప్పుడే తలదించుకుంటే ఎలా సమయం దొరికింది కాస్త మనసారా మాట్లాడుకుందాం.... ఐనా ఏం పొయ్యేకాలం మీకు దేవుడు మిమ్మల్ని మనుషుల్లా పుట్టించి జ్ఞానాన్ని ప్రసాదిస్తే మీరు జంతువులకన్నా అధ్వాన్నంగా బ్రతకటాన్ని కోరుకుంటున్నారెందుకని? వాడి ప్రశ్న నా వీపు మీద కొరడా ఝుళిపించినట్టు ఊహించుకుంటూ, "ఏమిట్రా అది పెద్ద వాడిననే గౌరవం కూడా లేకుండా నోటికొచ్చినట్టల్లా వాగుతున్నావ్ నిన్నగాక మొన్న పుట్టి..." పూర్తికాకుండా మధ్యలోనే అందుకున్నవాడిలా, "అరెరే ఔను మరిచాను తమరు పే...ద్ద... వారు కదూ పెద్ద పనులే చేస్తున్నారు. అందల మెక్కిన అంతులేని అవినీతిని అరికట్టవలసిన నాయకులు, అధికారులే అవినీతికి పాల్పడుతూ దేశాన్ని క్రిస్మస్ కేక్‌లా కొరుక్కు తింటున్న నీతిలేని జాతి మీది; కల్తీలతో కేరింత కొడుతున్న బజార్లు మీవి, అశ్లీల అరాచకాలతో

గుట్కా, మట్కా, జర్దా, సారాల మత్తు మరిగి మట్టి గరిచిపోతున్న యువత మీది. వరకట్న హెూమాలలో మహిళలను సమిధలుగా కాల్చివేస్తున్న కసాయి గుండెలు మీవి.

అడవిలోని మృగాల కాలిగోళ్ల నుండి పుట్టల్లోని పాముల చర్మాలను సైతం వదలకుండా మానవతే సిగ్గుతో తలదించుకునేలా కన్నెపిల్లలను వేశ్యాగృహాలకూ, చివరకు సమాధుల్లోని అస్థిపంజరాలనే కాదు కొనేవాడుంటే మానాభిమానాలను సైతం అమ్ముకునే అధములు మీరు" అంటూ గుక్కతిప్పుకోకుండా తిడుతున్నట్టుగా కనిపిస్తున్నవాడు చేతిని నోటికి అడ్డంగా పెట్టుకుని మళ్లీ మొదలుపెట్టినట్టు, "ఆచారాలను గూర్చి అనర్గళంగా మాట్లాడే మీరు చేయని అత్యాచారాలు లేవు. మీ సమాజంలో ఏ మహిళ నిర్భయంగా తిరగగలుగుతూ ఉందో చెప్పగలరా...? అవ్వ... బడికి వెళ్లే చిన్నారి బాలికలకు సైతం భద్రత కరువైపోయిందే... ఔనూ... తెలీక అడుగుతాను, సమాజం ఇంతగా కుళ్లికంపుకొడుతూ ఉంటే, మీ మేథావులు, పండితులు, విద్యాధికులు ఏమయ్యారు? అంతా కట్టకట్టుకొని గంగలో దూకారా? లేక ఏదైనా భూకంపంలో మూకుమ్మడిగా సమాధైపోయారా...? ఇంకా ఏదో అనబోతూ ఉన్నాడని ఊహించుకున్న నేను భరించలేక వాడి నోరుమూయించాలనే విధంగా, "ఇదిగో మాస్టర్... ఏదో పసివాడని ఊరుకుంటే అతిగా వాగుతున్నావు. నీ ఈ ఆరోపణను నిరూపించగలవా? అంటూ ఈ ప్రశ్నతో ఇక వాడి నోటి తాళం పడితీరవలసిందే అనుకుంటూ, వాడిని నిలదీసినట్టు ఊహించుకుంటూ ఉండగానే వాడు వెక్కిరింతగా వికటాట్టహాసం చేస్తున్నట్టు కనిపిస్తూ. "నిరూపించటమా? ఎక్కడో ఎందుకు మీరు ఇప్పుడు చదువుతున్న పేపర్లోని అదే పేజీలో క్రింద ఎడమవైపు కాస్త చూడండి అంటున్నట్టుగా ఉంటే, "ఏడేళ్ల బాలికపై అత్యాచారం చేసిన ఉపాధ్యాయుడు" అనే శీర్షికను చూసి నాలుక కరుచుకున్నట్టనిపించి... "అవునూ... ఇంత విశాలమైన దేశం... ఎక్కడో ఏదో జరిగితే దానికి నువ్వేమో..." మాట పూర్తికాక ముందే ఆ గడుగ్గాయి అందుకున్నట్టు "సమస్త జీవన రంగాలలో కలుషితమైన మీ మనసులు, నిజాల గుండెలపై బండలెత్తి అసత్యాల సౌధాలలో విహరిస్తున్న మీ మనుషులు కనీసం నా ఈ ఒక్క ప్రశ్నకైనా సరైన సమాధానం చెప్పగలిగితే, ఆ సమాధానంతో వారు సమాధానపడగలిగితే, గాడి తప్పిన తమ గతుకుల బ్రతుకులకు రుజు గతులను నిర్దేశింపగలిగితే, ఈ జనాల దశలు మారి, ఈ దేశానికి ఓ మహర్దశ

ప్రాప్తమయ్యే అవకాశం ఉంది. "అంటూ ఇంతసేపూ వాగిన అలసటతో వాడు అమ్మ భుజంపైనే మెల్లిమెల్లిగా నిద్రకు జారుకుంటున్నట్టు ఊహించుకున్న నేను, వాడితో "ఇంతకూ తమరు నిద్రకు జారుకోక ముందే ఆ ప్రశ్న ఏమిటో కాస్త సెలవివ్వండి మహాప్రభో" అన్నట్టు వాడివైపు చూస్తున్నట్టు ఊహకలిగిన క్షణమే వాడు, "అంకుల్ మనం క్రూర మృగాలుగా నామకరణం చేసిన కొన్ని అడవి జంతువులు అవి నివశించే చోట అక్కడక్కడా మచ్చుకు కొన్ని, "అభయ అరణ్యాలను నిర్మించుకొని అక్కడ మనుషులు నిర్భయంగా సంచరిస్తూ ప్రకృతి అందాలను తిలకించే అవకాశాన్ని కలుగజేస్తున్నాయి కదా! ఇన్ని ధర్మాలు పరిఢవిల్లే ఈ పుణ్య భూమిపై మతిగల మనుషులు మసలుతున్న ఈ భూగోళంపై ఏ ఒక్క చోటైనా తన జాతి నిర్భయంగా సంచరించగల మచ్చుకు ఓ చిన్నపాటి. "అభయ మానవ సమాజాన్ని" సృష్టించుకోగలిగారా...? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసీ చెప్పకపోయారో... మీ గతి అధోగతి... ఆ నిర్ణయాధికారం దైవం మనుజజాతి చేతుల్లోనే పెట్టాడు. స్వీకరించి ఆచరించిన జాతికి దైవచిత్తమైతే అందలాలు ప్రాప్తమవుతాయి. తిరస్కరించిన జాతికి అధఃపాతాళమే గతి. వెళ్లాలనుకున్న చోటికి వెళ్లగల స్వేచ్ఛను ప్రసాదించిన ఆ దైవం ఎంతటి కరుణామయుడో! ఇక ఎక్కడకు వెళ్లాలో తేల్చుకోవలసింది మానవ జాతే" అంటూ వాడు నిద్రలోకి జారుకున్నట్టు ఊహ కలిగింది. బ్రతుకు జీవుడా అనుకుంటూ ఆ మౌనమునికో దండం పెట్టి అటు తిరిగాను.

సిగ్నల్ ఇవ్వని కారణంగా స్టేషన్ ఔటర్‌లో నిలబడిన రైలుకు దగ్గరలో కుండలు, బిందెలు పట్టుకొని మూగి తొక్కిసలాడుతున్న ఆ పెద్ద జనసమూహం ఏమిటని విచారిస్తే, అక్కడ మంచి నూనె తీసుకెడుతున్న ఓ పెద్ద ట్యాంకర్ బోల్తాపడి డ్రైవర్ చావుబ్రతుకుల్లో కొట్టుకులాడుతూ ఉన్నా ఒక్కరూ పట్టించుకోకుండా అక్కడి గుంటల్లో నిండిపోయిన నూనెను అందినంత నింపుకుని పోవటానికి ఎగబడిన జనమట వారు. ఆ జనాన్నీ, బాబు నోటి నుండి జారిపడిన ఆ చాక్లెట్‌పై నిండుగా ముసురుకున్న ఈగలను పదేపదే చూస్తూ నిట్టూర్చుతూ కొత్త ఆలోచనల్లోకి జారుకున్నాను.





# మన అందరి కర్తవ్యం

అది పేరుకు ఆర్టీసీ బస్సు స్టేషనేగాని ఓ చిన్న విమానాశ్రయంలా ఉంది, ఊరి బయట సువిశాల మైదానంలో అన్ని హంగులతో అత్యాధునికంగా నిర్మించబడ్డ ఆ బస్ స్టేషన్‌కు మూడు మాసాల క్రితమే ప్రారంభోత్సవం చేశారు. శుభ్రంగా ఉండి తెల్లటి పాలరాళ్లు పరిచి అద్దంలా ఉన్న విశాలమైన ప్లాట్‌ఫారం, ఏ బస్సు ఎక్కడ ఆగుతుందో తెలిపే మిరుమిట్లు గొలిపే ఎలక్ట్రానిక్ సైన్ బోర్డులు, వరుసగా అక్కడక్కడా ఉంచిన వాటర్ కూలర్‌లు, ప్రయాణీకులు కూర్చోటానికి వరసగా అమర్చిన ఆధునిక నైలాన్ కుర్చీలు, బయటికి వెళ్లే దారిలో పచ్చిక మైదానాలు, ఫౌంటేన్‌లు, పూల కుండీలు క్రోటాన్ మొక్కలు, ధగ ధగ మెరిసిపోయే మెర్క్యూరీ లైట్లు, లెక్కలేనన్ని ఫ్యాన్‌లు చూడటానికి ఎంతో అందంగా కనిపిస్తున్న ఆ బస్ స్టేషన్ ప్రయాణీకుల రద్దీతో మరీ శోభాయమానంగా ఉంది. అంతవరకు బస్ స్టేషన్ అందాన్ని తిలకిస్తున్న నేను అక్కడ ఓ కుర్చీ ఖాళీ అవుతూనే వెళ్లి ఆ కుర్చీలో కూర్చొని బ్రీఫ్‌కేస్ తెరిచి దినపత్రిక తీసుకొని ప్రముఖ వార్తలను మాత్రం చూస్తూ పత్రిక తిరగేస్తున్నాను.

ఉన్నట్టుండి విదారకరమైన ఏడ్పులు వినపడితే అటు తిరిగి చూశాను. దూరంగా అక్కడక్కడ ఉన్నవాళ్లంతా అటువేపే పరుగెడుతున్నారు. అంతా ఒకటే హడావిడి. బయలుదేరబోతున్న బస్సు హారన్‌ల మోతలో అసలు అక్కడ ఏం జరిగిందో ఎవరికి అర్థం కాలేదు. "నాయనో... ఇంకెట్లా చేసేది నాయనో... పెళ్లికని ఉన్నదల్లా అమ్మేశాము గదర తండ్రీ..." అంటూ ఓ నడి వయస్సురాలు గుండెలు బాదుకుంటూ విలపిస్తూ ఉంటే అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నా ఆ సమూహంలోంచి తిరిగొస్తున్న ఓ వ్యక్తితో అడిగాను ఏం జరిగిందో తెలుసుకుందామని. "పెళ్లికని ఉన్నదల్లా అమ్మేసి పది తులాల బంగారం పదివేల రొక్క తీసుకెడుతున్నారట. అది కాస్త జేబుదొంగ కాజేశాడట పాపం.." అన్నాడు ఆ పెద్ద మనిషి.

"అయ్యో పాపం...." అన్నాను అంతకన్నా చేసేది లేక "ఈ కుళ్లి పోయిన సమాజంలో ఎవరూ సుఖంగా బ్రతకలేరు" అన్నాను బాధగా.

"ఏం కలికలాలం వచ్చింది నాయనా అనుకుంటూ వెళ్లిపోయాడు ఆ పెద్ద మనిషి, పోలీసులకు రిపోర్టు ఇవ్వమని ఎవరో సలహా ఇచ్చినట్టుంది. గుండెలు బాదుకుంటూ వెళ్లిపోయారు ఆ దంపతులు.

కాస్తంత సద్దుమణిగిందో లేదో ఒకర్నొకరు ఎడాపెడా తన్నుకుంటూ ఓ బస్సు నుండి దిగుతున్నారు కొంతమంది. మళ్లీ జనం పరుగులు తీశారు. విషయమేమిటని విచారిస్తే కిక్కిరిసిన బస్సులో తప్పతాగిన నలుగురు యువకులు ఓ స్త్రీతో అనుచితంగా ప్రవర్తించారట. ఆ విషయం తెలిసిన ఆమె భర్త తోటి ప్రయాణీకులు అదేమి అన్యాయం అని అడిగినందుకు ఆ యువకులు అతన్నే చితకబాదుతున్నారు. దెబ్బలు తింటున్న వారి యడ సానుభూతిపరుల సంఖ్య ఎక్కువైపోవటంతో ఆ యువకులు తలా ఒకవైపు పరుగెత్తిపోయారు. దేశ చరిత్రలనే మార్చగల యువతరం బూతు సినిమాలు, అశ్లీల సాహిత్యపు మత్తులో ఇలా కీచకుల్లా ప్రవర్తిస్తే ఆ సమాజాన్ని కాపాడెదవరు? దేశం ఏమైపోవాలి? ఈ దేశ భవితవ్యమేమిటి? పలు ప్రశ్నలతో కృంగిపోయింది నా మస్తిష్కం. విసుగ్గా రిస్టువాచి చూసుకున్నాను. నేను వెళ్లవలసిన బస్సు రావటానికి ఇంకా అర్ధగంట ఉంది. దగ్గర్లో ఉన్న టీ కొట్టులో టీ తాగి మళ్లీ పేపరు తిరగేస్తున్నాను టైంపాస్ చేయడానికి.

ఓ పది నిమిషాలు గడిచిపోయాయి. అక్కడేదో మళ్లీ గొడవ మొదలయింది. ఈ సారి మనుషులు గొడవ జరుగుతున్న వైపుకు వెళ్లకుండా అక్కడినుండి చెల్లా చెదురుగా పరిగెత్తుపోతున్నారు. కొంతమందైతే తమ సామానులను కూడా అక్కడే పడేసి పరుగెత్తి పోతున్నారు. అక్కడున్న అంగళ్లలో హొటళ్లలో ఎక్కడ పడితే అక్కడ దాక్కుంటున్నారు. అంగళ్ల వాళ్లు తలుపులు బిగించుకున్నారు. ఆ బస్టాండు ఆవరణ అంతా నిర్మానుష్యమైపోయింది. కాని గొడవ జరుగుతున్న స్థలంలో మాత్రం ఓ ఇరవై మంది దాకా ఉన్నారు. ఏం జరుగుతుందో అడిగి తెలుసుకోటానికి కూడా ఇతరులెవ్వరూ లేరక్కడ. గొడవ జరుగుతున్న స్థలం నుండి కోబలీ... కోబలీ అంటూ అరుపులు వినబడుతున్నాయి. వాటి మధ్య వ్యక్తి క్రింద పడి ఉన్నాడు. చుట్టూ ఉన్న వాళ్ల మధ్య ఆ వ్యక్తి అస్పష్టంగా కనబడుతున్నాడు. ఈటెలు, బరిసెలు క్రిందికి పైకి

లేస్తూ కనపడితే వాళ్లు ఎవరినో కొడుతున్నారనిపించింది ఓ గండ్ర గొడ్డలి పైకి లేచింది. రెండవసారి పైకి లేచేటప్పటికి నిండా రక్తంతో తడిసి కనిపించింది. పడిపోయి ఉన్న వ్యక్తిని హత్య చేస్తున్నారని తెలిసిపోయింది. కళ్లెదుటే ఒక వ్యక్తిని దారుణంగా నరికేస్తుంటే నా గుండెల్లో పిడుగులు పడ్డాయి. వారిని వారించాలను కున్నాను. ఒంటరిగా ఉన్న నేను "ఏయ్...చాలించండి.... విడిచి పెట్టండి..." అంటూ గావుకేకలు పెట్టాను. అంతటితోనైనా వదిలేస్తారేమో నాకు సహాయంగా ఎవరైనా వస్తారేమోనని అక్కడే టీస్టాల్‌లో దాక్కున్న వారిని పిలిచాను. "రండయ్యా... రండి తలా ఒక కేకపెడితే వదిలేస్తారేమో" అన్నాను గాభరాగా. "వెళ్లవయ్యా వెళ్లు....ఏ ఊరు నీది..? ఇక్కడి పరిస్థితులు నీకేమీ తెలిసినట్టు లేదు వారిని వారిస్తే మనల్ని కూడా వదలరు. ప్రాణాలకు తెగించి వచ్చి ఉంటారు వారు. చనిపోయిన వాడి ప్రాణాలు ఏం రక్షిస్తావు గాని నీ ప్రాణాలు కాపాడుకో. ప్రాణాలపై ఏమాత్రం ఆశ ఉన్నా పరిగెత్తిపో లేకుంటే లోపలికి రా" అన్నారు.

"అదేమిటండీ అలా అంటారు.. కుక్కలు కాట్లాడుకుంటూ ఉంటే చూడ లేకుండా తరిమేస్తాము కదండి మరి..." మాట ముగియకుండానే అందుకున్నాడు మరో అతను. "వెళ్లవయ్యా.... వెళ్లు చెప్పేది నీక్కాదు? నీతులు చెప్పొచ్చావు... మహః విడిపిస్తావో వీరస్వర్గం అలంకరిస్తావో వెళ్లు మేము రాము" గద్దించాడు కోపంగా. "ఛ... ఏం మనుషులో" అంటూ వెనుదిరిగి అటు చూశాను. వాళ్ళ పని ముగిసిపోయినట్టుంది. ముందుగానే సిద్ధంగా ఉంచుకున్న జీప్‌లో అంతా హడావిడిగా ఎక్కారు జీప్ వేగంగా దూసుకుపోయింది. హత్య జరిగిన స్థలం వేపు చూశాను. రక్తపు మడుగులో గిలగిలా తన్నుకుంటూ ఉంది అతని దేహం. కాల్లు చేతులు కర్కశంగా నరికేశారు. ఆ భయంకర దృశ్యాన్ని చూసి వణికి పోయాను. అంతిమ ఘడియల్లో అతి విదారకరమైన అతని మూల్గుల శబ్దం వింటూ ఉంటే మానవుడు దానవుడై చేసిన ఆ మారణహొమాన్ని చూసి అప్రయత్నంగా కన్నీళ్లు కురిశాయి. అలా కాస్సేపు గిలగిలా తన్నుకున్న దేహం నిశ్చలంగా ఉండిపోయింది. ప్రాణం పోయింది అనుకున్నాను. సువిశాలమైన ఆ ఫ్లాట్‌ఫారంపై నేను ఆ శవం తప్ప ఎవ్వరూ లేరు. ఆ ఘోరాన్ని చూడలేక కాబోలు అన్నట్టు లైట్లు ఆరిపోయాయి. ఫ్యాన్లు ఆగిపోయాయి - కరెంటు పోవటం వల్ల.

అంతవరకూ అక్కడక్కడా దాక్కున్న జనం ఒక్కొక్కరుగా బయటికి రావటం

మొదలెట్టారు. పది నిమిషాల్లో సమూహం పెరిగిపోయింది. అంతా ఆ శవాన్ని చూస్తూ నానా విధాలుగా మాట్లాడుకుంటున్నారు. మానసికంగా బాగా అలిసిపోయిన నేను వెళ్లి దగ్గర్లో ఉన్న కుర్చీపై కూలబడ్డాను. వారి మాటల వల్ల తెలిసిందేమిటంటే అది గ్రామ కక్షల మూలంగా జరిగిన హత్యట. ఏమైతేనేం నా బాధల్లా హతుణ్ని గురించి కాదు. ప్రజ్వలిత దానవత్వానికి దాసోహమంటూ దాక్కున్న మనుషులను గురించి మాత్రమే. దానవత్వం ఈటెలతో బరిశలతో పట్టపగలు విశృంఖలంగా కరాళ నృత్యం చేస్తుంటే పరుగెత్తుకెళ్లి టీ కొట్లల్లో దాక్కున్న మానవత్వాన్ని గూర్చి మాత్రమే. మానవత్వం నశించిపోయిన ఈ సమాజం ఎవరికి కావాలి? ఏం చేసుకోవటానికి? అంటూ పరి పరి విధాలా మధనపడింది నా మస్తిష్కం.

పోలీసులు రంగ ప్రవేశం చేస్తూనే ఎక్కడివాళ్లక్కడ వెళ్లిపోయారు బస్‌స్టేషన్ కంట్రోలర్ వచ్చి నా పక్కనే నిలబడి "ఎంతో శుభ్రంగా ఉంచిన ప్లాట్‌ఫారం ఎంతగా మలినమై పోయిందో" అంటూ వాపోసాగాడు. "ఈ మలినం కడిగితే పోతుంది. ఈర్ష్యా ద్వేషాలతో, కక్షలు, కార్పణ్యాలతో అరాచకం అశ్లీలంతో మలినమైపోతునష్ట్ను సమాజాన్ని గూర్చి ఆలోచించండి సార్" అన్నాను పేలవంగా. "నిజమే... ఈ జాతి ఎక్కడ తేలుతుందో ఏమో..." అంటూ అటువైపు వెళ్లిపోయాడు. "ఈ ఆర్టీసీ మీది, మాది, మనందరిదీ. దీన్ని శుభ్రంగా ఉంచటం మన అందరి కర్తవ్యం" అంటూ ఓ గోడపై పెద్దగా ప్రవాయబడిన అక్షరాలపై నా దృష్టి అప్రయత్నంగా పడింది. దాని బదులు "ఈ సమాజం మీది మాది మన అందరిది దీన్ని సంస్కరించుకోవటం మన అందరి కర్తవ్యం" అని వ్రాస్తే ఎంతో బాగుండేది అనిపించింది.



# 10

# ఎర్రమందారం

'నాన్నా.. నాన్నా.. అమ్మీ... రజ్జూ... ఒరే రజ్జూ.. మున్నీ... మున్నీ.. ఎక్కడున్నారే ఒక్కరూ పలుకరేం.. షకీలాకు మూడ్ వస్తే అంతే ఇంట్లో వాళ్ళందరికీ మూడినట్టే. ఎండాకాలమైనా వాయుగుండాలు విరుచుకుపడి సునామీలు రేగుతాయి. పెరట్లో ఉన్నవా ళ్ళంతా పరుగులు పెడుతూ వచ్చారు. ఏమిటి..... మాట పూర్తి కాకుండానే గతుక్కు మంటూ ఆగిపోయాడు షకీలా నాన్న ఉస్మాన్. అమ్మ, చెల్లి మున్నీ, తమ్ముడు రజ్జూ అందరూ స్థాణువులై చెక్కబొమ్మల్లా నిలబడి పోయారు. అందరి ముఖాలపై మెరుపు లాంటి చిరునవ్వు. పల్చని ముదురు ఎరుపు రంగు పై ఖరీదైన బంగారు వన్నె చమ్కీలు జరీ కుచ్చులతో మెట్టినింటికి వీడ్కోలు చెప్పే సమయంలో వధువు వేసుకునే మేలి ముసుగును నిండాకప్పుకొని అంచులను రెండు చేతులతో కాస్తంత పైకి ఎత్తిపట్టి కెమెరా ముందు స్టిల్ ఇస్తున్న దానిలా ఫోజు పెట్టి కెమెరామెన్ రెడీ.. స్మైల్ అన్నప్పుడు లేని చిరునవ్వు తెచ్చుకున్నదానిలా బొమ్మలా నిలబడిన షకీలా... "ఏమిటిలా కరెంటు స్తంభాల్లా నిలబడిపోయారు? ఊఁ.. త్వరగా చెప్పండర్రా ఇప్పుడునేనెలా ఉన్నాను...? అంటూ ఉంటే చెల్లి మున్నీ.. 'అక్కయ్యా.. సూపర్!' అంటూ ఉంటే చిట్టితమ్ముడు కళ్ళు పెద్దవిగా చేసి చిలిపిగా వావ్! అన్నాడు.

'ఇక చాల్లే ఆ పక్కింటి రజియా చాచీది కదూ ఆ ముసుగు?' వెళ్ళి ఇచ్చిరా.... అలా ఇలా చేసి దాన్ని మాపేస్తావు'... అంటూ పెళ్ళీడొచ్చినా ఏమిటే ఈ చిలిపి చేష్టలు.. గొణుక్కుంటూ వంట గదిలోకి వెళ్ళిపోయింది షకీలా తల్లి. షకీలాను పెళ్ళికూతురులా ఊహించుకొని ఉద్వేగంతో కళ్ళు చెమ్మగిల్లిన ఉస్మాన్.. తేరుకోకముందే 'నాన్నా ఈ ముసుగులో ఎర్రమందారంలా నేనెంత అందంగా ఉన్నానో కదూ! షకీలా చిలిపిగా అంటూ ఉంటే "నిజమేనమ్మా... నా బంగారు తల్లివి కదూ!' అన్నాడు ఉస్మాన్ చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుంటూ.

ఉస్మాన్ సాబ్ గారు నిజాయితీపరుడైన ఓ గెజిటెడ్ ఆఫీసర్. దైవభీతి,

నిష్ఠాపరత్వం కలిసి ఆయన్ను అందరిచేత గౌరవింపబడే, ప్రేమిం చబడే ఓ మంచి వ్యక్తిగా చేశాయి. అడ్డ దారుల్లో సంపాదించుకోటానికి బోలెడు మార్గాలున్నా ఉన్నదానితో తృప్తిగా సంతోషంతో సాదాసీదా జీవితం గడుపుతున్నాడు. ఈనాటి 'ఈ'డపిల్లలు చూస్తూ చూస్తూ ఉండగానే 'ఆ'డపిల్లలైపోతారండి ఈ ఆడ పిల్లలు. మంచి సంబంధం చూసి పెళ్ళి జరపాలంటే కట్నాలు కానుకలకని లక్షలకు లక్షలు కావాలి... ఎలా చేస్తారో ఏమో తలుచుకుంటేనే భయమేస్తూ ఉంది.' అంటూ భార్య అన్నప్పుడల్లా 'అన్నింటికీ అల్లాహ్ ఉన్నాడు' అనేవాడు ఉస్మాన్. పెద్ద కూతురు షకీలా అంటే ఉస్మాన్‌కు అమితమైన ప్రేమ. ఒక్క నాడైనా షకీలాను చూడకుండా ఉండలేడు. ఇంట్లో ఆమె చేసే చిలిపిచేష్టల్ని ఆఫీసులో మిత్రులతో చెబుతూ తెగ సంతోషపడి పోవడంతో ఆయనగారి ఆఫీసు దినచర్య ప్రారంభమవుతుంది. షాపింగ్‌కు వెళ్ళాడంటే తెచ్చే వస్తువులన్నీ ఎర్రరంగులో ఉంటాయి. అదేమిటని అడిగితే షకీలాకు ఎర్రరంగంటే చాలా ఇష్టం. అన్నీ ఎర్ర రంగులో ఉండాలంటుందని నవ్వేవాడు.

రోజులు పరుగెడుతున్నాయి. కాలం కదిలి పోతూ ఉంది. షకీలా అందంలో బెస్ట్‌లాగే చదువుల్లో ఫస్ట్. బిఎస్సీ ఫస్ట్ ర్యాంకులో పాసయింది. 'ఆ అమ్మాయి ఏ ఇంటికి వెడు తుందో ఆ ఇంట్లో అందాలు పూయిస్తుంది' అనుకునేవారు ఆ వీధి అమ్మలక్కలు. ఏ రెమ్మకు ఏ పూవు పూస్తుందో ఏ కొమ్మకు ఏ కాయ కాస్తుందో ఎవరికీ తెలియదు. షకీలాకు పెళ్ళి సంబంధాలు వరుసకట్టాయి. పుట్టిన ఇంట అంబరాలను అంటే సంబ రాలు కురిపిస్తుంది ఆడపిల్ల. అమ్మపాలు కడుపు నిండా కమ్మగా తాగుతుంది. పాలబుగ్గలపై నవ్వుల జల్లులు కురిపిస్తుంది. ముద్దుముద్దు మాటలతో అందరిని అలరిస్తుంది, అల్లరి చేస్తుంది. ఇంట్లో అందాలు కురిపిస్తుంది. పుట్టి పెరిగిన ఇంటికి ఒక్కసారిగా సలాం చెబుతూ, 'మీకు కృతజ్ఞతలు చెల్లించుకోవటానికి నావంటూ నా వద్ద ఉన్నవి ఇవేనంటూ ఇంటి నిండా కన్నీళ్ళు కురిపించి వెళ్ళిపోతుంది. ఈ ఇంట తాను త్రాగిన పాలకు కృతజ్ఞతగా మరో ఇంటి బిడ్డలకు పాలుపడుతుంది. సేవలు చేయించుకున్నదాక ఇంట, చేసేది మరో ఇంట. ఈడ ఉన్నన్నాళ్ళు ఈడపిల్ల, పెళ్ళయి పోతే ఆడపిల్ల. ఈడా, ఆడా అంతటా అందరినీ అలరించే ఓ ఆడపిల్లా! చిట్టితల్లి, కన్న తల్లి, చిన్నారిచెల్లి, ఇల్లాలు- ఇలా ఎన్నో అవ తారాలతో మరెన్నో ఆనందాల తోరణాలతో మానవ జీవితాలను అలంకరించే ఓ ఆడ పిల్లా! నీకివే మా జోహార్లు.

షకీలాకు సంబంధం కుదిరింది. 'కట్నాలా? తప్పు తప్పు అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు మా వంశంలోనే లేదు బాబు' అంటూనే ఓ యాభై తులాల బంగారం చాలు... అదీ అమ్మాయి బంగారంలా ఉంది. ఒళ్ళంతా బంగారంతో నింపుదామని' అంది అబ్బాయి తల్లి. అబ్బాయి తండ్రి భార్య ముందు నోరు మెదపడట. అదొక్కటే ప్లస్ పాయింట్ లేకపోతే ఆయన డిమాండ్ ఏమై ఉండేదో! కొసరి కొసరి చివరకు ముప్పై తులాలకు ఖరారయింది. ఇక బండి నుండి పెళ్ళికుమారుని షర్టు గుండీ వరకు అవి ఇవీ ఉండనే ఉన్నాయి. అబ్బాయి మంచివాడట పోతేపోయే నా చిట్టితల్లి కంటే ఎక్కువా?... ఉండాలిగాని బంగారు పల్లకీ చేయించేవాణ్ణి నా చిలిపి చిట్టి షకీలాకు అంటూ తన కూతురు, పెళ్ళికూతురు కాబోతున్నందుకు తెగ సంబరపడిపోయాడు ఉస్మాన్.



ఆనాడు నికాహ్. వెనుకటి రాత్రి మగపెళ్ళి వారు ఫంక్షన్‌హాల్‌లో విడిది చేసి రాత్రంతా భోజనాల దగ్గర నుండి అర్థంలేని అనవసర తతంగాలతో అడుగడుగునా అపశ్రుతులు పలికిస్తున్నారు. ఆవైపు నుంచి వరుని తల్లి, అక్కచెల్లాయిల నుంచి అంతా హైడ్రామాలే సాగుతున్నాయి. అసలు ఈ అనాకారాలన్నింటికీ ఆద్యం రాత్రి వరుడు బస్సు దిగుతూనే బావమరిది పెళ్ళికుమారుడికి పూలదండ వేసి మొహం కడిగించలేదట. ఇదెక్కడి ఆచారమో అంతుపట్టక జుత్తు పీక్కున్నారు పెళ్ళికూతురు వాళ్ళు. రాత్రంతా చీటికిమాటికి అలుగుతూ వాకౌట్లు చేస్తున్నారు వరుని తల్లి, ఆమె కూతుళ్ళు. ఇదోరకపు హంగామా!

ఉదయం నుంచి ఆడపిల్ల వాళ్ళ ముఖాలన్నీ వాడిపోయి కనిపించసాగాయి. పెళ్ళికూతురు షకీలా ముఖం చూస్తే అసలు ఆ చిలిపి షకీలాయేనా ఈ షకీలా అనిపిస్తూ ఉంది. ఇక షకీలా తల్లి, తండ్రి, చెల్లాయి, తమ్ముళ్లైతే కన్నీటి పర్యంతమవుతున్నారు. ఏర్పాట్లలో బాగా అలిసిపోయిన ఉస్మాన్ వరుని తల్లి రాత్రంతా చేసిన రాద్ధాంతానికి మరీ కృంగి పోయాడు. ఈ సంబంధాన్ని ఎంచుకోవడంలో తనేమైనా తప్పు చేశానేమోనని అనిపించినా, 'నాకొద్దు ఈ పెళ్ళి' అనాలని షకీలాకు ఒకింత అనిపించినా పరిస్థితులు పెదవులకు తాళాలు వేశాయి. అయినా పెళ్ళిలో అవన్నీ మామూలే అంటున్న కొందరి మాటలు కాస్త ఊరట కలిగించాయి పెళ్ళికూతురు వాళ్ళకు. నికాహ్ సమయం దగ్గరపడుతూ ఉంది. అక్కడున్న అమ్మలక్కలందరూ

ఒకరికంటే ఒకరు పేరుమోసిన మేకప్ డైరెక్టర్లలా ఉన్నారు. పుట్టినింట అందరినీ మరీ ముఖ్యంగా నాన్నను ఒక్కసారిగా వదిలి ఏమీ తెలియని, ఎప్పుడూ చూసి ఎరుగని చోటికి వెళ్ళిపోవలసిన సమయం దగ్గరపడుతున్న కొద్దీ బెంగతో మరింత నీరసపడిపోయిన షకీలాను తలా ఒకవైపు పట్టుకొని అలంకరిస్తుంటే బొమ్మలా అచేతనంగా కూర్చుండిపోయింది కన్నీళ్ళు కురిపిస్తూ. కూతురును పెళ్ళి సింగారంలో చూడాలనే తపన ఒకవైపైతే చూసి నిగ్రహించుకోలేనేమో అనే స్థితి మరోవైపు, అక్కడక్కడే తిరుగాడుతున్న నాన్నను చూసిన షకీలా నవ్వు ఏడుపు మేళవించిన ముఖంతో లోపలికి రమ్మంటూ చేత్తో సైగ చేస్తూనే లోనికి వెళ్ళాడు ఉస్మాన్. అమ్మలక్కలు కాస్త పక్కకు తప్పుకున్నారు. పెళ్ళి ముస్తాబులో కుందనపు బొమ్మలా తన కన్నీటి తెరల ఆవల నుంచి అస్పష్టంగా కనిపి స్తున్న షకీలా నాన్నతో ఏదో చెవులో చెప్తాను ఇలా రండి అన్నట్టు సైగ చేస్తే కర్చిఫ్‌తో కన్నీళ్ళను ఒత్తుకుంటూ చిన్నపిల్లాడిలా కూర్చుని చెవి ఆనించాడు ఉస్మాన్. షకీలా ఏదో చెబుతూఉంది. 'ఏ అంటీ...?' అన్న కొన్ని క్షణాల్లోనే ఉస్మాన్ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిగా చేసి 'షకీలా నోటికి తన చేతిని అడ్డుపెడుతూ 'ఎంతమాటన్నా వమ్మా!... అలా అనకు బిడ్డా... నా బంగారు తల్లివి కదూ... ఇలాంటి శుభ సమయంలో నీ నోట ఇలాంటి మాటలు రాకూడదమ్మా...' అంటూ చంటి పిల్లాడిలా బిగ్గరగా ఏడుస్తూ ఉంటే అంతకన్నా బిగ్గరగా ఏడుస్తోంది షకీలా తండ్రిని గట్టిగా చుట్టేసుకుంటూ.. కూతురు తండ్రి చెవిలో ఏం చెప్పిందో, తండ్రి ఏం విన్నాడో చంటిపిల్లల్లా తండ్రి కూతురు ఎందు కలా ఏడ్చారో అది వాళ్ళిద్దరికే తెలుసు. వెక్కి వెక్కి ఏడ్చుకుంటూ ఉస్మాన్ ఆ గదినుండి వెళ్ళిపోయాడు.

అనుకున్న సమయానికి నికాహ్ జరిగి పోయింది. అన్నపానీయాలు అన్నీ సవ్యంగానే జరిగిపోయాయి. అందరూ తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు. సంధ్యా సమయం ఆసన్నమయింది. 'కళ్యాణశోభను కళ్ళారా చూశాను, ఇక రాబోయే అంకం 'కన్నీళ్ళ పర్వం' కన్నవారి గుండెకాయను కట్టుకున్నవాడు ఉన్నపాటుగా నిర్దయగా కోసుకొని పారిపోయే దృశ్యం. ముత్యాలు పొదిగిన అపరంజి పంజరంలో ఎంతోకాలంగా పెంచుకున్న అందాల చిలకను ఒక్కసారిగా వీడ్కోలు పలికే హృదయ విదారక దృశ్యాన్ని చూసి సహించగల ధైర్యాన్ని దేవుడు మనుషుల కిచ్చాడేమో గాని నాకు ఇవ్వలేదు బాబూ. అది ఊహించుకుంటేనే కృంగిపోతున్నాను

అంటూ పడమటి దిక్కున దాగి పోయాడు సూరీడు. ఎర్రటి ఓల్వో బస్సు ఎర్ర మందారం షకీలాను తీసుకొని ఎర్రబడ్డ పడమటి దిక్కుకు దూసుకుపోయింది.



వలిమాకని వెళ్ళినప్పుడు వధూవరులను తమ వెంట తీసుకెళతా మంటే అదేం కుదరదు మా బంధువులందరి ఇళ్ళకు వెళ్ళవలసి వుంది. ఆ తరువాత చూద్దాంలేండి అన్న వియ్యంకురాలి సమాధా నానికి ఇబ్బందిపడిన షకీలా తల్లిదండ్రులు, బంధువులు చేసేది లేక వాలిపోయిన ముఖాలతో ఒక్కొక్కరు వచ్చిన బస్సులో ఎక్కి కూర్చుంటున్నారు. ఆ అమ్మలక్కలో మిర్చీ మనస్తత్వంగల ఓ అమ్మాయి ఉస్మాన్‌గారి వియ్యంకురాలితో 'మేమెక్కడా చూడ లేదమ్మా ఈ పద్ధతి... ఆడపిల్లవారి అచ్చటా ముచ్చటా.. మాట పూర్తికాకముందే అందుకొని చాలు చాల్లే చెప్పొచ్చావు... ఇంతలేవు నీవు మాట్లాడేదానివే... అంటూ ఉండగానే ఆమె ఇద్దరు కూతుళ్ళు తల్లికి అండగా నిలిచి జోక్యం చేసుకోబోతూ ఉంటే మాటామాటా పెరిగిపోకుండా ఆ అమ్మా యిని అదుపు చేసిన ఉస్మాన్ "అలాగే కానీలేమ్మా... ఏదో తెలియక అలా అంది ఆ అమ్మాయి' అంటూ సముదాయిస్తూ ఉంటే ఇదంతా దూరం నుండి గమని స్తున్న షకీలా అక్కడికి వచ్చి... నాన్నా! మేం వస్తాంగా... మీరు వెళ్ళిరండి" ముక్తసరిగా అంది. ఆమె మాటల్లో ఎన్నో మూగ భావాలు తొంగిచూస్తున్నట్టని పించింది. చిట్టి తమ్ముడు, చిన్నారి చెల్లాయి కన్నీళ్ళ పర్యంతమవుతూ ఉంటే, తన కళ్ళల్లో కన్నీళ్ళు సుడులు తిరుగుతూ ఉంటే పొరలివస్తున్న దుఃఖానికి వణుకుతున్న పెదాలను మునిపళ్ళతో బలవంతంగా ఆపుతూ.. 'అల్లాహ్ హాఫిజ్...' అంటూ యాంత్రికంగా చేతిని కదిలిస్తూ ఉంటే పదేపదే వెనుతిరిగిచూస్తూ పొరలివస్తున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ వెళ్ళి బస్సులో కూర్చున్నారు ఉస్మాన్ తన భార్యాపిల్లలతో. ఉ స్మాన్‌కు ఇది మరో చేదు అనుభవం. బస్సు కదలటానికి సిద్ధంగా ఉంది. వారు కూర్చున్నవైపు నుండి 'మామయ్యా... అనే పిలుపు విన్న ఉస్మాన్ ఉలిక్కిపడి చూశాడు." అమ్మ మాటలకు ఏమీ అనుకోకండి మామయ్యా... షకీలాను నేను తీసుకొస్తాగా... 'అత్తయ్యా మీరేమీ కంగారు పడకండి.. అని అంటూ ఉన్న అల్లుడు ఇర్ఫాన్ మాటలు విన్న ఉస్మాన్ దంపతులకు కాస్త ఊరట కలిగింది. బస్సు కదలింది. 'ఎర్రమందారం మనతో కూడా వస్తే ఎంత బాగుండేదో... ఆశగా అనుకుం టున్న పిల్లల మాటలు విన్న ఉస్మాన్ కళ్ళలో ఎర్రటి మేలిముసు గుతో ఉన్న షకీలా ఎర్రటి లిప్‌స్టిక్ పెదాల

చిరునవ్వుతో 'నాన్నా నేను ఎర్రమం దారంలా ఉన్నాను కదూ' అంటున్నట్టు కనిపించింది.



కాలమనే కెమెరా భూమిపై జరుగుతున్న సంఘటనలన్నింటినీ తనలో నిక్షిప్తం చేసుకుంటూ కదిలిపోతూ ఉంటుంది. కావలసినప్పుడు మనుషుల మస్తిష్కపు తెరలపై ఆ దృశ్యాలను చూపుతూ సాగిపోతూ ఉంటుంది. అలా సాగుతున్న కోటానుకోట్ల చలనచిత్రాలలో షకీలా చిత్రం కూడా ఒకటి. దాని నిర్మాత, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, మాటలు, ఎడిటింగ్ అన్నీ చిత్రాల్లా ఆ దేవుడే. ఆమెది కేవలం కథానాయిక పాత్ర మాత్రమే. ఎవరి కోసం ఆగని ఆ మూవీ కెమెరా తిరుగుతూ ఉంటే రీళ్ళు కదిలిపోతున్నాయి.

ఆశించినంత సవ్యంగా సాగటంలేదు షకీలా మెట్టినింటి జీవితం. ఆ ఇంట్లో సర్వాధిపత్యం అత్తగారిదైతే ఇంట్లోని వాళ్లంతా నౌకర్లే. ఆ నౌకర్లలో సీనియర్ మోస్ట్ నౌకరు ఆ అత్తగారి భర్త. ఆయనది మసీదు డ్యూటీ, భోజన సమయం తప్ప అస్తమానం మసీదులోనే తిష్ట. మసీదంటే అదేదో గయ్యాళి భార్యా బాధిత భర్తలకు కేర్ హోం అయినట్టు.

కోడలు షకీలాను నాలుగు రోజుల కోసం పుట్టినింటికి పంపాలంటే అదేదో జైలు లోని ఖైదీని పెరోల్‌పై ఇంటికి పంపినట్లు ఎన్నో షరతులతో అనుమతించేది ఆమె అత్త. అదేమిటి అని అడిగితే ఇంట్లో బోలెడు పనులుంటాయి ఎవరు చేస్తారు... ఇక నా ఇద్దరు చిట్టితల్లులా రేపోమాపో పెళ్ళై ఒకరి ఇంటికి వెళ్ళిపోయేవాళ్ళు ఇక్కడ ఉన్నన్నాళ్ళయినా కాస్త సుఖంగా ఉండకపోతే ఎలా? అనేది పొరుగింటి వాళ్ళతో. "అమ్మా.. షకీలా వాళ్ళ అమ్మ నాన్నలు అదే పనిగా ఫోన్లు చేస్తున్నారు. వెళ్ళి రెండు రోజులు ఉండివస్తాం' అంటూ అముల్ బేబీలా అడిగిన ఇర్ఫాన్‌తో 'సరేలే... పైకి అమాయకంగా కనబడుతున్నా అప్పుడే కొంగున ముడేసుకున్నట్టుంది నిన్ను. ఈసారికి సరే.. మళ్ళొకసారి ఆ పిల్ల మాటలు విని ఇలాంటి పిచ్చి పిచ్చివేషాలు వేశావో... అంటూ తల్లి మందలింపులకు 'అబ్బే.. నీ మాట ఎప్పుడైనా జవదాటానా... ఇంకెప్పుడూ అలా చెయ్యనులేమ్మా' అంటూ షకీలా ఉన్న గదిలోకి వెళ్ళాడు.

షకీలా రాకకు క్షణమొక యుగంగా గడుపుతున్న ఉస్మాన్ ఇద్దరు పిల్లల్ని తీసు కొని తన స్నేహితుని కారుతో బస్టాండుకు వెళ్ళి అల్లుడు, కూతురును ఇంటికి తీసు కొచ్చాడు. షకీలా వచ్చిందని తెలుసుకున్న ఆ వీధి వాళ్ళంతా తెగ సంబరపడి పోయారు. షకీలాను చూడటానికని వచ్చిపోయేవాళ్ళతో ఇల్లు కిటకిటలాడింది. షకీలా పెదవులపై చిరునవ్వులు చూసి ఎంత కాలమయిందో. ఆ దినమంతా అలా గడిచిపోయింది. మరునాడు ఉదయం టిఫిన్ ముగించుకొని అలా ఆ ఊళ్ళో తనకు తెలిసినవాళ్ళింటికి వెళ్ళొస్తానంటూ బయటికి వెళ్ళిపోయాడు అల్లుడు ఇర్ఫాన్. షకీలాతో వివరంగా మాట్లాడటానికి సమయం దొరికింది. కాని షకీలా అందుకు ఆస్కారమివ్వకుండా ఉండటానికి ప్రయత్నిస్తూ ఇంట్లో అటు ఇటూ తిరుగుతూ ఉంది. కూతురు వాలకం గ్రహించిన ఉస్మాన్, 'షకీలా.. ఇలా రామ్మా. ఏమిటలా పరధ్యానంగా తిరుగుతున్నావు. అసలు నీవు ఆనాటి మా బంగారుబొమ్మ షకీలావేనా? నాన్న మాట లకు కాస్త కంగారుపడుతున్నట్టు కనిపిం చిన షకీలా.. 'అదేంటి నాన్నా. నేను.. నేను.. చూడమ్మా... నాన్న ఈవేళ నాతో కొత్తగా మాట్లాడుతున్నారు' అంటూ అమ్మ దాపున చిన్నపిల్లలా ఒదిగికూర్చుంటూ 'అరే! అదేంటి నువ్వలా ఏడుస్తున్నా వేమిటమ్మా.. ఏడవకు. నువ్వు అలా ఏడిస్తే నేనూ ఏడుస్తాను.. అంటూ ఎంతో కాలంగా రగులుతున్న అగ్నిపర్వతం ఒక్క సారి బ్రద్ధలైనట్టు చంటిపిల్లలా భోరున ఏడుస్తూ ఉండిపోయింది షకీలా. ఆ ఏడ్పు కాస్సేపట్లో ఆగేట్టు లేదు. ఆ ఏడ్పు తీరు చెప్పకనే చెబుతూ ఉంది. అత్తవారిం ట్లోని షకీలా పరిస్థితిని గురించి ఇంత కాలం విన్నదంతా నిజమేనని. ఇక ఆ ముగ్గురిని ఓదార్చటానికి కూడా అక్కడ ఎవరూ లేకపోవడంతో ఒకర్నొకరు చుట్టేసుకుని గుండెలు తడిసిపోయేలా ఏడ్చారు. 'అమ్మా షకీలా... అత్తగారింట్లో నీవు సంతోషంగా లేవనీ, ఇంటి పనంతా నీవొక్కదానివే చేస్తున్నావని, ఇంటిల్లిపాది గుడ్డలు నీవే ఉతకాలని, నీ అత్త ఆడ బిడ్డలు షికార్లకు, షాపింగ్‌లకు తిరిగి వస్తుంటే వంటావార్పు నీవొక్కతివే చేసు కోవాలని.. ఇన్నిచేసినా తల్లీకూతుళ్ళు ఒకటై నిన్ను వేధిస్తూ ఉంటారని, ఒకసారి నిన్ను తల్లీకూతుళ్ళు కలిసి కొట్టారు.. మాట పెకలలేక ఉస్మాన్ భోరున ఏడుస్తూ ఉంటే నాన్నా... వద్దు నాన్న. మిమ్మల్ని ఇలా చూడటానికేనా నేను ఇక్కడికి వచ్చింది. అదేమీ లేదులే నాన్నా.. అన్నీ సర్దుకు పోతాయి' అంటూ తల్లివైపు తిరిగి నువ్వే మిటమ్మా మరీనూ.. నువ్వు నాలాగే ఒకింటి కోడలివేగా... అయినా ఆడదానికి ఇవన్నీ కొత్తవి కావు కదమ్మా..

వేదాంత ధోరణిలో అంటూ అమ్మా.. హత్యలు, ఆత్మహత్యలతో పోల్చుకుంటే ఇది ఏమీ కాదుగా.. ఏడ్వకమ్మా... అన్నీ సర్దుకుపోతాయి.. తన కన్నీళ్ళు తుడుచు కుంటూనే తల్లి కన్నీళ్ళు తుడుస్తూ అమ్మ నాన్నలను ఓదార్చింది షకీలా. "బిడ్డా షకీలా ఈ విషయంలో మేమొకసారి మీ అత్తా ఆడబిడ్డలతో... మాట పూర్తికాకుం డానే మధ్యలో అందుకొని 'నాన్నా! వద్దు నాన్నా వద్దు.. దయచేసి ఆ పని మాత్రం చేయకండి. అలా చేస్తే నాపై ఒట్టు" అంటూ వణికిపోతున్నట్టు కనిపిస్తున్న షకీలాతో 'లేదమ్మా లేదులే... అడగము, ఎప్పుడూ అడగములేమ్మా... నీ మాటకు ఎప్పుడైనా బదులు చెప్పానా!.. అసలు నీవు చెప్పనిచ్చావా... ఇప్పుడూ అంతే. నీ మాటే వింటాను తల్లీ... నీ మాటే వింటా... నోరు మూసుకునే ఉంటాను' అన్నాడు అదోలా భారంగా.

❖ ❖ ❖

వసంతాలు తరిగిపోతున్నాయి. కాలం కరిగిపోతూ ఉంది. ఆ మరుసటి దినం వియ్యంకురాలి కూతురు నికాహ్. ఏర్పాట్లు భారీగానే ఉన్నాయి. పనులన్నీ చకాచకా జరిగిపోతున్నాయి. షకీలా అత్తగారి పెత్తనం ఆ ఫంక్షన్ హాల్ కంతా హైలైట్. అందరికీ ఆమె ఆజ్ఞలు జారీ చేస్తూ ఉన్న తీరు చూస్తుంటే నియంత హిట్లర్ జ్ఞాపకం వస్తాడు. ఉస్మాన్ అమ్మా నాన్నల కళ్ళు ఎప్పుడూ షకీలా కోసం వెతుకుతున్నా ఆమె కనపడితేగా? చాలా సేపయ్యాక సినిమాలో ఓ గెస్ట్ ఆర్టిస్ట్‌లా కనబడినా ఆ ఫంక్షన్ హాల్‌లోని పనిమనిషిలా ఉంది. గుండె తరుక్కుపోతున్న ఉస్మాన్ 'షకీలా... ఏమిటమ్మా ఇది. వెళ్ళి బట్టలు మార్చుకోరాదూ.. అని అంటూనే.. ఇదిగో ఇప్పుడే వస్తాను... ఆc.. నాన్న మీరు తిన్నారా? అంటూ అత్తగారి కేక విని పరుగెత్తుకెళ్ళింది.

నికాహ్ అయిపోయింది. భోజనానంతరం అంతా పిచ్చాపాటిగా మాట్లాడుకుంటున్నారు. ఉస్మాన్ తన భార్యాపిల్లలతో ఫంక్షన్‌హాల్‌లోని ఓ మూలన కూర్చు న్నారు. 'ఖతీజా.. ఉదయం నుంచి చూస్తు న్నాను, ఏమిటలా దిగాలుగా ఉన్నావు' అన్నాడు ఉస్మాన్ భార్యతో. "ఏం చెప్పమంటారండీ.. ఈ విషయం తెలుసా? మన అమ్మాయి నగలన్నీ తాకట్టు పెట్టారట ఈ పెళ్ళికోసం. చెమ్మగిల్లిన కళ్ళను చెరుగుతో ఒత్తుకుంటూ అంది. ఆ మాటలు ఉస్మాన్‌పై ఏమాత్రం ప్రభావం చూపలేకపోయాయి. దీర్ఘంగా నిట్టూర్చుతూ 'ఖతీజా... నా బంగారు తల్లి షకీలా బ్రతుకే మసకబారుతున్నప్పుడు ఆమె బంగారు నగలపై నాకెలాంటి ఆసక్తి లేదు..

భారంగా అన్నాడు ఉస్మాన్ వేదాంత ధోరణిలో. "ఖతీజా ఇక నీవు కూడా ఇలాంటి విషయాల్లో ఆలోచించడం మానెయ్.. షకీలాతో ఈ విషయం మాట వరసకైనా ప్రస్తావించకు. జరగకూడనిదే జరిగి పోయింది. ఎలా జరగాలో అలా జరుగుతుంది. జరుగకూడని మరేదీ జరుగరాదని అల్లాహ్‌తో వేడుకుంటూ ఉండు. అంతకన్నా మనం చేసేది ఏదీలేదు." అంటూ బయటికి వెళ్ళిపోయాడు ఉస్మాన్.



ఆనాడు ఒకటో తేదీ. సాయంత్రం కాస్త ముందుగానే ఇల్లు చేరుకున్న ఉస్మాన్ కాళ్ళు, మొహం కడుక్కొని భార్య అందించిన వేడి కాఫీ తాగుతూ తన ప్యాంటు జేబులోనుంచి జీతం డబ్బులు తీసి పరధ్యానంగానే భార్య చేతిలో పెట్టి మంచంపై మేనువాల్చి ఆ పక్కన కిటికీలో బయటి దృశ్యాన్ని చూస్తూ దీర్ఘాలోచనల్లో పడ్డాడు. సముద్రాల్లోని నీళ్ళు ఉప్పగా ఉండటానికి కారణం వీధి బడి నుండి యూనివర్శిటీల వరకూ విభిన్న రకాలుగా చెబుతూ ఉంటారు. అదంతా తప్పుడు అభిప్రాయం. ఉన్నదల్లా ఒకేఒక్క కారణం. అది నూటికి నూరు పాళ్ళు నిజం. కాలగర్భంలో కలిసిపోయిన కోటాను కోట్ల దుఃఖిత మానవ చక్షువులు నిరంతరంగా కురిపించిన అశ్రు జలాలే ఆ సాగర జలాలు. అవి దుఃఖసాగర జలాలు.. అందుకే అవి ఉప్పగా ఉంటాయి. ఈ ఆలోచనకు వేదాంత ధోరణిలో తనలో తానే పేలవంగా నవ్వుకున్నాడు.

'ఏమండీ!... అంటూ పెట్టిన గావుకేకకు ఉలిక్కిపడిన ఉస్మాన్ హాల్లోకి వెళ్ళి నేలపై కుప్పకూలిపోయి రోధిస్తున్న భార్యను చూస్తూ వణికిపోతూ ఏం ఖతీజా.. ఖతీజా... చెప్పవే. చెప్పు ఏం జరిగిందో చెప్పు...' అంటూనే ఆ పక్కనే పడి ఇంకా కట్‌కాకుండా అవతలి కంఠం మోగుతూనే ఉన్న మొబైల్‌ను తీసుకొని, షకీలాను హాస్పిటల్‌లో అడ్మిట్ చేశాం. పరిస్థితి విషమంగా ఉందంటున్నారు డాక్టర్లు. మీరు వెంటనే రండి' అన్న ఆవలి అపరి చిత కంఠం చెప్పింది విన్న ఉస్మాన్ "అల్లాహ్...!" అంటూ పెద్దగా కేక పెడుతూ ఉంటే విషయం తెలుసుకున్న పొరుగువాళ్ళు కూడా కంగారు పడిపోయి వారికి ధైర్యం చెబుతూ ఓదార్చుతూ నలుగురైదుగురు వారితోపాటు ప్రయాణమై ఉన్నపాటుగా టాక్సీలో బయలుదేరి వెళ్ళారు.

అది బ్రహ్మాండమైన ఈ సృష్టిని చేసిన ఆ దేవుడికే చెల్లు. కళ్ళకు కనబడనంత

మురికి నీటి కణాన్ని ఆజానుబావుడైన మనిషిగా మలిచాడు. ఆ దేహంలో టక్కు టక్కుమంటూ కొట్టుకునే  గుండె పిడికెడంత ఆ గుండెకు పర్వతమంత బలం. గుండెలు వేయి ముక్కలయ్యే పిడుగులాంటి విషయమది. టాక్సీ రాకెట్‌లా దూసుకుపోతూ ఉంటే దాని కన్నా వేయిరెట్ల  వేగంతో దూసుకు పోతున్నాయి షకీలా అమ్మానాన్నల ఆలో చనలు, అనుమానాలు. దూరం నుంచి ఆ ఇల్లు కనబడుతూ ఉంటే కొత్త పెళ్ళికూతురుగా షకీలా ఆ ఇంట్లో అడుగుపెడుతున్నప్పటి దృశ్యం గుర్తొస్తూంది ఉస్మాన్‌కు.

ట్యాక్సీ ఇంటి ముందు ఆగింది. ఒక్కొక్క రుగా దిగుతూ ఉంటే ఇంటినిండా ఉన్న జనం తొలుగుతూ దారి ఇస్తున్నారు. 'అదిగో.. షకీలా వాళ్ళ అమ్మనాన్న... వచ్చారు అనుకుంటూ  గుంపుగా ఉన్న ఆడవాళ్ళు ఒక్కొక్కరుగా  తొలుగుతూ ఉంటే  మంచంపై షకీలా శవం కన బడింది. "ఏమైంది.. ఏమైంది నా చిట్టి తల్లికి అంటూ దూసుకుకొస్తున్న షకీలా తల్లిని ఆడవాళ్ళు గట్టిగా చుట్టేసుకుంటూ 'ఇంకెక్కడి షకీలా... వెళ్ళిపోయిందమ్మా... నీ కూతురు  అల్లాహ్ వద్దకు వెళ్ళి పోయింది....' అంటుంటే "షకీలా..." అంటూ గట్టిగా కేకపెట్టి స్పృహ తప్పిపడిపోయింది. కూతురు షకీలా శవం ఉన్న మంచంపై తల ఆనించి పెద్దగా రోధిస్తున్న ఉస్మాన్‌ను స్నేహితులు సముదాయించటానికి ప్రయత్నిస్తున్నారు.

"అక్కా..లే అక్కా... అమ్మానాన్న, అందరం మీ ఊరొచ్చాం లే అక్కా...." లేచి కళ్ళు తెరిచి ఒకసారి చూడక్కా..' అంటూ షకీలా తమ్ముడు, చెల్లెలు శవం చేతులు పట్టుకొని గట్టిగా ఏడుస్తుంటే చూసేవారి గుండెలు తరుక్కుపోయాయి. ఏడ్చిఏడ్చి అంతా నీరసించిపోయారు.

కాలగర్భంలో  కలిసిపోయిన  వారి ఆప్త లంతా ఇలా కన్నీళ్ళు కురిపించినవారే. ఎవరు ఎన్ని కన్నీళ్ళు కురిపించినా వెళ్ళి పోయినవారు తిరిగివచ్చిన దాఖలాలు ఒక్కటి కూడా కనిపించకపోయినా పోయే వాళ్ళు పోతూ ఉంటే ఏడ్చేవాళ్ళు ఏడుస్తూనే ఉంటారు. ఈ చని..పోయే రాక పోకలు నిరంతరంగా సాగిపోతూనే ఉంటాయి ప్రళయకాలం వరకు. అది సృష్టి ధర్మం. శవస్నానం అయిపోయింది చివరి చూపులకని పిలిచారు. ఉన్న వాళ్ళు వెళుతున్నవారికి  నివాళులర్పించే కడ దినమది. ఉస్మాన్ కళ్ళు కురుస్తుంటే తన చిలిపి  కూతురు షకీలా శవంకేసి తదేకంగా  చూస్తుంటే ఆమె  చిలిపి మాటలన్నీ గుర్తొస్తున్నాయి. "నాన్నా... చూశావా! నా శవవస్త్రాలు

కూడా నాకిష్టమైన ఎరుపు రంగువే. ఈ వస్త్రాలతో నేనెంత అందంగా ఉన్నానో కదూ... ఎర్రమందారంలా" అంటున్నట్టనిపించి రోదించాడు ఉస్మాన్ మౌనంగానే. ఆనాడు పెళ్ళికూతురుగా సింగారిస్తూ ఉంటే తనను పిలిచి చెవిలో 'చూడు నాన్న... వీళ్ళు నన్ను ఎలా సింగారిస్తున్నారో... చనిపోయిన మన పక్కింటి ఆంటీ జనాజాను సింగారించినట్లు' అన్న మాటలు గుర్తొచ్చి, "చెప్పినట్టే చేశావు గదమ్మా..." అంటూ పెల్లుబికివస్తున్న ఏడ్పును బలవంతంగా ఆపుకుంటూ అలా పక్కకు వెళ్ళిపోయాడు ఉస్మాన్.

అక్కడున్న వీధి ఆడవాళ్ళు షకీలా మరణాన్ని గురించి పలు విధాలా చెప్పుకుంటున్నారు. షకీలాకు నెల తప్పి ఉంటే ఆ విషయం వాళ్ళ అమ్మనాన్నలకు చెప్పొద్దన్నారట. వద్దని ఎంతగానో బ్రతిమాలు కున్నా తల్లీకూతుళ్ళు కలిసి ఆమె గర్భ విచ్ఛితి కోసం ఎవరో నాటు వైద్యుడు ఇచ్చిన కషాయాన్ని ఆమెకు తెలియకుండా పాలలో కలిపి తాపారట. పాపం బిడ్డ రాత్రంతా ఒకటే కేకలు పెడుతూ ఉండి కొనఊపిరితో ఉన్నప్పుడు ఉదయం ఆస్పత్రికి తీసుకెళ్ళారట. అప్పటికే ఆమె చనిపోయిందని చెప్పారట డాక్టర్లు" అనే మాటలు ఉస్మాన్ గుండెల్లో గునపాల్లాగా గుచ్చుకున్నాయి. నలుగురు కలిసి షకీలా జనాజా ఉన్న డోలాను భుజాలపైకెత్తుకున్నారు. సాగిపోతూ ఉంది 'ఆడ'పిల్ల పల్లకిలో తనలాగానే తనకంటే ముందు వెళ్ళిపోయిన మరెందరో అక్కా చెల్లాయిలతో కలిసి ఆడుకోటానికి. దూరంగా... ఈ పాపిస్టులకు దూరంగా... బహు దూరంగా... చివరకు ఎర్రమందారం నల్ల మట్టిలో కలిసిపోయింది.



# 11

# మాతృమూర్తి

చెప్పుడు మాటలు విని అమ్మను అలా వేధించినా అమ్మ అనురాగ వీణాతంత్రుల ప్రకంపనలు అక్బర్ గుండెలను అప్రయత్నంగా స్పృసిస్తూనే ఉన్నాయి.

అదిగో...అమ్మే... ఆమె అమ్మే! ఆమె స్వాగతంలో శిశిర తుషార అవనికలొక్కొక్కటి తలలు వంచి గౌరవసూచకంగా ప్రక్కలకు తొలిగిపోగా వేయి పున్నముల కాంతులీను మమతానురాగాల ఆమె ముఖారవిందం ఇంచుక అస్పష్టంగా ఉన్నా అక్బర్‌కు తెలిసిపోయింది ఆమె అమ్మే అని.

కళ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి ఆమె వీక్షణలో కనుపాపలు పవిత్ర స్నానం చేస్తున్నాయన్నట్టుగా. అధరాలు కంపించసాగాయి ఆమె రాకతో పరవశించి పరుగులిడుతున్న హిమసమీరాల ప్రభావమన్నట్టు. ఉన్నపాటుగా స్థాణువైపోయాడు అక్బర్, కళ్లు విశాలమైపోయాయి. గొంతు మూగవోయింది. అమ్మ సుందర శశివర్ణ విగ్రహంనిండా ఏమిటా మచ్చలు! అమ్మ అలా కూర్చొని అక్బర్ తల నిమురుతూ ఉంది ఆప్యాయంగా. ఆమెను వేధించిన గతం గుర్తొచ్చి అక్బర్ గళం సిగ్గుతో పెకలలేకపోయినా మానసం మాత్రం తన మూగభాషలోనే అడిగింది అమ్మా! నీ చెంపలనిండా కందిపోయిన ఆ గుర్తులేమిటి? "ఉరిమి ఉరిమి నా చెంపలపై సేదతీరిన మీ నాన్న ఆగ్రహం బాబూ అది" అంది అమ్మ చిరునవ్వుతో. "నీ నుదుటి పైని లోతైన ఆ కాటు ఏమిటి? అది మా అత్తమ్మ నాపై కోపంగా విసిరిన కొడవలి వేటు" "నెత్తినిండా ఆ కణతులు..? "నా ఆడబిడ్డలు వేసిన మొట్టికాయలు."

చేతుల నిండా ఆ వాతలేమిటి? పుట్టినింటి నుండి మరిన్ని కట్నకానుకలు తెమ్మంటూ మా అత్తమామలు వేసిన సలాకి వాతలు.

"అమ్మా... నీ గొంతుపైని ఆ గాట్లేమిటి?

"పాలు తాగుతున్న ఆనందంలో ఆడుకుంటూ నీవు రక్కిన గాట్లు రా బాబూ అవి"

"అమ్మా... నీ కంటికేమిటి ఆ గాయం ఇంకా రక్తం కారుతూనే ఉందే... వాపుతో కన్ను పూర్తిగా మూసుకుపోయిందే..

"హుం... అవన్నీ ఇపుడెందుకులే నాన్నా..." అంటూ ఉండగా మధ్యలో అందుకొని"చెప్పి తీరాలి... అన్నాడు అక్బర్.

"సరేలే.. నీ మంకు పట్టు పోయిందికాదు... అంతా నాన్న పోలిక... మొన్న నీ భార్యను ఏమో అన్నానని కోపంతో నీవు బలంగా విసిరిన కర్రతో తగిలిన ఓ చిన్న దెబ్బలే అది... ఐనా... మాట పూర్తి కాకుండానే అక్బర్ "అమ్మా!... చాలమ్మా చాలు ఇక నీవేమీ చెప్పకు. చావు బతుకుల మధ్య గావుకేకలు పెడుతూ ఈ లోకంలోకి నీవు తెచ్చిన జాతి నిన్ను ఒక్కొక్కరుగా పంచుకొని ఇలా కసితీరా హింసిస్తున్నారు. నీవు నవమాసాలు నీ కడుపున దాచుకొని ఉండకపోయి ఉంటే ఈ జాతి ఏనాడో నామ రూపాలు లేకుండా పోయి ఉండేది. నీ ప్రాణాలను పణంగా పెట్టి వీరిని ఈ లోకంలోకి తేకపోయి ఉంటే ఈ జాతి నీ కడుపులోనే సజీవ సమాధి అయి ఉండేది. నీ రక్తాన్ని పాలుగా చిలికి తాపి ఉండకపోతే ఈ జాతి ఏనాడో కడతేరి ఉండేది... అమ్మా! జోలెపాడిన అమ్మను, లోకం చూపిన నాన్నను, అనురాగం కురిపించిన అన్నలను, ముద్దుల తమ్ముళ్లను మురిపాల చెల్లెళ్లను ఒక్కసారిగా వదిలి, నడకలు నేర్పిన పుట్టినింటికి పరుగులు నేర్పిన పొరుగుకు ఒడిలో లాలించిన బడికి, ముద్దులు కురిపించిన వీధికి ఆఖరు సలాం చెప్పి పయనమై వచ్చి నీ మెట్టినింటికి హారతి కర్పూరమైపోయావు. మెట్టినింట వెలుగులు కురిపించటానికై కాలి కరిగిపోయిన పుట్టినింటి క్రొవ్వొత్తివి నీవు.. దుర్మార్గులు... దుష్టులు దుర్జనులు.. అమ్మా! నిన్ను వేధించిన వారు సర్వనాశనమైపోతారు అంటూ పెద్దగా కేకలు పెడుతూ ఒక్క క్షణం ఆగిపోయిన అక్బర్ భృకుటి ముడిపడింది... అవునూ... నాకేమైంది?...

ఆ మాతృమూర్తిని ఎందుకలా చీదరించుకున్నాను? ఎందుకలా హింసించాను?? అంటూ ఉద్వేగంతో "నవమాసాలు నన్ను కడుపున మోసి, తన ఒడిని పాన్పుగా చేసి, ఎదలకు హత్తుకొని పాలిచ్చిన అమ్మను హింసించిన ఈ చేతులు నాకు వద్దు... నరకండి... వీటిని ముక్కలు ముక్కలుగా నరికివేయండి" అంటూ తన చేతులను మంచానికేసి గట్టిగా కొడుతూ పెడుతున్న కేకలకు ఇంటిల్లిపాది ఉలిక్కిపడిలేచింది. "ఏమండీ.. ఏమండీ... ఏమిటా పలవరింతలు... ఎవరిని

నరకాలి?.... ఎందుకు నరకాలి? లేవండి అంటూ కూర్చొబెట్టి నీవు చరుస్తూ పెద్దబ్బాయి గ్లాసు అందిస్తే నీళ్లు తాపింది అక్బర్ భార్య. "నేను వెళ్లాలి... అమ్మను చూడాలి... అంటూ కప్పుకున్న బెడ్‌షీట్‌ను తొలిగించుకుంటూ లేవబోతున్న అక్బర్ భుజం పట్టుకొని ఇంత రాత్రి ఎక్కడికెడతారండి... ఏదో పీడకల... పడుకోండి ఐనా చచ్చినోళ్లు తిరిగొస్తారా... మీ పిచ్చిగాని అంటూ అలా వెళ్లిపోయింది అక్బర్ భార్య.

రాత్రి కల ప్రభావం నుండి ఇంకా బయట పడలేని అక్బర్ ఉదయాన్నే టీ ముగించుకొని పారాయణం కోసం ఖుర్‌ఆన్ తెరుస్తూనే "తల్లిదండ్రుల పట్ల మంచితనంతో వ్యవహరించండి. ఒకవేళ మీ వద్ద వారిలో ఒకరుగాని ఇద్దరుగాని ముసలివారై ఉంటే వారిముందు విసుగ్గా 'ఛీ' అని కూడా అనకండి. వారితో మర్యాదగా మాట్లాడండి...." అనే వచనం కంటపడుతూనే... "అమ్మా' అంటూ తలపట్టుకొని బ్రతికిన కాలంలో తల్లిదండ్రులను సేవించని సంతానం బ్రతికినంత కాలం ఇలా చస్తూనే ఉంటుంది" అంటూ వాపోయాడు అక్బర్.



# 12

## పైశాచికం

అనగనగా ఓ అమ్మ ఆ కమ్మని మాట ఉచ్ఛరిస్తూనే అధరాలు రెండు ఆలింగనం చేసుకుంటాయి.

భర్త తాగుబోతు. భర్తను ఆమె ఎంతగా ప్రేమిస్తుందో అంతకు రెట్టింపుగా అతడు మధుపాత్రను ప్రేమిస్తాడు అతని దౌష్ట్యానికి ఆమె అనుభవించని నరక యాతనంటూ లేదు. తను దారికొస్తాడని. కనుమరుగైన కాంతి రేఖలు మళ్లీ తన జీవితానికి వెలుగునిస్తాయని ఆమె కన్న కలలు కల్లలై పోయాయి. నవమాసాలు మోసి, కని, పెంచిన తన బిడ్డ పోషణ కోసం కాళ్లావేళ్లా పడి ఓ ప్రభుత్వ ఆసుపత్రిలో పాకీ పని సంపాదించుకుంది. అస్తమానం కష్టపడి చెమటోడ్చి పనిచేసి తన చిన్నారి బిడ్డను చూడాలనే ఉబలాటంలో శ్రమను మరిచి ఇల్లు చేరుకునేసరికి ఆమె కోసం భర్త ఎదురు తెన్నులు చూస్తూ కూర్చునేవాడు తాగటానికి డబ్బుకోసం.

ఆమె కాలచక్రం ఎన్నో అపశ్రుతులు పలుకుతూ తిరిగింది. కొడుకు పెద్దవాడౌతూ పితృదేవోభవా అంటూ తండ్రి అడుగుజాడల్లో నడిచాడు. సారాకొట్టుకు తండ్రి కొడుకులిద్దరూ వెళ్లి తిరిగొచ్చి ఆ అమ్మను ఏకంగా హింసించేవారు. భర్త భరింపరానివాడుగా తయారైతే, కళ్లకు చలువగా నిలుస్తాడనుకున్న కొడుకు కళ్లల్లో కారంగా మారిపోయాడు. కష్టపడి సంపాయించిన గాసం కాస్త తండ్రి కొడుకుల తాగుడు కోసం పోయేది. వారిద్దరి వేధింపులకు కొవ్వొత్తిలా కరిగిపోసాగింది ఆ తల్లి.

ఆనాడు ఏదో తన జీతపు బకాయిల మొత్తం చేతికందింది. ఇంటి అవసరాలు తీర్చుకోటానికంటూ అట్టిపెట్టింది ఆ పైకాన్ని. కాస్త ఉడకేసి, తప్ప తాగి ఇంటికి రానున్న తండ్రి కొడుకుల కోసం ఎదరుచూస్తూ కునికిపాట్లు పడుతూ గడపవద్ద కూర్చుంది. రాత్రి పొద్దుపోయిం తరువాత తప్ప తాగినమైకంలో తప్పటడుగులు వేసుకుంటూ రానే వచ్చారు తండ్రి కొడుకులు. తనివి తీరలేదేమో ఇంకా తాగటానికి ఆ బకాయిల మొత్తాన్ని ఇవ్వమని అడిగారు. ఆమె ఇవ్వనంది. బలవంతం చేశారు

ఫలితం లేకపోయింది. భర్త చేయిచేసుకున్నాడు. తన్నులైనా తింటాను కాని మీకు తాగటానికి పైకం మాత్రం ఇవ్వనంది. పైకంలో వారి దౌష్ట్యం తారస్థాయినందుకుంది. "తలుపులు వెయ్యరా. ఇయ్యాల దీని అంతు చూస్తాను" అంటూ గర్జించాడు తండ్రి. వెంటనే పితృవాక్య పరిపాలన జరిగిపోయింది డబ్బుకోసం వెతికారు. ఎక్కడా కనిపించలేదు. "బొడ్లో దాచుకొని ఉంటుంది" అన్నాడు కొడుకు వెంటనే చీరె లాగబోయాడు. పెనుగులాటలో కిందపడిపోయాడు తప్పతాగిన తండ్రి. ఇక కొడుకు అందుకున్నాడు. కన్న కొడుకు అమ్మ చీరెను బలంగా లాగేశాడు ఆ తల్లి ఏక వస్త్ర అయి నిలబడిపోయింది. కెవ్వున కేకవేసి రెండు చేతులను తన ముఖానికి అడ్డం పెట్టుకుని దారుణంగా విలపిస్తూ ఉండిపోయింది.

ఆ క్షణం ఆమె పెట్టిన గావుకేక ఆమెది కాదు సృష్టిలోని సకల జీవరాసుల మాతృత్వం అంతా కలిసి ఒక్కసారి పెట్టిన చావుకేక. ఆ ఘోరం చూడలేక భూగోళం దద్దరిల్లి బ్రద్దలైన శబ్దం అది. ఆ అఘాయిత్యాన్ని గని సప్తాకాశాలు చేసిన గర్జన అది. సకల సముద్రాలు ఏకమై పెట్టిన ఘోష అది.. పాలిచ్చి పెంచిన కన్న తల్లిని నగ్నంగా నిలబెట్టాడు కన్న కొడుకు. అంతటితో ఆగలేదు ఆ దుర్మార్గుని రాక్షసత్వం. కావరం కళ్లకెక్కింది. "డబ్బు ఎక్కడ పెట్టావో చెప్పు" అంటూ ఏ కడుపులో నుండి తను ఈ లోకంలో ప్రవేశించాడో ఆ పొత్తి కడుపుపై బలం కొద్దీ తన్నాడు. కెవ్వున కేకపెట్టి కుప్పకూలిపోయింది ఆ తల్లి.

ఆ అమ్మకు ఈ లోకంలో ఇక ఏం మిగిలి ఉందని? అందుకే వెళ్లిపోయింది. ఆమె ఊపిరి అనంత వాయువుల్లో కలిసిపోయింది.

ప్రభూ! నీవు ఈ సృష్టిని ఇంకా కొనసాగనిస్తున్నావా? ఈ జీవులకు ఇంకా గడువునిస్తున్నావా? ఈ ప్రాణులకు ఇంకా నీరు, గాలి, ఆహారం సమకూరుస్తున్నావా? నీవు ఉత్తమ వర్గంగా ప్రకటించిన నీ విశ్వాసులు ఎక్కడ దాక్కున్నారు ప్రభూ? వారు నీ అజ్ఞానుసారం మంచిని ఆదేశిస్తూ చెడుని నిర్మూలించటానికి ఇకనైనా ప్రయత్నం చేస్తారేమోనని వేచి చూడటానికి ఈ సృష్టిని ఇంకా నడుపుతున్నావా? ప్రభూ, నీవు అనంత కరుణామయుడవు అపార కృపాశీలుడవు.

ఇది కేవలం ఓ కథనమో, కల్పితమో కాదు. ఈ క్షణంలో మనసుకు కలిగిన ఈ వ్యాకులత కొద్దిసేపటికైనా తొలగిపోతుందనకుంటున్న వికల మనస్కులైనవారు ఇది మొన్న మొన్ననే జరిగిన మింగుడుపడని చేదు వాస్తవ గాథకు అక్షరరూపం అని తెలిసి గుండెలు పగిలిన మానవత సిగ్గుతో తలదించుకుంటుంది.

# 13

## న్యాయం

పదిహేనేళ్ళ క్రితం దేశంలో సంచలనం రేపిన రాయపూర్ బాంబు కేసులో అరెస్టయిన హసన్ అలి, జావెద్‌పై మోపిన కేసు ఇంతకాలంగా ఎన్నో మలుపులు తిరిగి ఆనాడు తీర్పు వెలువడుతుండ డంతో కోర్టు ఆవరణలో భారీ పోలీస్ బందోబస్తు ఏర్పాటయింది. అలవాటు ప్రకారం పోలీసు యంత్రాంగం అతిగా ప్రవర్తిస్తూ ఉంది. కోర్టు చుట్టుపక్కల కర్ఫ్యూ వాతావరణం అలముకుంది. కార్ల హారన్‌మోతలు, పోలీసుల విజిల్ కూతలు తప్ప అంతా నిశ్శబ్దం తాండవిస్తూ గంభీరంగా ఉంది వాతావరణం. గాలి అంతగా వీచకపోవటంతో కోర్టు ఆవరణలోని చెట్లు, చెట్లపై నిండుగా వాలిన పక్షులు కూడా ఆ కేసు తీర్పు వినటానికని నిశ్శబ్దంగా ఉన్నాయా అన్నట్టుంది అక్కడి దృశ్యం.

ముద్దాయి బోనులో జావెద్ ఒక్కడే నిలబడి ఉన్నాడు. నలభై అయిదు, యాభై ఏళ్ళ మధ్య వయస్సు, ఆరడుగులకు అటు ఇటు ఎత్తయిన విగ్రహం, తెల్లటి ముఖంపై నల్లటి గుబురు గడ్డం, పైజామా కుర్తాపై కళ్ళల్లో కసి బుసలు కొడుతు న్నట్టు జావెద్ ఒక్కడే ముద్దాయి బోనులో నిలబడి కోర్టులోని జనం వైపు మరీ ముఖ్యంగా తన భార్యాబిడ్డల వైపు పదేపదే చూస్తున్నాడు. బురఖాలో ఉన్న భార్య కన్నీళ్ళను చెరుగుతో ఒత్తుకుంటూ బోనులోని భర్త వైపు తదేకంగా చూస్తూ ఉంది. ఇద్దరు కూతుళ్ళు, పదిహేనేళ్ళ కుమారుడు ముద్దాయి బోనులో నించున్న నాన్నను కంట తడితో ఆశగా చూస్తున్నారు. కూతుళ్ళైతే బురఖాలోనే దోసిలిపట్టి దుఆ చేస్తూ ఏదో స్మరించుకుంటున్నారు. ప్రశాంతత మూర్తీభవించిన న్యాయమూర్తి హుందాగా తన పీఠంపై ఆశీనులయ్యారు. గౌరవసూచకంగా నమస్కరిస్తూ నిలుచున్న న్యాయవాదులు, జనం తమ స్థానాల్లో కూర్చున్నారు. అంతా నిశ్శబ్దం కళ్ళజోళ్ళు సర్దుకుంటూ తీర్పు చదవడం మొదలెట్టారు న్యాయమూర్తి. 'నీ పేరు' అడిగారు న్యాయమూర్తి బోనులోని జావెద్‌వైపు చూస్తూ. 'జావెద్..' సమా ధానం. న్యాయమూర్తి తీర్పును చదవటం ప్రారంభించారు... "1998, నవంబర్ 6వతేదీన సాయంత్రం

4 గంటలకు రద్దీగా ఉన్న రాయపూర్ రైల్వేస్టేషన్ రెండవ నంబర్ ఫ్లాట్‌ఫారంలో జరిగిన బాంబు పేలుడులో స్త్రీలు పిల్లలతో సహా 28మంది ప్రాణాలు కోల్పోగా 45మంది తీవ్రంగా గాయపడ్డారు. కేసులో రాయ పూర్ పోలీసులు హసన్ అలీ, జావెద్‌లను ముద్దాయిలుగా కోర్టులో హాజరుపరిచారు. కేసు విచారణలో ఉండగా మొదటి ముద్దాయి హసన్ అలీ గుండెపోటుతో 2003 మార్చి 13వ తేదీన జైల్లో మరణించాడు. ఇంతకాలంగా సాగిన కోర్టు విచారణలో ముద్దాయిలు హసన్ అలీ, జావెద్‌లపై ప్రాసిక్యూషన్ వారు నేరారోపణలను తగిన సాక్ష్యాధారాలతో నిరూపించలేకపోయిన కారణంగా ఈనాడు అనగా 2012 ఆగస్టు 10వ తేదీన ఈ కేసులో రెండవ ముద్దాయి అయిన జావెద్‌ను నిర్దో షిగా ప్రకటిస్తూ విడుదల చేయడమైనది.' అంటూ తీర్పు వెలువడుతూనే జావెద్ స్నేహితులు, మొదటినుంచే ఈ తీర్పును ఊహిస్తున్న లాయర్లు సంతోషంతో ఊపిరి పీల్చుకున్నారు. అంతవరకూ కురుస్తున్న భార్యాపిల్లల కన్నీళ్ళు కాస్తా ఆనందభాష్పా లుగా మారిపోయాయి. విచార వదనాల్లో ఆనందం నిండిపోయింది. నిలుచున్న చోటనే దైవానికి కృతజ్ఞతగా మోకరిల్లారు. ముబారక్...ముబారక్ పదాలతో వినిపిస్తూ నిశ్శబ్దానికి కాస్తా అంతరాయం కలిగిస్తూఉంటే న్యాయమూర్తి ఆర్డర్... ఆర్డర్ అంటూనే సద్దుమణిగింది.

మెల్లిగా అల్లాహు అక్బర్ అనటం తప్ప జావెద్ ముఖంలో ఏ మార్పు లేదు. పైగా ముందుకంటే కూడా కోపంతో కళ్ళు ఎర్ర బడ్డాయి. పెదవులు వణుకుతున్నాయి. న్యాయమూర్తి జావెద్ వైపు చూస్తూ 'ఇక నువ్వు వెళ్ళవచ్చు అంటూనే బోనులో నిలుచున్న జావెద్ 'యువర్ ఆనర్! పది హేనుళ్ళుగా నేను జైల్లోఉన్నాను. పదిహేను... కేవలం పదిహేను నిమిషాలు ఈ బోనులో ఉండనివ్వండి. నన్ను మాట్లాడనివ్వండి అంటూనే అయిష్టంగానే అనుమతిస్తూ న్యాయమూర్తి తల ఊపినట్టు కనిపిస్తూనే 'యువర్ ఆనర్ నేను చెయ్యని నేరానికి పదిహేనేళ్ళుగా నన్ను జైల్లో ఉ ంచి ఇప్పుడు నేను నిర్దోషినంటున్నారు. నిర్దోషినయిన నన్ను దోషి అన్నారు ఆనాడు. కాదు కాదు నిర్దోషినంటున్నారు ఈనాడు. దోషి అన్నవాణ్ణి నిర్దోషి అని తెలుసుకోవడానికి ఈ న్యాయస్థానానికి పదిహేనేళ్ళు పట్టింది. ఈ పదిహేనేళ్ళు కటకటాల్లో కరిగిపోయిన నా విలువైన జీవితాన్ని ఈ చట్టాలు, న్యాయస్థానాలు నాకు తిరిగి ఇప్పించగలవా?

యువర్ ఆనర్! పదిహేనేళ్ళుగా ఇక్కడ జైల్‌లో నేను నరకం అనుభవిస్తూ ఉంటే అక్కడ దిక్కులేని నా భార్యపిల్లలు తిండికి లేక నకనకలాడారు. కూలినాలి చేసు కుంటూ ఇళ్ళల్లో చాకిరి చేసుకుంటూ తిరిగారు. చేయని నేరానికి అమాయకులైన నా పిల్లలు ఉగ్రవాది పిల్లలుగా అందరి ఛీత్కారాలకు గురై పడిన కష్టాలు అన్నీఇన్నీ కావు. అందరిపిల్లల్లాగా నా పిల్లలు స్కూల్‌లో చదవుకోలేకపోయారు. యువర్ ఆనర్! అదిగో అటు చూడండి. ఆ అమాయకురాలు నా భార్యను ఒక్కసారి చూడండి. ఉగ్రవాది భార్యవు. ఇల్లు ఖాళీ చేయమంటూ గెంటివేస్తే పసిపిల్ల లను తీసుకొని ఊరంతా తిరిగినా ఎవరూ అద్దెకు ఇల్లు ఇవ్వకపోతే పాడుపడిన పూరిపాకలో పసిపిల్లలను కనిపెట్టుకుంటూ బ్రతుకు వెళ్ళబోస్తూ ఉంది. ఇవన్నీ తెలుసుకుంటూ కటకటాల వెనుక కన్నీళ్ళను త్రాగుకుంటూ బ్రతికాను యువర్ ఆనర్ అంటూ పెల్లిబుకుతున్న దుఃఖాన్ని ఆపుకోలేక బొంగురుపోయిన స్వరంతో..... యువర్ ఆనర్ ఇది న్యాయ స్థానం పైగా పవిత్రమైన న్యాయస్థానం! అక్కడ న్యాయదేవత విగ్రహం, ఇక్కడ న్యాయపీఠం, ముమ్మూర్తులా న్యాయమూర్తులు, హాలునిండా న్యాయవాదులే... అంతా న్యాయం, న్యాయం... అనే బిరుదులు తగిలించుకున్నవాళ్ళే. ఇక్కడ న్యాయమంటూ మచ్చుకైనా ఉంటే మీ హృదయాల్లో జీవం అంటూ ఏదైనా మిగిలివుంటే నా ఈ ప్రశ్నకు సమాధానం నాకు కాదు కనీసం మీ మనసులకయినా ఇచ్చుకోండి.. యువర్ ఆనర్! భార్యాభర్తల బంధమేమిటో అనుబంధమేమిటో భార్యలు ఉన్న వారికి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. మానవతా దృష్ట్యా న్యాయస్థానంలో ఈ ప్రశ్న అడగటం అనుచితమని మీకు అనిపించినా అడిగి తీరాలి. అందుకే అడుగుతున్నాను. జరుగుతున్న అన్యాయాలను చూడలే నంటూ కళ్ళకు గంతలు కట్టుకున్న ఆ న్యాయదేవత విగ్రహం కనీసం చెవులతోనైనా వింటుందేమోనని అడుగుతున్నాను అంటూ గంభీరంగా యువర్ ఆనర్! బుగ్గిపాలైపోయిన పదిహేనేళ్ళ విలువైన మా యవ్వనాన్ని ఏ న్యాయస్థానం మాకు తిరిగి ఇవ్వగలుగుతుందోచెప్పండి? అది సాధ్యం కానప్పుడు ఇలా మా జీవితాలతో ఆడుకునే అధికారం మాత్రం ఎవరిచ్చారు ఈ చట్టానికి? దైవమిచ్చిన పదిహేనేళ్ళ మా వెన్నెల రాత్రులను నిలువునా దోచుకుంది మీచట్టం. ఇది అన్యాయం కాదా? దోపిడి కాదా? ఇది ఉగ్రవాదం కాదా? దీన్నెవరు శిక్షించాలి? ఈ నేరానికి ఎంత శిక్ష పడాలి? ఎవరు శిక్షించాలి? ఎవరిని శిక్షించాలి? చట్టాన్నా; న్యాయస్థానాలనా? వ్యవస్థనా? ఎవ్వరూ దొరకరు

మాలాంటి అమాయ కులు తప్ప. అటువైపు దృష్టి మళ్ళిస్తూ చంటిపిల్లాడిలా ఏడుస్తూ... యువర్ ఆనర్! అటు చూడండి గోరుముద్దలు తినిపించి ఎంతో గారాబంగా పెంచుకున్న నా బిడ్డకు ఉగ్రవాది కూతురంటూ ముద్ర పడి ఆమెను పెళ్ళిచేసుకోటానికి ఎవరూ ముందుకు రావటంలేదు. వయసు దాటి పోయింది. చేయని నేరానికి నా చిట్టి తల్లి బతుకు బలైపోయింది. యువర్ ఆనర్! పోలీసువారి హింసలకు నా ఒళ్ళు హూనమైపోయింది. నడుములు విరిగిపోయాయి. పదిహేనేళ్ళ జైలు జీవితం నన్ను ఎందుకు కొరగాని వాడిగా చేసింది. ఇంటికెళ్ళి భార్యాపిల్లలకు నేను అదనపు భారం కాబోతున్నాను. వాళ్ళ పాలిట జీవచ్ఛవంగా మిగిలిపోతున్నాను... అంటూ కన్నీళ్ళు తుడుచుకుంటూ దీర్ఘంగా నిట్టూర్చి, యువర్ఆనర్ దోషినంటూ నన్ను జైల్లో తోశారు. ముసలివాణ్ణిగా చేసి నిర్దోషినంటూ పంపుతున్నారు. మీ జైలు గోడలు తినేసిన నా విలువైన యవ్వనాన్ని తిరిగి ఇవ్వగలదా మీ న్యాయస్థానం? ఏమిటి ఈ ఆటవికం.. అమాయక జీవితా లలో ఎందుకు నిప్పులు పోస్తారు? మార్చు కోండి మీ చట్టాలను అంటూ... చెప్పండి యువర్ ఆనర్ ఇప్పుడు చెప్పండి. నేను చట్టాన్ని అడుగుతున్నాను. ఓ చట్టమా! మాలాంటి ఎందరో అమాయకుల జీవితాలను నిరాధారంగా, నిర్దాక్షిణ్యంగా చిదిమివేసిన కర్కశ చట్టాలను శిక్షించే చట్టం కూడా ఏదైనా ఉందా నీ చట్టాల పొదిలో? లేకపోతే చేయని నేరానికి అమా యకులను శిక్షించే అధికారం నీకెవరి చ్చారు? నిన్ను శిక్షించేవారెవరూ ఇక్కడ లేకపోయినా అక్కడ... అక్కడ.. అక్కడ ఉంది ఓ న్యాయస్థానం. అక్కడ ఉన్నాడు అందరికన్నా ఘనమైన న్యాయమూర్తి అంటూ చేతులు పైకెత్తి చూపుతూ ఉంటే న్యాయమూర్తి సైగ చేస్తూనే ఇన్‌స్పెక్టర్ వచ్చి జావెద్‌ను బోనులోనుండి బయటికి తీసుకెళ్ళాడు. బయట కోర్టు ఆవరణలో భార్యాపిల్లలు జావెద్‌ను చుట్టేసుకున్నారు అందరూ భోరున ఏడుస్తూ ఉంటే ఆ ఉద్విగ్న ఘట్టాన్ని చూస్తూ అక్కడివారంతా కంట తడిపెట్టారు. చూడలేక చెట్లపై పక్షు లన్నీ విలవిలా రావాలు చేస్తూ ఎగిరి పోయాయి.



# 14

## మచ్చ

"అమ్మాయ్ మీ అమ్మా, నాన్న ఉన్నారా?" అడిగారు ఏదో పనిమీద తన కుమారుడితో మాట్లాడటానికని పోలీస్ స్టేషన్‌కు వచ్చిన ఇన్స్పెక్టర్ అజీజ్ నాన్న హాజీసాబ్‌గారు.

"ఉన్నారు" అంది ముక్తసరిగా నీళ్లునిండిన కళ్లను చెరుగుతో ఒత్తుకుంటూ.

ప్రతి స్త్రీ గౌరవంగా బ్రతకాలనుకుంటుంది కదా.. మరి నీవిలా ఎందుకు తయారయ్యావు?

"నిజమేనండి. అందరిలా నేను గౌరవంగానే బ్రతకాలనుకున్నాను. ఆ మాటకొస్తే నేనే కాదు ఏ స్త్రీ కావాలని ఈ దుస్థితికి రావాలని కోరుకోదు..."

"అంటే?..." అడిగారు హాజీసాబ్.

ఈ విధంగానైనా తన మనసును తేలిక చేసుకుందామని అనుకుందేమో ఆ అమ్మాయి ఒకసారి గతంలోనికి తొంగిచూస్తూ చెప్పసాగింది.

"ఐదుగురు అక్క చెల్లెళ్లలో నేను రెండవదాన్ని. మా నాన్న క్షయ వ్యాధితో బాధపడుతూ ఉన్నా మమ్మల్ని పోషించటానికి వీధుల్లో తిరిగి పళ్లు, కూరగాయలు అమ్ముకుంటూ అతికష్టంగా ఓ పది రూపాయలు సంపాదించి తెచ్చేవాడు. తన వ్యాధికి మందులు తీసుకోవటం అటుంచి కడుపునిండా తిండికి కూడా గడవని స్థితి మాది. ఏనాడూ కడుపునిండా తిని ఎరగము. ఆ భయంకరమయిన వ్యాధితో మందు మాకు లేకుండా మా నాన్న అట్టే కాలం బ్రతుకలేదు. ఆయన కన్నుమూసిన ఆరు మాసాల్లోనే అదే వ్యాధితో మా అమ్మ కూడా చనిపోయింది.

పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడం దుస్సాధ్యమవుతోంది ఆ అమ్మాయికి.

"మా అక్క తన జోడు చూసుకొని ఎక్కడికో వెళ్లిపోయింది. ఇక మిగతా పిల్లల్ని పోషించే భారం నాపై పడింది. కొంతకాలం పిల్లల్ని అతికష్టంగా

పోషించగలిగాను కాలచక్రం నన్ను ఒక చోట నిలకడగా ఉండనివ్వలేదు. పనికోసం ఎక్కడికెళ్లినా కూలి పని కన్నా నా యవ్వనాన్నే ఎక్కువగా కోరుకునేవారు. ఇంటికెడితే ఆకలితో ఆశగా నా కోసం ఎదురుచూస్తున్న నా చిన్నారి చెల్లెళ్లను చూస్తె కడుపు తరుక్కుపోయేది. ఈ రాబందుల దాడికి ఎక్కడికని తట్టుకోను ఎన్నాళ్లని తప్పించుకోను. మా ఆకలి మంటలార్చుకోవటానికి నా పరువం తప్ప నా వద్ద ఏమీ మిగల్లేదు. విధి ఎదురు తిరిగి ఒకనాడు కాలుజారాను. ఇక అంతే అది అలవాటుగా మారిపోయింది. ఆ తరువాత అది జీవనోపాధిగా నిలిచిపోయింది... నేను కోరి ఈ స్థితికి దిగజారలేదు. పరిస్థితులు నన్ను ఈ విషవలయంలోనికి విసిరివేశాయి. దీన్నుండి బయటపడాలనే ఉద్దేశం కూడా ఇప్పుడు నాకు లేదు. ఎందుకంటే ఈ సమాజం చెరగని సిరాతో నా నుదుటిపై "వేశ్య" అనే ముద్రవేసింది. ఇక ఈ జన్మకు నా బ్రతుకింతే.. ఇంతే.. ఇంతే.." కట్టలు త్రెంచుకువస్తున్న దుఃఖంతో చెరుగు ముఖానికి కప్పుకొని భోరున రోదించసాగింది.

ఏదో పని మీద కొడుకును చూద్దామని పోలీస్ స్టేషన్‌కు వచ్చిన హాజీసాబ్ ఆ అమ్మాయి గాథ విని చలించిపోయారు. ఆ అమ్మాయిని ఎలా ఓదార్చాలో అర్థంకాలేదు.

ఆ అమ్మాయ్ మళ్లీ అందుకుంది. "మా దౌర్భాగ్యానికి మేమిలా ఏడుస్తూంటే ఈ పోలీసులు మమ్మల్ని ఇక్కడ కూడా బ్రతకనివ్వడం లేదు. నీతిగా బ్రతకాలంటే సమాజం బ్రతకనివ్వలేదు. ఇలా బ్రతుకుతూ ఉంటే పోలీసులు వేధిస్తున్నారు. మమ్మల్ని ఆదుకునే నాధుడెవరు? ఆమె చూపు వరుసగా నిలబడ్డ తోటి అమ్మాయిల పైబడింది. ఓ మూలన చంటి పిల్లకు పాలుపడుతున్న అమ్మాయిని చూపిస్తూ "అటు చూడండి ఆ అమ్మాయికి ముప్పై ఏళ్లు దాటినా పెళ్లి కాలేదు. కారణం ఆ అమ్మాయి తల్లిదండ్రులు కట్నం ఇవ్వలేకపోయారు" మరో అమ్మాయిని చూపిస్తూ "ఈ అమ్మాయిని పెళ్లిచేసుకుంటానని ఎవడో మోసం చేసి వెళ్లిపోయాడు. తల్లి చనిపోయింది. తండ్రి తాగుబోతు అంతే ఇక అల్లరిమూక అఘాయిత్యానికి బలైపోయింది. మరో ఇద్దర్ని చూపిస్తూ ఈ ఇద్దరమ్మాయిలు అక్క చెల్లెళ్లు. వాళ్ల ఊళ్లో మతకలహాలు చెలరేగి మానభంగానికి గురైపోయారు. చేయని నేరానికి వారిని శిక్షించింది ఈ సమాజం." ఆ చూపులో పగ, కసి, అసహ్యం మేళవించాయి. సమాజాన్ని మ్రింగెయ్యాలన్నంత ఆవేశంతో అజీజ్‌వైపు తిరగి "ఇన్స్‌పెక్టర్! ఇప్పుడు చెప్పండి మేము విలాసాల కోసం

ఈ స్థితికి దిగజారామా? మీ చెల్లెళ్లే ఈ స్థితిలో ఉంటే..." చెంపచెళ్లుమంది. అజీజ్ కోపంతో ఊగిపోతున్నాడు ఇన్స్పెక్టర్ అజీజ్.

"అజీజ్ ఏమిటిది" వారించారు హాజీసాబ్ గారు.

ఆ అమ్మాయి తోక తొక్కిన నాగులా మారిపోయింది. అది పోలీస్ స్టేషన్ అని, ఆయన ఇన్స్పెక్టర్ అని మరిచిపోయి పిచ్చిదానిలా అరవడం ప్రారంభించింది. కళ్లు చింతనిప్పులయ్యాయి."కొట్టండి.. ఇంకా కొట్టండి.. చంపెయ్యండి... నరికెయ్యండి... అంటూ.

"ఏం.. మీ చెల్లెళ్లు అని ఒక్క మాట అంటే ఆ ఊహకే భరించలేకపోయారే... మేమూ ఒకరికి చెల్లెళ్లమేగా. మేమూ ఒక తల్లికి బిడ్డలమేగా. మా ఈ జీవితాలను చూస్తూ మా కన్నవాళ్లెంత కుమిలిపోయి ఉంటారో ఎన్నడైనా ఊహించారా? లేదు. అలా ఊహించలేరు. మీరు పోలీసులు. మీకు మనసు ఉండదు. మీకు తుపాకి, లాఠీ తప్ప మరేమీ తెలియదు. ఇన్స్పెక్టర్‌సాబ్, తుపాకీ లాఠీలతో ప్రభుత్వాలను మార్చవచ్చునేమో కాని జీవితాల్ని మార్చలేరు." ఆ అమ్మాయి ఆవేశం అంతకంతకూ ఎక్కువైపోతూ ఉంది. ఇన్స్పెక్టర్ స్థాణువులా నిలిచిపోయాడు.

హాజీసాహెబ్ కళ్లు చెమ్మగిల్లాయి. ఒకసారి దీనంగా ఆ అమ్మాయి కళ్లల్లోకి చూడాలని ప్రయత్నించాడు గడ్డం సవరించుకుంటూ... ఆ అమ్మాయి హాజీసాబ్ వైపుకు మళ్లింది. "అసలు మా జీవితాలు ఇలా కుక్కలు చించిన విస్తర్లుగా కావటానికి మీరే కారణం" అంది హాజీసాబ్ వైపు చేయిచాస్తూ. అకస్మాత్తుగా ఈ దాడిని ఊహించని హాజీసాబ్ తెరిచిన నోరు మళ్లీ మూసుకోలేదు. "నూర్మాయ్, పోనీ అంటుంటే ఇంకా రెచ్చిపోతున్నావ్!" గర్జించాడు అజీజ్. "అజీజ్, ఆ అమ్మాయిని ఏమీ అనకు, చెప్పనీ, ఊఁ మా తప్పేమిటో సెలవియ్యి తల్లీ!" అన్నారు కాస్త వెటకారంగా హాజీసాబ్. అవును మీరే కారణం. ఈనాడు సమాజమంతా ఇలా భ్రష్టుపట్టటానికి మీరే కారణం. వేషంలో అచ్చమయిన భక్తుల్లా కనబడుతూ నమాజులు చేసుకుంటూ, మసీదు నాలుగు గోడల మధ్య కూర్చొని అస్తమానం జపమాలను తిప్పుకుంటూ, ఇల్లు, ఊళ్లూ వదలి దైవం పేరిట దేశ సంచారం చేస్తూ తిరిగే మీరు ఊళ్లో ఏం జరుగుతుందో, ఎవరి బ్రతుకులు ఎలా కూలిపోతున్నాయో తెలుసుకోటానికి ఎప్పుడైనా ప్రయత్నించారా? సమాజాన్ని పట్టించుకోకుండా కేవలం నమాజులు,

జపమాలల తోటే స్వర్గానికి పోదలచుకున్నారా? స్వర్గం అంత చౌకబారు అనుకున్నారా! నలుగురు నడిచే దారిలో ఒక ముల్లును తొలిగిస్తే ఎంతో పుణ్యం అంటూ శుష్క ప్రసంగాలు పలికే మీరు మా గుండెల్లో రగిలే కుంపట్లను ఆర్పటానికి ఎప్పుడయినా ప్రయత్నించారా? పొరుగువాడు ఆకలితో చస్తుంటే కడుపునిండా భుజించేవాడు విశ్వాసి కాడని అస్తమానం ప్రసంగాలు చేసే మీరు గుక్కెడు గంజి, కరువై రోజుల తరబడి పస్తులతో గడిపే మీ పొరుగు వారిని గూర్చి ఎప్పుడయినా ఆలోచించారా? మా తండ్రి క్షయతో బాధపడుతూ మందు మాకు లేకుండా చచ్చిపోతే ఆ వ్యాధి అంటుకుంటుందని ఒక్కరయినా దగ్గరికి రాలేదే. మా నాన్న శవాన్ని మునిసిపాలిటి వాళ్లు ఎత్తేశారే. ఇవన్నీ నేనెలా మరిచిపోను" వగరుస్తూ వెక్కిళ్ల మధ్య చెప్పుకుపోతూ ఉంది ఆ అమ్మాయి. "కట్నాలు కానుకలు ఇచ్చుకోలేక ఎందరో ఆడపిల్లలు బలైపోతుంటే, ధర్మాలు తెలిసిన మీలాంటి వాళ్లు చేస్తున్నదేమిటి? సమాజంలో దురాచారాలను దూరం చెయ్యడానికి ప్రయత్నించి ఉంటే మేమిలా వేశ్యాగృహాలపాలయి ఉండేవాళ్లం కాదుగదా!...

ఆమె పెదాలపై వెటకారపు నవ్వు చోటుచేసుకుంది. ఏడుపు, ఆ చేదు నవ్వుల మధ్య అడిగింది. "మీ బిడ్డలమయిన మేము ఇలా నరకం అనుభవిస్తూ ఉంటే మీరు స్వర్గంలో ప్రవేశిస్తారా? అంత సులువనుకున్నారా స్వర్గం??. మా ఉసురు ఊరకపోదు మౌలీసాబ్" మిమ్మల్ని పట్టి నలిపేస్తుంది... ఏడ్చి ఏడ్చి బాగా అలసిపోయిందేమో నిలుచోలేక గోడకు ఆనుకొని కూలబడింది. మధ్య మధ్యలో ఎక్కిళ్ళు వస్తున్నాయి. అంతా నిశ్శబ్దం ఆవరించింది. హాజీసాహెబ్‌గారు బాగా మెత్తబడిపోయినట్టు కనిపించారు. ఆ అమ్మాయి మాటలకు ఆయనలో ఆలోచనల తుఫాను ప్రారంభమయింది. శూన్యంలోకి చూస్తున్నట్టుగా ఆ అమ్మాయిలవైపు చూస్తూ ఉండిపొయ్యారు. హెడ్ కానిస్టేబుల్ తెచ్చిన ఫైల్‌లో మునిగిపొయ్యాడు ఇన్‌స్పెక్టర్ అజీజ్.

అంతవరకు పరధ్యానంగా ఉన్న హాజీసాబ్ ఏమిటీ అన్నట్టు కొడుకువైపు చూశారు.

అకస్మాత్తుగా అతను అమ్మాయిలవైపు తిరిగాడు. పెదాలు వణుకుతున్నాయి. "నాన్నా... ఈ ఇరవై అమ్మాయిల్లో 15 మంది.. ముస్లిం అమ్మాయిలు" ముగించాడు

అజీజ్.

"కాదు.. పదహారు" బలహీనంగా పలికింది ఆ అమ్మాయి.

"పదహారా" నోరు వెళ్లబెట్టాడు ఇన్స్పెక్టర్.

"అవును నా పేరు సరోజ కాదు - నూర్జహాన్ బేగం - మా నాన్న ముద్దుగా పెట్టిన పేరు".

షాక్ నుండి హాజీ సాబ్ ఇంకా తేరుకోనేలేదు. అజీజ్ మాత్రం వృత్తిరీత్యా ఇవన్నీ మామూలే అనుకుంటూ  తన పనిలో మునిగిపోయ్యాడు.

"మరి నీ నుదుట ఆ పచ్చబొట్టేమిటి?" అడిగారు హాజీసాబ్

"ఔను ఆ మచ్చను నేనే కావాలని నా నుదుట పెట్టుకున్నాను. అది పవిత్రమైన నా ధర్మానికి అంటకూడదని" అంది రాలుతున్న కన్నీళ్లను తుడుచుకుంటూ.

అంతలో "అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్" అంటూ అజాన్ వినపడింది. ఆ అమ్మాయిలు యాంత్రికంగా చెరుగులు తలపై వేసుకున్నారు. హాజీసాబ్ మంత్రముగ్ధునిలా లేచారు. చేతిలోని జపమాలను ఒకసారి చూసుకున్నారు. నిలుచున్న అమ్మాయిల వైపు ఒకసారి చూచారు. ఆ అమ్మాయి నుదుటిపై మచ్చ స్పష్టంగా కనిపించింది. చేతిలోని జపమాలను అక్కడే పడేసి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బయల్దేరారు. ఆయన నడకలో, చూపులో ఏదో సంకల్పం  కొట్టవచ్చినట్టు కానరాసాగింది.



# 15

# ఏం మనుషులో!

రెండు గంటలపాటు కుండపోతగా కురిసిన వర్షం అరగంట వెలిసి మళ్లీ తన ప్రతాపం చూపుతుందా అన్నట్లు ఆకాశంలో నల్లటి మబ్బులు దట్టంగా అలుముకుంటున్నాయి. మూణ్నెలుగా వడగాలికి మాడిపోయిన శరీరం ఈదురు గాలికి కాస్తా కునుకు పట్టింది. ఉన్నపాటుగా బస్సు ఆగిపోయి కోలాహలం వినపడగానే కునుకు నుండి తేరుకొని పక్క కిటికి అద్దం తొలగించి ఆసక్తిగా తొంగి చూశాను ఏం జరిగిందో తెలుసుకుందామని. ఎదురుగా కాజ్‌వే వంతెనపై పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తూ ఉంది నక్కలవాగు. హెూరుగాలి రాగానికి పల్లవి పాడుతూ ఉంది ఆ వరద వరవడి. రాకపోకలు పూర్తిగా స్తంభించిపోయాయి. ఏటికి అటు ఇటు ఎన్నో వాహనాలు నిస్సహాయంగా నిలబడి ఉన్నాయి.

"మధ్యాహ్నానికి గాని వరద తగ్గదు" అన్నాడో వ్యక్తి.

"ఏదైనా కాస్త కడుపులో వేసుకుందామంటే దగ్గర్లో ఏ ఊరులేదు" అంటూ వాపోతున్నారు కొంత మంది.

ఇదేమి పట్టనట్టుగా పిల్లలు ఏటి వరదను, ఆ వరదలో కొట్టుకుపోతున్న చెట్టు కొమ్మల్ని చూస్తూ కేరింతలు కొడుతున్నారు. పూర్తిగా చల్లబడి పోయిన వాతావరణానికి తోడు ఈదురు గాలికి భరించలేక కొందరు ముసుగులు కప్పుకున్నారు.

వరద తగ్గేంత వరకు చేయగలిగిందేమీ లేదు కాలక్షేపం చేయటం తప్ప. ఎవరికి తోచిన విధంగా వారు కాలక్షేపం చేస్తున్నారు. నమాజు వేళయింది కాబోలు కొంతమంది ముస్లింలు ఒక చిన్న సమూహముగా ఏర్పడి అంత దూరం ఓ ఇసుక ప్రదేశంలో నమాజు సలుపుకుంటున్నారు. వారి ఆరాధనా భావం అక్కడున్న వారందర్నీ ఆకర్షించింది.

"డ్యాడీ! వాళ్లేంచేస్తున్నారు?" అడిగింది మిని స్కర్టుతో పాశ్చాత్య నాగరికత ఉట్టిపడుతూ ఉన్న పద్నాలుగేళ్ల ఓ అమ్మాయి.

"వారు నమాజ్ చేస్తున్నారు" అన్నాడు టిప్‌టాప్‌గా జీన్స్ ధరించి పైప్ పీలుస్తూ ఉన్న తండ్రి.

"ఓ... పూర్ క్రియేచర్స్.... ఇట్స్ ఎ షో" అంది వెటకారంగా నవ్వుతూ ఆమె.

వాళ్ల తరహా చూస్తూ ఉంటే సంపన్న కుటుంబీకులుగా ఉన్నారు. ఆడా మగా కలిసి ఓ పది మంది దాకా ఉన్నారు. వారు ప్రయాణం చేస్తున్న మోటార్‌ని ఓ చిన్న ఇంటిగా మార్చుకున్నారు. ఆరుగురి దాకా ఉన్న స్త్రీలంతా నలభై ఏళ్ల లోపువారు. అంతా స్లీవ్ లెస్ బ్లౌస్‌లు, బౌల్డ్ హేర్‌తో ఉండి ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతున్నారు. ఓ బాక్స్ నుండి పళ్లు, బిస్కెట్, బ్రెడ్ జామ్‌ను ఎవరికి నచ్చినవి వారు తీసుకుని తింటున్నారు. స్టవ్ వెలిగించి టీ కాస్తున్నారు. మధ్య మధ్యలో ఏదో మాట్లాడుకుంటూ బిగ్గరగా నవ్వుకుంటూ గట్టిగా కేకలు పెడుతున్నారు.

తిండి ముగించుకొని వారిలో రెండు జంటలు వ్యాన్ టాప్పైన కూర్చొని పేకాట మొదలుపెట్టారు. ఆడుతున్నంత సేపు ఒకటే గోల. ఒకర్నొకరు గిల్లుకుంటూ గేలిచేసుకుంటున్నారు. మరో యువ జంట చెట్టాపట్టాలు వేసుకొని అలా దూరంగా కనబడుతున్న పొదల వైపుకు వెళ్లిపోయారు. ఓ సన్నటి అమ్మాయి లావుపాటి సెక్స్ నవలలో మునిగిపోయింది. ఓ యువకుడు ఇద్దరు యువతులు రోడ్డు నుండి అంత దూరంలో ఓ తివాచి పరచుకొని కూర్చుని విస్కీ ఎంజాయ్ చేస్తున్నారు. నాకు పరమ అసహ్యం వేసింది.

వరద క్రమంగా తగ్గుముఖం పడుతూ ఉంది. కాని వంతెన మాత్రం ఇంకా నీటిలో మునిగే ఉంది. రోడ్డు కనపడటం లేదు. ధైర్యం చేసి ఓ లారీ డ్రైవర్ ప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది. ఇంకా ఓ గంటకు పైగా గాని రాకపోకలకు వీలు పడదని తీర్మానించారు. అక్కడున్న కొంతమంది రైతులు.

సాయంత్రం ఐదు గంటలు కావస్తూంది. ముస్లింల బృందం నమాజు ముగించుకుంది. అందరి చేతుల్లో జపమాలలు యాంత్రికంగా కదులుతున్నాయి. చిన్నగా తుంపర్లు పడుతూ ఉంటే అందరం బస్సులోకి వెళ్లి కూర్చున్నాం. ఆ ముస్లింలు ఏదో మత సమావేశానికి వెళ్లి వస్తున్నట్టున్నారు. సమావేశంలో వక్తల ప్రసంగాలను గూర్చి పదే పదే చెప్పుకుంటున్నారు. నైతిక విలువల్ని కోల్పోతే నరులే వానరులుగా

ఎలా మారిపోతారో ఇంతకన్నా నిదర్శనం ఏం కావాలి అంటూ ఆ మెటడార్ వ్యాన్ బృందాన్ని గూర్చి చెప్పుకుంటున్నారు.

"ఖలీల్ భాయ్ అల్లాహ్ మనల్ని ముస్లింలుగా పుట్టించి ఆ రొంపి నుండి కాపాడాడు. ఇస్లాం ధర్మాన్ని బోధించిన ఆ కారుణ్యమూర్తి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) గారికి మనం ఎంతో రుణపడి ఉన్నాం. లేకపోతే మనమూ వీళ్లగానే పతనమై ఉండేవాళ్లం" అన్నాడు జపమాలను ఆపకుండా మునివేళ్లపై ఆడిస్తూ.

ఇస్లాం ధర్మాలను సాహిత్యం ద్వారా కొంత వరకు తెలుసుకున్న నాకు వారి మాటలకు నవ్వొచ్చింది. విచక్షణా జ్ఞానంతో ఇస్లాం ధర్మాలను అనుసరించి ఆచరించి ముస్లిం అవుతారు కాని పుట్టుకతో ఎవరూ ముస్లిం కావటం జరగదు అనే అభిప్రాయం గల నేను వారి అభిప్రాయంతో ఏకీభవించలేకపోయాను. ధర్మాల విషయంలో కల్పించుకొని వారితో మాట్లాడటానికి అవకాశం కోసం ఎదురు చూడసాగాను.

"అందుకే అల్లాహ్ మనల్ని ఇతరులకన్నా ఉత్తమ సమాజం అన్నాడు ఖురాన్‌లో" అన్నాడు సగర్వంగా మరో వ్యక్తి.

"సాయిబుగారూ! ఆ వాక్యం అంతటితో పూర్తి కాలేదు. ఇంకా ఉంది "మీరు అందరికన్నా ఉత్తమ సమాజం మంచిని ఆజ్ఞాపిస్తారు. చెడును వారిస్తారు" అని ఉ ంది ఖురాన్‌లో. మరి వారు చేస్తున్న చెడును వారించకుండానే మీరు ఉత్తమ సమాజం ఎలా ఔతారు?" అన్నాను అవకాశం తీసుకుని వారితో.

"నిజమే, కాని వారు మా మాట వినేట్టు ఉన్నారా?" అన్నారు సాయిబుగారు.

"వారు వింటేనే మీరు చెప్పాలని ఉందా? ఐనా మీరు చెప్పటానికి ప్రయత్నించకుండానే వారు వినరని ఎలా అనుకుంటారు? ఆనాడు తాయిఫ్ ప్రజలు ప్రవక్త గారి మాటలు విన్నారా? అలా వినలేదని ఆయన వారికి చెప్పడం మానేశారా? ప్రవక్తగారి బాబాయ్ అబూతాలిబ్ వారి మాటలను విననంత మాత్రాన ప్రవక్తగారు ఆయనకు చెప్పటం మానేశారా?" అన్నాను కాస్త ఘాటుగానే. ఆ మాటలకు వారేమి మాట్లాడలేదు.

"మీరు మహాప్రవక్త జీవితాన్ని బాగా అధ్యయనం చేసినట్టున్నారు" అన్నాడో వ్యక్తి

"ఈ చిన్న సత్యాన్ని గ్రహించటానికి మరీ అంత లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరమేముంది. విషయం స్పష్టంగా ఉందిగా!"

"ఇస్లాం యడ ఇంతగా ఆకర్షితులైన మీరు ఇస్లాం ఎందుకు స్వీకరించలేదు" అన్నాడు ఆ వ్యక్తి విషయాన్ని మారుస్తూ.

"నిజమే మానవ నైజానికి అనుగుణంగా ఉన్న ఆ సమగ్ర జీవిత విధానాన్ని అనుసరించాలనే అనిపిస్తుంది కాని మీరు ఏమి అనుకోరంటే ఒక్కమాట. ముస్లింలు అనబడుతున్న వారు ఇస్లాం ధర్మాలను సరిగ్గా అర్థం చేసుకోటానికి ప్రయత్నిచకుండా, ఒకవేళ ప్రయత్నించినా వాటిని ఆచరించకుండా దైవ విధేయత ముసుగులో మనో వాంఛల దాస్యం చేస్తున్నారు. దైవ ధర్మాలను మనో కాంక్షల మేరకు మలచుకుంటూ ఇస్లాం స్వరూప స్వభావాలనే సమూలంగా మార్చి వేశారు. సామాజిక జీవితంలో వారు దైవ హితవుల్ని వదలి ఇతరుల లాగానే మనుగడ సాగిస్తున్నారు. ముస్లింనబడుతున్న ఇలాంటి వారి వర్గంలో నేను చేరిపోతే నా భవిష్యత్తుకు భద్రత ఉంటుందనే నమ్మకం నాకు కురదటం లేదు. అప్పుడు నేను రెంటికి చెడ్డ రేవడినైపోతానేమోనని భయంగా ఉంది" అన్నాను.

"అంటే....?"

"అంటే నాకు పెళ్లీడు వచ్చిన ముగ్గురు కూతుళ్లున్నారు. మేము ఇస్లాం స్వీకరిస్తే ఇస్లాం ధర్మానుసారం కట్నం కానుకలేమీ లేకుండా నా కూతుళ్లను మీ కోడళ్లుగా స్వీకరిస్తారా?" అన్నాను. వారు క్షణం పాటు తికమక పడ్డారు.

"మేము కాకపోతే మరెవరైనా స్వీకరిస్తారు" అన్నాడు నీళ్లు నములుతూ వారిలో ఒకరు.

"అంటే మీరు మాత్రం స్వీకరించరన్నమాట. మీరన్నట్టుగానే అందరూ అలాగే అంటే నా పిల్లల భవిష్యత్తు ఏం కావాలి? ఐనా తెలుగు మాట్లాడుతూనే ఏదో అంటరాని వారుగా ఏవగించుకునే ముస్లింలు తెలుగు తప్ప ఏ భాషా రాని నా కూతుళ్లను కోడళ్ళు గా స్వీకరిస్తారా? స్వీకరించినా వారిని గౌరవిస్తారా? ఉర్దూ మాట్లాడితేనే ముస్లిం అనే సంకుచిత భావంగల మీ వర్గంలో చేరాలంటే భయంగా ఉంది. మీరు ఇతర భాషల్ని గౌరవించకపోవటం మూలాన నాలాంటి ఎంతోమంది ఇస్లాం స్వీకరించటానికి వెనుకంజ వేస్తున్నారు. అసలు ఈ దేశంలో ఇస్లాం వ్యాప్తి చెందక పోవటానికి ఓ పెద్ద అడ్డంకి ముస్లింల ఈలాంటి చాంధస భావాలే" అన్నాను.

వరద తగ్గి మోటారు వాహనాలు ఒక్కొక్కటిగా వంతెన వైపుకు కదలడంతో

చర్చ అంతటితో ముగిసింది. మా బస్సు వంతు రానే వచ్చింది. మా బస్సు ముందు మెటడార్‌లో ఆ (అ)నాగరిక జనం చప్పట్లు చరుస్తూ పాటలు పాడుతున్నారు. వంతెనపై ఇంకా మూడడుగుల నీళ్ళు ప్రవహిస్తూ ఉండటం మూలాన రోడ్డు కనబడటం లేదు. యడ్ల బండ్లు కూడా ఒక్కొక్కటే అతి కష్టంగా దాటిపోతున్నాయి. ఓ ఎద్దు కాలు జారి నీళ్లలో పడిపోయింది. క్షణాల్లో పరిస్థితి ప్రమాదకరంగా మారిపోయింది.

అస్థిపంజరంలా ఉన్న బండి తోలే రైతు లబోదిబోమంటూ మొత్తుకుంటున్నాడు. అక్కడ ఉన్న వారందరూ ప్రేక్షకుల్లా సలహాలిస్తూ నిలబడిపోయారేగానీ సహాయం చేయటానికి ఎవరూ సాహసించడం లేదు. నాలో కంగారు ఎక్కువైపోయింది. వెంటనే బస్సు దిగి నీళ్లలో పరుగెత్తుకుంటూ వెళ్లాను ఏదో చేతనైనంత సహాయం చేద్దామని. నేను వెళ్లేలోగానే అదుపు తప్పి రెండెడ్లూ మెడకట్లు తెంచుకొని ప్రవాహంలో కొట్టుకొపోసాగాయి. ఎంతో కాలంగా తన జీవనాధారంగా నిలిచిఉన్న ఆ యెడ్లు ప్రవాహంలో కొట్టుకొపోతూ ఉంటే పగిలిపోయేలా గుండెలు బాదుకుంటూ "అయ్యో! పెద్దాడా... పోతున్నాయిరా పోతున్నాయి... మా బతుకులు ఏట్లో కొట్టుకొపోతున్నాయి బాబోయ్... రండిబాబూ మా బతుకులు నిలబెట్టండి" అంటూ చేతులు చాచి అందరివైపు దీనంగా చూస్తూ విలపిస్తున్నాడు. నా ఎద్దులెంట నేనూ బోతా అంటూ ఆ పేద రైతు నిరాశతో నీళ్లల్లో పడబోతుండగా గట్టిగా పట్టుకొని ధైర్యం చెప్పి గట్టుకు తీసుకొచ్చాను.

ఇంత ఘోరం జరిగిపోతున్నా సహాయానికి ఏ ఒక్కరూ రాకపోగా అక్కడున్న వారంతా ఆ రైతునే తప్పు పడుతూ తలా ఒక మాట అంటున్నారు.

"అంతా దైవేచ్ఛ" అన్నారు ఓ సాయిబు గారు జపమాలను ఆడిస్తూ.

"అది మీరు ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు సాయిబు గారూ! కష్టాల్లో ఉన్న మనిషిని ఆదుకోటానికి సాటి మనిషిగా మన కర్తవ్యాన్ని మనం ఎంతవరకు నిర్వర్తిస్తామో చూడటానికి దైవం ఇలాంటి పరీక్షలు కూడా పెడుతూ ఉంటాడు. బస్సులో కూర్చొని ప్రేక్షకుల్లా చూస్తూ కూర్చునేకంటె వచ్చి మీ చేతనైనంత సహాయం చేసి ఉండొచ్చుగా" అన్నాను కోపంగా, ఎవరూ మాట్లాడలేదు...

ప్రవాహంలో యెడ్లు కొట్టుకొపోతున్న సంఘటనను చెప్పుకుంటూ పెద్దగా నవ్వుతున్నారు మెటడార్‌లోని ఆ(అ)నాగరికులు. నేను ఉండలేకపోయాను.

"నవ్వుతున్నారా? ఈ వరదలో కొట్టుకొపోయిన ఎద్దు ఎక్కడో ఒక చోట గట్టెక్కి ఇల్లు చేరుకోగలవు కాని, తాగుడు, జూదం, అర్ధనగ్న వస్త్రధారణ, అశ్లీలం లాంటి రొంపిలో కొట్టుకొపోతున్న మీరు ఎక్కడ తేలుతారో ఎప్పుడు గట్టెక్కుతారో కాస్త ఆలోచించుకుంటే మంచిది. కష్టాల్లో ఉన్న వారిని ఆదుకోవడం పోయి నవ్వుతున్నారా? ఇదేనా మీ నాగరికత!" అన్నాను కాస్తకటువుగా.

బస్సు కదిలిపోతూ ఉంటె వడివడిగా వెళ్లి బస్సెక్కాను. ఏరుదాటి బస్సు వెడుతూ ఉంటె నా ఆలోచనలు బస్సు వేగంతో పోటీపడుతున్నాయి. జరిగిందంతా నా మస్తిష్కపు తెరపై మళ్లీ ఒకసారి మెదులుతూ ఉంటె కిటికి నుండి నునువుగా కనిపిస్తున్న దూరపు కొండలను చూస్తూ మనసులో ఛీ! ఛీ!! ఏం మనుషులో! అనుకున్నాను.



# 16

## ఆర్తనాదం

ఆ కుగ్రామానికి అరమైలు దూరంలో నాగుల తిప్ప. నిలువెత్తు బండ రాళ్లు గుహలు, పొదల మధ్య పాడుపడ్డ దేవాలయం. ఆ పక్కనే నిండా పాచిపట్టిన చిన్న కోనేరు. అర్ధరాత్రి దాటిపోయిన సంకేతంగా ఆకాశం మబ్బులు కమ్మి భయంకరంగా ఉంది. కన్నుపొడుచుకున్నా కానరాని కటిక చీకటి. నేరాలకు, హత్యలకు నిలయంగా పేరు పడ్డ స్థలం అది. పక్షుల రెపరెపలతో మరీ భయంకరంగా ఉంది ఆ స్థలం. చూస్తూ ఉండగనే ఉత్తర దిశ నుండి నల్లగా కమ్ముకు వచ్చాయి మేఘాలు. ఉరుములు మెరుపులతో కుండపోతగా వర్షం పడే సూచనగా సన్నగా చినుకులు మొదలయ్యాయి. హెూరుగాలికి ఊగిపోతున్న చెట్ల కొమ్మల శబ్దంలో అక్కడ ఎవరో గట్టిగా మాట్లాడుకుంటున్న మాటలు అస్పష్టంగా వినపడుతూ ఉన్నాయ్. క్షణం పాటు మెరిసే మెరుపుల్లో అక్కడి దృశ్యం స్పష్టంగా కనబడటంలేదు.

అక్కడ నలుగురు యువకులు ఉన్నారు. అంతా ఇరవై ఏళ్లకు అటూ ఇటూ ఉంటారు. వారిలో ఒకడు అజాను బాహుడు. మెడకు ఓ పూల కర్చీఫ్, జీన్ ప్యాంట్‌పై ఇన్‌షర్ట్ చేసిన నడుముకు వదులుగా కట్టుకున్న చైన్, చెదిరిన తల ఆ ముఠాకు బాస్‌లా ఉన్నాడు. దీర్ఘంగా సిగరెట్ దమ్ములాగి వదులుతూ ఉరుముల శబ్దంతో పోటీపడేలా "రేయ్ రూబీ" అంటూ గర్జించాడు సినిమాలో విలన్ స్టైల్‌లో. "యస్‌బాస్" అన్నారు ముగ్గురూ ఒక్కసారిగా. "టైం ఎంతయింది" గద్దించాడు మరో స్టైల్‌లో. "ఒకటిన్నరబాస్" జవాబిచ్చాడు భయపడుతున్న స్టైల్‌లో. "ఇంకా చావలేదా వెధవలు?" "పిట్ట దొరకాలి కదా బాస్... వస్తూనే ఉంటారు.... అదిగో అక్కడ అలికిడి వినపడుతూ ఉంది... ఆఁ మనవాళ్లే... పిట్టను కూడా వెంట తెస్తున్నారు" అన్నాడు చంకలెగరేస్తూ. ఆ వచ్చిన నలుగురిని కలిపితే బాస్‌తో కలిపి వారి ముఠాలో ఎనిమిది మంది ఉన్నారు. అందరూ బాగా తప్పతాగిన మైకంలో ఉన్నారు. పనీపాటా లేని ఆ కుర్రాళ్లు సినిమా ప్రభావం బాగా ఒంటబట్టి ఆ భ్రమలో జీవిస్తున్నట్టున్నారు. వచ్చిన ఆ నలుగురు యువకుల్లో బలంగా ఉన్న ఒకడు ఓ పదమూడేళ్ల అమ్మాయిని తన భుజంపై నుంచి దింపాడు. మెరుపుల వెలుగులో నోటికి బలంగా టవల్ కట్టి ఉన్న

ఆ అమ్మాయి చేతులు జోడించి దండం పెడుతూంది. ధారగా కురుస్తున్న కన్నీళ్లతో తడిసిన ఆమె ముఖం దీనంగా ఉంది. కళ్లు తెరువలేనంత మైకంలో "శ...హ... భా...ష్" అంటూ సినిమా విలన్‌లా వికటాట్టహాసం చేయటానికి విఫల ప్రయత్నం చేస్తూ వెళ్లండి అన్నట్టు ఆ పక్కనే పాడుపడిన గది వైపునకు చేతితో సైగ చేస్తూ మత్తులో నేలపై వొరిగిపోయాడు, వారి బాస్. అంతే ఆ అమ్మాయిని అటు తీసుకెళ్లారు ఆ ఏడుగురు.

ఆమె చేస్తున్న ఆర్తనాదాలు ఆకాశం బద్దలయ్యేలా అతి భయంకరంగా గర్జించే ఉరుముల్లో కలిసిపోయాయి. భయంకరంగా ఉంది వాతావరణం. మేఘాలు కుండపోతగా కురుస్తున్నాయి రోదిస్తున్నట్టుగా. సంధ్య వేళ ఇంత రొట్టె తిని అంత దూరాన చల్లగాలికి రచ్చబండపై తమ మధ్య పడుకున్న తమ ఏకైక ముద్దుల కూతురు కనిపించకపోవటంతో దిగాలుపడి కుండపోత వర్షంలో బయటికిపోలేని ఆ నిరుపేద దంపతులు తమ పూరి గుడిసెలో మిణుకు మిణుకు మంటున్న దీపం ముందు కూర్చొని కన్నీరుమున్నీరుగా విలపిస్తున్నారు. వారితోపాటు పూరి గుడిసె కూడా కన్నీరు కారుస్తూ ఉందా అన్నట్టు వారిపై వర్షపు నీళ్లు బొట్లు బొట్లుగా కురుస్తున్నాయ్.

వాన వెలిసింది. తెలతెలవారుతూ ఉండగా ఆ లేతగులాబి నిండు యవ్వనం చీకటిపాలయ్యింది. మసకలో ఆ అమ్మాయి బలహీనంగా అడుగులో అడుగు వేసు కుంటూ తూలుతూ అతికష్టంగా ఇంటి తడికె తలుపు తెరుస్తూ "అమ్మా...." అంటూ కెవ్వున కేకపెట్టి తల్లిదండ్రుల మీద కుప్పకూలిపోయింది. పొద్దుపొడిచింది. భోరున విలపించటం తప్ప నోట మాట పెకలని ఆమె కళ్ల వెంట ధారగా కురుస్తున్న కన్నీళ్లే విషయాన్నంతా చెప్పేశాయి. ఆ నోట ఈ నోట ఆ మాట క్షణాల్లో గ్రామంలో దావా నంలా వ్యాపించింది. రెక్కాడితే డొక్కాడని ఆ దంపతులకు తమకు తోచిన ఉచిత సలహాలు ఇస్తున్నారు. జనం... అంతా వెళ్లిపోయారు. గుడిసెలో నిశ్శబ్దం ఆవరించింది. సొమ్మసిల్లి ఒకవైపుకు వొరిగిపోయింది ఆ అమ్మాయి. "అంతేనంటావా...?" నిశ్శబ్దాన్ని చీల్చుతూ బలహీనంగా అంది తల్లి కంఠం కళ్లు కురుస్తూ ఉంటే. "అంతే గదా మరి... అంతకన్నా ఏం జేత్తామే..." ఉన్న ఒక్క కొడుకేమో రౌడీ అయిపోయె.... మన బతుకింతేనే.... ఇంతే" అంది తండ్రి బొంగురుపోయిన కంఠం నిస్సహాయంగా.

"ఏంది నాయనా...." అంది లోయల లోతుల్లోంచి వినిపించినంత బలహీనంగా నలిగిన గులాబి కంఠం.

పోలీసోల్లకు చెప్తే.... "తండ్రి మాట పూర్తి కాకుండానే అందుకొన్ని "సెప్తే...?"

అంది ప్రశ్నార్థకంగా. ఆ నాయాళ్లను పట్టుకొని జైల్లో ఏస్తారంట. అదేగాక గౌర్మెంటోల్ల నుండి మనకు డబ్బు కూడా వ....స్తా....దం....ట" నసిగాడు తండ్రి. జవాబుగా కట్టలు తెంచుకువస్తున్న దుఃఖంతో వణికిపోతున్న పెదవులను మునిపళ్లతో గట్టిగా అదుముకుంది కూతురు.

"రెడ్డి పిలుస్తాండాడు... నువ్వు.. నీ పెండ్లాం రావాలంట" తలారి కంఠం విని వెళ్లిపోయి ఓ గంటలో తిరిగొచ్చిన ఆ దంపతులు తమ గుడిసెలో మంటల్లో కాలిపోతూ చావుకేకలు వేస్తూ కుప్పకూలిపోయిన కూతురుని చూసి గుండెలు బాదుకుంటూ భోరుమన్నారు. ఆ పక్క వీధి వారి ట్రాక్టరు వచ్చి .... ఆమెను ఆస్పత్రికి తీసుకెళ్లినట్టె వెళ్లి తిరిగివొస్తున్న ఖాళీ ట్రాక్టరు డ్రైవరును అక్కడ ఎవరో అడిగితే "సిట్టి సచ్చిపోయింద"న్నాడు.

మత్తు దిగిపోయి ఇంటికి తిరిగొచ్చిన ఆ ముఠా బాస్, రాత్రి తన ముఠా దౌర్జన్యానికి ఆహుతైపోయింది స్వయానా తన ఒక్కగానొక్క గారాల చెల్లెలే అని తెలిసి వేయిపిడుగులు ఒక్కసారిగా నెత్తిన పడినవాడిలా "రేయ్..." అంటూ గర్జిస్తూ ఆ స్థలానికి వెళ్లి ఇంకా మత్తులో పడి ఉన్న ఆ ఏడుగురిని చైన్‌తో చితక బాదుతూ కాళ్లతో, చేతులతో ఏది దొరికితే దాంతో కొడుతూ "మిమ్మల్ని.... మిమ్మల్ని ప్రాణాలతో వదలను... అందర్నీ చంపేస్తాను..."అంటూ ఉంటే" ఏంది బాస్.... ఏం జరిగింది...? అంది ఓ కంఠం.

"ఒరేయ్.... రాత్రి మీరు ఎత్తుకొచ్చింది నా చెల్లెలు రా.... నా చెల్లెలు...." అంటూ తలపట్టుకొని భోరున ఏడుస్తూ ఉంటే" బాస్.... ఇదే స్థలంలో ఎందరినో తెమ్మన్నావు.... తెచ్చాం.... అప్పుడు ... మధ్యలో అందుకొని "వాళ్లంతా వేరొకరి చెల్లెళ్లు.... ఈయన చెల్లెళ్లు కాదుగా" అంది మరో కంఠం.

రచయిత : ఒక మురికి వాడలో నిరుపేద దంపతుల ఒక్కగానొక్క పదమూడేళ్ల అమ్మాయి మూకుమ్మడి మానభంగానికి బలైపోయిన సంఘటనను ఈ రచనకు కథా వస్తువుగా తీసుకున్నందుకు ఆమె ఆత్మతో క్షమాపణకై వేడుకుంటున్నాను.

పాఠకులతో ఓ మాట : ఈ పుడమిపై జనం పుడుతూనే ఉంటారు. జీవితాలకు ఒక లక్ష్యం అంటూ లేక మనుగడ సాగిస్తున్న మానవ మృగాలు సమాజంలో ఉన్నన్నాళ్లు. నైతికపతనం పరాకాష్టకు చేరుకున్నప్పుడు సమాజం సర్వనాశనమై పోవటం కూడా సహజమే. ఆ దుస్థితిని నివారించగల జీవన విధానాన్ని స్వీకరించటమే మనకున్న ఏకైక మార్గం.



# 17

# అమానుషం

జమీలా భర్త అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. ముగ్గురు కుమారులు అబ్దుల్ బాసిత్, అబ్దుస్సమీ, అబ్దుల్ ముఖీత్ ఇంజనీరింగ్, ఒక్కగానొక్క కూతురు సజ్వా నాజ్ మెడిసిన్ చేస్తూవుంది. జమీలా మామగారైన అబ్దుర్రహ్మాన్ రిటైర్డ్ ప్రభుత్వోద్యోగి. ఉద్యోగం చేయడం మనస్కరించక గడువుకు ఏడేళ్ళ ముందే రిటైరయ్యారు.

సామాజిక చెడులను సహించేవారు కాదు. జనంలో దైవభీతి జవాబుదారితనం లేకపోవడం వల్లనే సమాజం చెడులతో కుళ్ళిపోతుందంటూ ఆవేదన వ్యక్తం చేసేవారు. ఆ మార్గంలో ప్రజలను జాగృతం చేయటంలో ప్రతి అవకాశాన్ని వినియోగించుకునే వారు. భోలాతనం, కల్లాకపటం ఎరుగుని, చంటి పిల్లవాడి మనస్తత్వం గల మనిషిగా చెప్పుకుంటారు జనం ఆయన్ని.

రాత్రి తొమ్మిది గంటలకల్లా ఇల్లు చేరుకునే మామగారు ఆనాడు పదకొండు అవుతున్నా రాకపోవడంతో అంతవరకూ కంగారుపడు తున్న జమీలా తమ తమ గదుల్లో చదువు కుంటున్న పిల్లల్ని పిలిచి 'ఒరేయ్... తాతయ్య ఇంకా రాలేదు. నాకేదో భయంగా ఉంది' అంటూ ఉండగానే ఆటో వచ్చి ఇంటి ముందు ఆగింది. ఆటో దిగి హైరానా పడిపోతూ తనలో తానే ఏదో గట్టిగా మాట్లాడుకుంటూ ఇంట్లోకి వస్తున్న తాతగారిని చూస్తూ 'ఏం తాతయ్యా! ఇంత ఆలస్యమయింది ఎక్కడికెళ్ళారు? అమ్మ కంగారు పడిపోతూ ఉంది. మీ కోసం బయలుదేరాలని సిద్ధమవు తున్నాం...' మాట పూర్తికాకుండా మధ్యలోనే అందుకుంటూ 'అబ్బబ్బా.. వద్దు.. వద్దు.. ఈ జనం వద్దూ... ఈ లోకంలో వద్దు. మరీ ఇంత ... ఇంత అమానుషమా... ఛ.... ఛ వీళ్ళు మనుషులేనా? జంతువులు కూడా ఇంత నీచంగా ప్రదర్శించవే. వీళ్ళ మధ్య బ్రతికే కంటే అడవుల్లోకెళ్ళి చావటం మేలు... మనుషులు కాదు వీళ్ళు రాక్షసులు... అబ్బబ్బా మరీ ఇంత ఘోరమా? రేపు దేవుని వద్ద ఏం సమాధానం చెప్పుకుంటారు? ఛీ.. ఛీ... గుక్క తిప్పుకోకుండా అనేయటమేకాదు ఆయన మాటల్లో ఆవేదన వ్యక్తమవుతూవుంది.

అసలు సంగతేమిటో అర్థం కాలేదు కాని ఏదో అనుకోనిదే జరిగిందనుకున్న పిల్లల ముఖాలు ప్రశ్నార్థకంగా మారిపోయాయి. మనుమరాలు సజ్వా అంటే వల్లమాలిన ప్రేమ. తాతయ్యతో ఏమైనా అడగాల నుకుంటే ఆపనికై ఆమెనే ఉ పయోగించుకునే తమ్ముళ్ళు సజ్వాకు సైగ చేశారు. సంగతేమిటో అడగమన్నట్టు.

పరిస్థితిని గమనిస్తున్న జమీలా సజ్వాతో 'ముందు తాతగారిని భోం చెయ్యనివ్వండమ్మా, తర్వాత మాట్లాడుకుందాం గానీ అంటున్న జమీలాతో 'చాలా కాలం తరువాత నా చిన్ననాటి స్నేహితుడొకడు కలిసి ఇంటికి తీసుకెళ్ళాడు. బలవంతం చేస్తే వాడింట్లో భోంచేసి తిరిగి వస్తున్నప్పుడే కలచివేసే ఆ ముదనష్టపు విషయం తెలిసింది... ఏమో మున్ముందు ఇంకా ఎంత చెడిపోతుందో ఈ సమాజం.... ఎలా బ్రతుకుతారో జనం... అను కుంటూనే అల్మారాపైనున్న సూట్‌కేస్‌లోని బట్టలు సర్దుకుంటున్న తాతగారిని చూస్తున్న పిల్లలకు అంతా అయోమయంగా ఉంది. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళిన సజ్వా అసలేం జరిగింది తాతయ్యా... అని అడుగుతూంటే చెవులు నిక్కపొడుచుకొని తాతయ్యగారిని తదేకంగా చూస్తున్నారు మిగతా పిల్లలు, సస్పెన్స్ వీడిపోనున్న సమయం వచ్చిందనుకుంటూ. అంతవరకు సూట్‌కేసులో బట్టలు సర్దుకుంటున్న తాతయ్య అది ఆపేసి.. 'ఇంతకన్నా ఏం జరగాలమ్మా... ఇదిగో ఇదే రోడ్డులో పెట్రోల్ బంక్‌కు కాస్తదూరంలో ఉన్న ఏటిఎంలో డబ్బు తీసుకొని తన స్కూటర్ స్టార్ట్ చేసి రోడ్డుపైకి వచ్చాడో లేదో అవతలి నుంచి వేగంగా దూసుకొచ్చిన లారీ అతణ్ణి గుద్దేసింది. చక్రాల క్రింద పడిన ఆ వ్యక్తి ఎవరో పాపం ఇక బ్రతకడు అన్నంత తీవ్రంగా గాయ పడ్డాడు. నెత్తుటి మడుగులో కొట్టుమిట్టాడు తున్నా ఒక్కడూ అతనివద్దకు వెళ్ళటంలేదు. అక్కడున్న కొందరిని పిలిచి కొనఊపిరితో ఉన్న అతణ్ణి ఆటోలో ఎక్కించి ఆస్పత్రికి పంపించి మరో ఆటోలో నేనూ వెళ్ళాను. 'పాపం... మధ్యలోనే పోయింది ప్రాణం' అని అక్కడెవరో అనుకుంటున్నప్పుడే తెలిసింది. క్యాజువాలిటీ టేబుల్‌పై ఉన్నది అతని శవం మాత్రమే అని... బొంగురుపోయిన గొంతుతోనే మాట్లాడటానికి ప్రయత్నిస్తున్న తాతయ్యగారి నోట మాట పెకలలేకపోవటం చూసి వింటున్నవాళ్ళ కళ్ళు చెమ్మగిల్లాయి. ఆ ఉదంతాన్ని కొనసాగిస్తూ ఈవిషయం తెలుసుకుని వచ్చిన అతని కుటుంబసభ్యుల రోదనలతో అక్కడున్నవాళ్ళంతా కంట తడిపెట్టారు.

"భోంచేసి వెళ్ళు నాయనా అంటే పదినిమి షాల్లో వస్తానమ్మా అని వెళితివే... లే.. తిందువుగాని లే అంటూ తల్లీ..., ఇప్పుడేగా వచ్చింది. ఇంతలోనే మళ్ళీ ఎక్కడికండీ అంటే ఇప్పుడే వస్తానని వెళ్ళారుగదండీ, అంటూ భార్య... చాక్లెట్ తెస్తానన్నావు కద నాన్నా అంటూ పిల్లలూ రోదిస్తూవుంటే.... అంటూ కంట తడి ఆపుకోలేకపోతున్న తాత గారితో "అదేమిటి తాతయ్యా ఇలాంటి ఆక్సిడెంట్లు, చావులు రోజూ ఎన్నో జరుగుతూనే ఉంటాయి. ఇంతకన్నా ఘోరమైన యాక్సిడెంట్లు జరగడం నిత్యం పేపర్లలో చూస్తూనే ఉన్నాం కదా.. అయినా మనిషికి మరణం తప్పదుగా తాతయ్యా... అల్లాహ్ నిర్ణయించిన ఆ ఘడియ రాగానే ఒక్క క్షణం ఆలస్యం కాకుండా ఒక్కొక్కరుగా అంతా వెళ్ళిపో వలసిందే అనే సత్యాన్ని నిత్యం బోధించే మీరు ఒక మనిషి చచ్చిపోతే ఎందుకింత బాధ పడిపోతు....' సమీ మాట పూర్తి కాకుండానే అందుకుని 'మనిషి చచ్చినందుకు కాదురా నా బాధ. మానవత్వం చచ్చినందుకు అన్నారు తాతగారు బాధనూ కోపాన్ని మేళవిస్తూ.... మానవత్వమా?... అంది సజ్వా ప్రశ్నార్థకంగా అందరి దృష్టి తాతయ్యవైపు మళ్ళింది. 'ఔనమ్మా... ఆ యాక్సిడెంట్‌కు కొన్ని నిమిషాలకు ముందు ఎటిఎం నుండి తీసిన పైకం, ఎటిఎం కార్డు, ఖరీదైన రిస్ట్‌వాచ్, చేతికి వేసుకున్న బంగారు కడియం, వేళ్ళకు ఉన్న ఉంగరాలు, ప్రమాదంలో పూర్తిగా తెగిపోయి వేలాడుతున్న వేలికి ఉన్న ఉంగరం తీయటా నికి రాకపోతే గట్టిగా లాగి ఆ వేలినే కోసి తీసేసుకుని, ఆ కార్డుతో ఎటిఎంలోని డబ్బును కూడా తీసుకెళ్ళారట... ఛీ... ఛీ.. శవం నుండి దోచుకోవడమా? చెప్పండి... మీరే చెప్పండి... ఏం మిగిలిందిరా ఈ సమాజంలో... అందుకే, శవాలను కూడా దోచుకునే వీళ్ళ మధ్య నేను ఉండదలుచుకోలేదు. వెడుతున్నాను... వీళ్ళనుండి దూరం ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అంటూ మళ్ళీ సూట్‌కేస్ సర్దుకుంటున్నాడు. పిల్లలంతా విస్తుపోయారు తాతయ్య చెప్పింది విని, పెద్దబ్బాయి బాసిత్ ధైర్యం కూడగట్టుకుంటూ 'నిజమే తాతయ్యా మనిషి మానవత్వం కోల్పోవడం అత్యంత విషాదమే కాదనను... అలా అని మీరెక్కడికిపోతారు? అన్నాడు. 'పోతాను... ఎక్కడికైనా పోతాను.

"అక్కడా ఇలాంటి మనుషులే ఉంటారు గా?... ఎటొచ్చి చచ్చేవరకూ మనుషుల మధ్యనే జీవితం గడపవలసిన మనిషి మనుషులతోనే ఉండాలి. ఇక వాళ్ళు చేస్తున్న చెడు పనులంటారా.....చెడును చెడుగా భావించేవారు వాటిని నివారించటానికి

ప్రయత్నించాలి. వారిని సంస్కరించటానికి ప్రయత్నిస్తూనే ఉండాలి. చెడులతో కాలిపోతున్న తమ సమాజాన్ని ఆర్పటానికి దివి నుండి ఏ దేవతలో దిగిరారుగా. ఆ మంటలను స్వయానా తామే ఆర్పుకోవాలి. అంతే వాటి నుండి పలా యనం పరిష్కారం కాదు. పైగా దేవుని దృష్టిలో అది అపచారమవుతుంది. మరీ ముఖ్యంగా ఈ గురుతర బాధ్యతను అల్లాహ్, ముస్లిం సమాజంపై ఉంచి 'మీలో ప్రజలను మంచి వైపునకు పిలిచేవారూ, చెడు చేయవద్దని ఆజ్ఞాపించే వారు. మీలో కొందరు తప్పకుండా ఉండాలి. ఈ పని చేసేవారే సాఫల్యం పొందుతారు.' అనీ, ఖుర్‌ఆన్‌లో మరొకచోట ముస్లిం సమాజాన్ని ఉద్దేశించి "ప్రజలను సంస్కరించటానికై రంగంలోనికి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరు." మీరు ప్రజలకు మంచిని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి ఆపుతారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు' అని ఆదేశింపబడింది అంటూ తాతయ్యా ఇవన్నీ ఖురాన్, హదీసుల నుండి స్వయానా మాకు మీరు నేర్పిన విషయాలే' అని చెబుతూవుంటే పిల్లల ధార్మిక పరిజ్ఞానానికి లోలోన తెగ సంబరపడిపోతూ పైకి కనిపించని చిరునవ్వుతో సంతృప్త మనస్కుడై 'ఊ!.. సరే సరే రాత్రి పొద్దుపోయింది, వెళ్ళి పడుకోండి.' అంటూ తన గదితలుపులు మూసుకున్నారు తాతయ్య. హమ్మయ్య! అంటూ ఊపిరి పీల్చుకున్నారు పిల్లలు.



# 18

## అనుబంధాలు

తమ జీవితాలు తాము రచించుకున్నట్టే జరిగిపోతే మానవ జీవితాలు సౌమ్యంగా సుఖసంతోషాలతో నిత్యకళ్యాణం పచ్చతోరణంలా సాగిపోయేవి. తాము ఊహించని పరిణామాలతో, కలనైనా తలచని మలుపులతో, చదరంగంలా సాగిపోతున్న మానవ జీవితాల తీరును గమనిస్తే... అవి ఓ అదృశ్య శక్తి నిర్దేశకత్వంలో సాగిపోతున్నాయనే సత్యం గోచరిస్తుంది.

ఆయన ముజీబ్, ఆమె ముబీనా; భార్యాభర్తలు. సైన్యంలో పనిచేసి స్వచ్ఛంద పదవీ విరమణ చేసి వచ్చిన ముజీబ్‌కు స్థానికంగా ప్రభుత్వోద్యోగం దొరికింది. నారు పోసినవాడు నీరు పోయకుండా ఉంటాడా? అనే భావంగల వారు గంపెడు పిల్లలతో ఇల్లు కళకళలాడుతూ ఉండాలని ఆశించారు. కాని వారి విధిలో ఇద్దరు పిల్లలనే వ్రాశాడు విధాత. ఒక కూతురు, ఆ తరువాత ఓ కుమారుడు. ముత్యాల్లాంటి ఆ ఇద్దరు పిల్లలతో సజావుగా సాగిపోతూ ఉంది వారి జీవితం. అమ్మాయి పేరు హసీనా పేరుకు తగ్గట్టు అందాలరాశి. అబ్బాయి పేరు రఫీఖ్. ముద్దుగా మున్నా అని పిలుచుకుంటారు. ఎంత ముద్దుగా ఉంటాడో మున్నా! మున్నా ఆరోతరగతి, హసీనా టెన్త్‌లో ఉన్నారు. ఒకరికొకరు ప్రాణంగా ఉంటారు. మున్నాను ఉడికించి కాస్సేపు తమాషా పట్టిద్దామనుకునే వారి బంధువులు “ఒరేయ్ మున్నా అక్కను వదిలి ఓ క్షణం ఉండలేని నువ్వు రేపు పెళ్లి చేసుకుని ఆమెను బావగారు తీసుకెళ్లిపోతే ఎలా ఉంటావు?” అని అడిగితే చాలు కోపంతో ఎర్రబడిన ముఖంతో “వారితో డిష్యుం డిష్యుం ఫైటింగ్ చేసి నా రక్తం ధారపోసి మా అక్కను రక్షించుకుంటా.” అనేవాడు. టీవీలో కార్టూన్ చిత్రాలు చూసే పిచ్చితో, అందరూ నవ్వుకునేవారు. హసీనాను ఎవరు ఏమన్నా అదేమాట అనటం అలవాటైపోయింది మున్నాకు.

జీవితం ఓ చదరంగం. ఆట ముగిసే వరకూ పావులను కదుపుతూనే ఉండడం దాని సంప్రదాయం. సాగరంలో తుఫానులు చెలరేగటం ఎంత సహజమో

అందులో పయనించే నౌక ఒడిదుడుకులకు గురికావడం కూడా అంతే సహజం. "స్కూల్‌లో మున్నా మొదటి అంతస్తు నుంచి కాలుజారి క్రిందపడి స్పృహ కోల్పోయాడు. హాస్పిటల్‌కు తీసుకెళ్లారు. ఆ దుర్వార్త విని తలపై ఒక్కసారిగా వేయి పిడుగులు పడినట్లు కుప్పకూలి పోయింది తల్లి ముబీనా. విషయం తెలుసుకున్న బంధువులతో హాస్పిటల్ కిటకిటలాడింది. ఐసీయూ రూం అద్దాలలో నుండి వెంటిలేటర్ అమర్చిన స్పృహలేని మున్నాను చూసిన హసీనా గుండెలు బాదుకుంది. అందరి కళ్లు పదేపదే ఆకాశంకేసి చూస్తున్నాయి. అందరి హృదయాలలో ఒకే మూగ ఘోష. అందరి మనస్సులదీ ఒకే మూగ భాష "ఓ అల్లాహ్! మున్నాను రక్షించు." ఇక హసీనా తన తల్లిని గట్టిగా చుట్టేసుకుని నన్ను తీసుకోమున్నాను కాపాడు ప్రభూ! మున్నాను కాపాడు అంటూ భోరున విలపిస్తూ ఉంటే చూస్తున్న వారి గుండెలు తరుక్కుపోయాయి. కాస్సేపటికి పెద్ద డాక్టర్ బయటికి వచ్చారు. ఒక్కసారిగా ఆతృతతో తన చుట్టూ మూగిన వారితో "ఇప్పుడే ఏమీ చెప్పలేం.. నలభై ఎనిమిది గంటలు.." అంటూ పక్కనే ఉన్న అసిస్టెంట్లకు ఏదో చెప్పి వెళ్లిపోయాడు.

దేహానికి తగిలిన గాయాలను మాన్పటానికి ఎన్నో మందులుంటాయి. మనసు గాయాన్ని మాన్పటానికి ఉన్నదల్లా ఒకే ఒక్క మందు, అదే "కాలం" ఏనాడూ ఎవరికోసం ఆగని కాలం దొర్లిపోయింది, మనసున తగిలిన గాయాల మచ్చలను మిగిలిస్తూ. మున్నా ప్రమాదం నుంచైతే బయటపడ్డాడు కాని విధి లిఖితం నుంచైతే కాదు. శాశ్వత అవిటితనంతో హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యాడు. బలమైన కుదుపుతో మెదడు దెబ్బతిన్నందువల్ల అబ్బాయి మనుపటిలా మాట్లాడలేడు. జ్ఞాపకశక్తిపై కూడా దాని ప్రభావం ఉంటుంది. "మా చేతనయినంత మేము చేశాం. ఎంతోమంది నిపుణులైన డాక్టర్లున్నారు. వారికి కూడా చూపించి మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి" అంటూ వాడవలసిన మందులూ, నిపుణుల అడ్రస్ వ్రాసి ఉన్న చీటీని మున్నా మామయ్య చేతికి ఇచ్చారు, చీఫ్ డాక్టర్. మెడికల్ బిల్ అరవై వేలు చెల్లించటానికని కౌంటర్ వద్దకు వెళితే ఆ మొత్తం ఓ గంట ముందే ఎవరో చెల్లించి వెళ్లిపోయారని విని అందరూ ఆశ్చర్యపోయారు కాని బిల్లు చెల్లించిన ఆ వ్యక్తి ఎవరు? అందరి మనసుల్లో మెదలిన ఆ ప్రశ్నార్థకాన్ని నివృత్తిచేశాడు ఓ అపరిచిత వ్యక్తి. "నేను చూశాను మీ అబ్బాయిని అడ్మిట్ చేసిన నాటినుండి ఒక వ్యక్తి బాగా ఉన్న వాడిలా ఉన్నాడు. మీ అబ్బాయిని చూస్తూ వెక్కి వెక్కి ఏడ్చేవాడు. అసలు విషయం

తెలుసుకుని నా కళ్లలో కూడా నీళ్లు తిరిగాయి. తన ఒక్కగానొక్క కుమారుడు అచ్చం మీ అబ్బాయిలాగే ఉండేవాడట. అర్నెల్ల క్రితం వాడు ప్రమాదంలో గాయపడి నాన్నా... నాన్నా.. అంటూ తన ఒడిలోనే ప్రాణాలు వదిలాడట. అది విని అతని భార్య గుండె ఆగి చనిపోయిందట, అప్పటి నుంచి ఇతర పిల్లలలో తన బాబును చూసుకుంటూ ఇలా తిరుగుతూ ఉంటాడట." ముగించాడు బరువైన హృదయంతో ఆ వ్యక్తి. "ప్రభూ! జగన్నాటక సూత్రధారీ ఓ అల్లాహ్! నీ లీలలు తెలుసుకొన మా తరమా?" అనుకుంటూ మున్నా మామయ్య కారులో కూర్చున్నాడు. కారు కదిలింది ఇంటికి.



మున్నాను అంతటా చూపించారు. వాడి తీరులో మార్పు అంతంతే. అన్నం తినిపించే దగ్గరి నుండి ఆలనాపాలనా అంతా తానై చూసుకుంటుంది అమ్మ. ఇంట్లోనే తిరుగాడుతూ ముస్తాబు చేయించుకుని ఓ చోట కూరోచటం మున్నా దినచర్య చూసిన వాళ్లంతా ఎంత అందంగా ఉన్నాడో!! దేవుడెందుకిలా చేశాడో అనుకునేవాళు ్ళ.

మానవ నైజం కూడా మహా విచిత్రమైంది. స్థైర్యంగా నిలబడగలిగితే అది ఎంతటి భీభత్సాన్నయినా ఎదుర్కొంటుంది. దానితో రాజీపడి జీవితం కొనసాగిస్తుంది. మారిన జీవితం మామూలై పోయింది. చీకటి తరువాత తెల్లవారడం ప్రకృతి సంప్రదాయం. ఇప్పుడు హసీనా బీటెక్‌తోపాటు ఎంబీఏ పూర్తి చేసింది. పెళ్లిచూపులు, మాటామంతీ అంతా జరిగిపోయాయి. అబ్బాయి హైద్రాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. అందం, అభ్యుదయ భావాలు, కాణీ కట్నం లేని పెళ్లి. పైగా అబ్బాయి అమ్మాయికి మహర్‌గా యాభైవేలు చెల్లించే విధంగా పెళ్లి నిశ్చయమైపోయింది.

అందరూ సంతోషించినా మున్నా విషయం అందర్నీ కలచివేస్తోంది. అక్క లేని మున్నాను ఊహించుకోలేకపోతున్నారు. వచ్చినవారు తమాషాకి మున్నాతో పాత డైలాగ్ వేసేవారు "మున్నా! వాళ్లు ఇక మీ అక్కను వాళ్ల ఊరికి తీసుకెళతారు. అప్పుడెలా?" అంటే మున్నాది అదే జవాబు. కాని ఇప్పుడు మాటలు సరిగా రావు. అయినా నత్తినత్తిగా ర..ర..ర.. అంటూ ఉంటే "అదేలేరా రక్తం చిందిస్తానంటావు" పూర్తి చేసేది హసీనా. అందరూ నవ్వుకునేవారు.

పెళ్లిరోజు రానే వచ్చింది. ఇంట్లో పెళ్లి సందడి మొదలైంది. పెళ్లి పనులు

యాంత్రికంగా జరిగిపోతున్నాయే కాని పెళ్లయి హసీనాను అత్తవారింటికి వీడ్కోలు చెప్పే సమయంలో మున్నా పరిస్థితిని ఊహించుకునే వారికళ్లు చెమర్చేవి. హసీనా తల్లి ముబీనా ఇంట్లో యాంత్రికంగా పనులు చేసుకుంటూ తిరుగుతోంది తడి ఆరని కళ్లతో. నికాహ్ తతంగం జరుగుతోంది. ముగ్గురు పెద్దలు వచ్చారు. పెళ్లి కూతురు ఉన్న గదిలో ప్రవేశించారు. తమ సందేశాన్ని వినిపించారు. వధువు నుండి అంగీకృత సంకేతం అందుకున్న మరుక్షణం తమ చేతుల్లో ఉన్న మహర్ పైకం యాభైవేలు వధువు చేతుల్లో పెట్టి వివాహ రిజిస్టరులో సంతకం కోసం ఆమె చేతికి పెన్ అందించారు. "పది నెలలు తన కడుపున మోసి పాలిచ్చి పెంచిన తల్లికి, గోరు ముద్దలు తినిపిస్తూ తన గోములన్నీ నగుమోముతో భరించిన నాన్నకు అనురాగం పంచిపెట్టిన ఆత్మీయులకు మూగ భాషను నేర్పిన ముద్దుల తమ్ముడు మున్నాకూ, తప్పటడుగులు వేసిన ఇంటికీ, కుప్పిగంతులు వేసిన వీధులకూ, వీధిలోని అందరూ ఆంటీలకు, అంకుళ్లకూ, మీ అందర్నీ ఒక్కసారిగా వీడి మరో ఊరికి వెడుతున్నాను. మీకిదే నా సలాం." అని వ్రాసి ఉన్న పత్రంపై సంతకం పెడుతున్న దానిలా తడబడి పోతున్న చేతితో వధువు సంతకం చేస్తూనే గదిలో కిక్కిరిసి ఉన్న మహిళలందరూ కంటతడి పెట్టారు. ఉద్వేగాన్ని భరించలేక కన్నీరు మున్నీరవుతున్న అమ్మ ఒడిలో వాలిపోయింది హసీనా. అంత వరకూ ఏమీ అర్థంకాని మున్నా అందరి వైపూ అమాయకంగా చూస్తూ భోరున ఏడ్వడం మొదలెట్టాడు.



గడియారపు ముళ్లు ఎప్పుడూ ఒకే చోట ఉండవు. నిరంతరం తిరుగుతూ జనాన్ని తమ వెంట పరుగులు తీయిస్తూ ఉంటాయి. సూర్యాస్తమయం అయిపోయింది. తిరుగు ప్రయాణానికి తొందర పెడుతున్నారు మగ పెళ్లివాళ్లు. వీడ్కోలు తతంగం ప్రారంభమయింది. బయలు దేరటానికి బస్సులు సిద్ధంగా నిలిచి ఉన్నాయి. మిగిలి ఉన్న ఆ కన్నీళ్లు కూడా తీసుకెళ్ళ అన్నట్లుగా వధువు తరపు బంధువులు కన్నీటి పర్యంతం అవుతున్నారు. ఒకొక్కరి వద్దకు వెళుతూ వారి చేతులను కన్నీళ్లతో తడుపుతూ ఉంది వధువు హసీనా. ఒక్కక్కరిని దాటుకుంటూ వెడుతూ ఉంది. ఆ దృశ్యాన్ని చిత్రీకరించటం ప్రపంచంలోని ఏ కెమెరాకు సాధ్యం కాదేమో! కెమెరాలు కనబడుతున్న దృశ్యాలను చిత్రీకరిస్తా కాని కరిగి కన్నీళ్లుగా స్రవిస్తున్న హృదయాలను అవి చిత్రీకరించలేవు. వరుడు తొలిసారిగా తన జీవిత భాగస్వామి హసీనా చేతిలో

చెయ్యివేసి బయట ఆగి ఉన్న బస్సువైపు నడక సాగించాడు. మేలి ముసుగుతో హసీనా తన జీవిత భాగస్వామి అనుసరిస్తూ తొలి అడుగు వేసింది. ఎంతకాలమో ఈ ప్రస్థానం అల్లాహ్‌కే తెలుసు.

అంతవరకూ ఏడుస్తూనే ఉన్న మున్నా ఒక్కసారిగా హసీనాను చుట్టేసుకుని వెళ్లకు..వెళ్లకు నేనూ నీ వెంట వస్తానక్కయ్యా అంటున్నట్టు చంటి పిల్లాడిలా భోరున విలపించసాగాడు. హసీనా పరిస్థితీ అలాగే ఉంది. అక్కడున్న వాళ్లు మున్నాను పక్కకు తీసుకెళ్లారు. బరువైన హృదయంతో బస్సెక్కింది హసీనా. వరుడు పక్కన కూర్చున్నాడు. బస్సు కదిలింది. అంతవరకూ పట్టుకుని ఉన్న వారిని వదిలించుకున్న మున్నా హసీనా కూర్చున్న వైపు ఉన్న విండో కడ్డీలు గట్టిగా పట్టుకోటానికి ప్రయత్నించాడు. అక్కడున్న వాళ్లు మున్నాను విడిపించారు. ఆ ప్రయత్నంలో మున్నా చేతికి చిన్న గాయమై నెత్తురోడింది. హసీనా తన వ్రేలికి తగిలిన ఆ రక్తపు మరకలో ర..ర..ర.. అంటున్నట్టు కనిపిస్తున్న మున్నా అమాయక ముఖాన్ని తదేకంగా చూస్తూ ఉండిపోయింది. బస్సు వేగం పుంజుకుంది. ఇవి తుచ్ఛమైన కట్నకానుకలతో కొనగల అనుబంధాలా? అనుకున్నాడు... అంతవరకు జరిగి తతంగాన్ని చూసి చలించిపోయిన వరుడు తన అంతరంగంలో...



# 19

# దోషం ధర్మానిది కాదు

షకీలా సునీత ఇద్దరి కుటుంబాలు ఐదేళ్లుగా ఒకే ఇంటి రెండు పోర్షన్లలో ఉండడం వల్ల ఏ కాస్త తీరుబడిగా ఉన్నా ఇద్దరూ కలిసి పిచ్చాపాటిగా మాట్లాడు కోవటం పరిపాటి ఇద్దరూ క్లాస్‌మేట్లు గ్రాడ్యుయేట్లు కావటం వల్ల ఇద్దరి మధ్య మంచి స్నేహబంధం. ఏ పండుగ వచ్చినా అది రెండిళ్లకు పండుగే. మతం ఏదైనా దానిలోని మంచిని అంగీకరించాలి. స్వీకరించి ప్రయోజనం పొందాలి అనే మనస్తత్వం సునీతది.

వారి భర్తలు ఆఫీసులకు, పిల్లలు స్కూళ్లకు వెళ్లిన తరువాత సునీత షకీల ఇంటికి వచ్చి లోకాభిరామాయణంలో పడటం మామూలే. సునీతతో ఎన్నాళ్లుగానో ఒక విషయం కదపాలనుకుంటున్నా షకీలాకు ఆరోజు అవకాశం దొరికింది. అంత వరకు జరుగుతున్న సంభాషణ తీరును ఒక్కసారిగా మార్చివేస్తూ సునీతా! ఒక్కమాట అడుగుతాను ఏమీ అనుకోవు కదా' అంది షకీల 'అదేమిటే ఈ వేళ అంతా కొత్తగా ఉంది నీ వాలకం... అడుగు' అంది వేళాకోళంగా సునీత.

"సునీతా! స్త్రీ జాతి పాలిట ఘోరశాపంలాంటి సతీసహగమన దురాచారం సమసిపోయిందని స్త్రీ జాతి ఒకింత ఊపిరిపీల్చుకుంది. పెళ్లయి వారం తిరక్కుండానే భర్త చనిపోయినా మీ చెల్లికి ఇటీవలే పునర్వివాహం చేసి ఆ నిర్భాగ్యురాలి నిండు జీవితాన్నీ అర్థంలేని మూఢాచారానికి గురికాకుండా కాపాడారు. మొన్న మన పక్క వీధి గోపాలరావుగారు చనిపోతే వారి శవయాత్రలో వెంట ఉన్న జనం గత మూఢ సాంప్రదాయాలను వదిలి పాడెకు భుజం మార్చుకుంటూ కనీసం మానవ ధర్మాన్ని చాటారు." అంటూ ఆగిపోయింది షకీల.

"నిజమే.... కానీ, అసలు విషయమేంటో చెప్పు అంది సునీత.

"ఇస్లాంకు పూర్వం సమాజంలో ఉన్న దురాచారాలు ఒక్కొక్కటి కాలక్రమంలో మార్పు చెందటం వెనుక పరోక్షంగా ఇస్లాం స్ఫూర్తి ఉందని నా అభిప్రాయం, నువ్వేమంటావ్ సునీత కళ్లల్లోకి సూటిగా చూస్తూ ప్రశ్నించింది షకీల.

"ఊఁ .... ఇంకా అంది సునీత సర్దుకొని కూర్చుంటూ ఇంకా వినాలనే ఉత్సుకత కనబరుస్తూ.

"చూడు సునీతా... అటు చూడు..." అంటూ ఆరుబయట సునీత పిల్లల బట్టలను చూపిస్తూ "నీవు పిల్లలకు ఎంపిక చేసుకున్న ఆ షర్ట్ షల్వార్ ఆడపిల్లలకు ఎంత అనువుగా, అందంగా ఉంటాయో అవి కూడా ముస్లిం సంస్కృతి చిహ్నాలే" అంది షకీల.

"నిజమే..." మెల్లిగా నవ్వుతూ అంది సునీత ముక్తసరిగా.

"సునీతా... ఇప్పుడు చెప్పు... ఇస్లాం సంస్కృతిలోని మంచిని పరోక్షంగా సమాజం ఇంతగా స్వీకరిస్తున్నప్పుడు మానవ నిజ ధర్మం అయిన ఇస్లాంను పూర్తిగా ఎందుకు స్వీకరించరాదు? నీ అభిప్రాయం ఏమిటి?" ధైర్యం కూడగట్టుకొని అమాయకంగా అడిగింది షకీల సునీతతో ఆమెకున్న చనువుకొద్దీ.

అంతవరకూ ఓపికగా వింటున్న సునీత షకీల ప్రసంగాన్ని మెచ్చుకుంటున్నట్టు నవ్వుతూ వెంటనే మూడ్ మార్చుకొని "చూడు షకీలా దాన్ని గురించి ఎన్నాళ్లుగానో నేను కూడా నీతో మాట్లాడాలనుకుంటున్నా, సరే నువ్వే కదిపావ్ ఐనా నా జవాబు నీ ప్రశ్నలోనే ఉంది. ఇస్లాంలో మంచిగా తోచిన వాటిని ఒకరు చెప్పకుండానే స్వీకరించడానికి అభ్యంతరంలేని నాకు గాని, నాలాంటి చాలా మందికిగాని దాన్ని పూర్తిగా స్వీకరించటానికి మాత్రం అభ్యంతరం ఏముంటుంది? కాకపోతే ఇస్లాంలో ఉన్న మిగతావాటిని ముస్లింలు సరిగా ప్రదర్శించలేకపోతున్నారనుకుంటా!"

"అంటే...?" అడిగింది షకీల ప్రశ్నార్థకంగా.

సమాధుల వద్ద సాష్టాంగపడే ముస్లింలను చాలా మందిని చూశాను. అందుకు నగరంలోని అసంఖ్యాక సమాధులే సాక్ష్యం. కొన్ని ముస్లింల ఇళ్లల్లో ఏవేవో చిత్రపటాలకు ఆరాధనా భావంతో పూలువేయుట అగరొత్తులు వెలిగించటం చూశాను. మొహరంలో తాజియాల ఎదుట గుండెలు బాదుకుంటూ అమానుషంగా రక్తం చిందించుకోవటం చూశాను. నువ్వేమో అల్లా తప్ప మరే ఆరాధ్య దైవం లేదు అనేది ఇస్లాం మూల సిద్ధాంతం అంటావు. క్రమశిక్షణ ఇస్లాం ఊపిరి అంటావు శుభలేఖలో అచ్చువేసిన సమయానికి జరిగిన నిఖా నేను ఇంత వరకూ చూడలేదు. నిరీక్షణ ... నిరీక్షణ గంటలకొద్దీ నిరీక్షణ. ముస్లింల పెళ్లికి వెళ్ళాలంటే ఒక పెద్ద బోర్‌గా ఉంటుంది. ఇస్లాంలో వరకట్నం లేదు అంటావు, నిజం చెప్పు ముస్లింలు వరకట్నం

తీసుకోవటంలేదా? అంతెందుకు నీ పెళ్లి కట్నం లేకుండా జరిగిందా? దుబారా ఖర్చు అవిహితం అంటారు, ముస్లింల వివాహాల్లో జరిగే ఆర్భాటాలలో దుబారా అంతా ఇంతా కాదు. సత్యవాక్ పరిపాలనకు ఇస్లాం ఎంతటి ప్రాధాన్యత ఇస్తుందో నువ్వే ఎన్నో సార్లు సోదాహరణంగా వివరించావు మరి గుండె మీద చెయ్యి వేసుకొని చెప్పు ఎంత మంది ముస్లింలు పాటిస్తున్నారు. ఇస్లాంలో అవిహితమైన ఈర్ష్య, అసూయ, ద్వేషం అంతఃకలహాలకు ఎంతమంది ముస్లింలు అతీతులో చెప్పగలవా? వ్యక్తిగత సామాజిక జీవితాలలో ఇస్లాం శాసించే, ఆశించే నైతికత ముస్లిం సమాజంలో ప్రతిబింబించటం లేదు ఎందుకని? ఇలాంటి..." "సునీతా అవన్నీ నిజమే అనుకున్నా ఆ దోషం ధర్మానిదా? ధర్మం ఏం చెబుతూ ఉంది చూడడం ముఖ్యం" మధ్యలోనే అందుకుంది షకీలా.

"నిజమే షకీలా, దోషం ధర్మానిది కాకపోవచ్చు. కాని దానిని ఆచరిస్తున్న వారి జీవన విధానం ద్వారానే అది ఇతరులకు పరిచయమవుతుంది. ఇక ధర్మం ఏం చెబుతుందో చూసే విషయానికి వస్తే.. హుఁ... ముస్లింలు ఎప్పుడైనా ఇతరులకు ఆ అవకాశం ఇచ్చారా? ఖుర్ఆన్ సర్వమానవాళి కోసం అవతరించిన గ్రంథం అంటూనే ఆ గ్రంథానికి ఇతరులకు అంటరానివారుగా చేశారు. ఒకసారి ఒక ముస్లిం వద్ద తెలుగు అనువాదపు ఖుర్ఆన్ ఉందని తెలిసి అడిగితే... ఆ మహాను భావుడు నీళ్లు నములుతూ... ఆ గ్రంథాన్ని శుచిగా ఉన్నవారే ముట్టుకోవాలంటూ నన్ను అంటరానిదానిలా చూశాడు. నీకు తెలుసుగా నేను ఎంత శుచిగా ఉంటానో ఆ మాటలకు అక్కడ నాకు జరిగిన అవమానానికి నేనెంత కుమిలిపోయానో అతనికి అర్థం కాదు. నిజం చెప్పాలంటే ఆ తరువాత ఏ ముస్లిం వద్ద ఆ గ్రంథాన్ని అడగాలనిపించటం లేదు."

"ఇస్లాంలో ఆరాధనా పద్ధతి ఎలా ఉంటుందో చూడ్డానికి మా వారు ఒకసారి మసీదుకు వెళితే అక్కడున్నవారు వారిని లోనికి రానివ్వకుండా వచ్చీ రాని తెలుగులో ఇది మీది కాదు పో" లోపలికి రాకూడదు అంటూ బయటికి పంపించారట షకీలా నీవేమనుకున్నా అప్పటి నుండి ముస్లింలంటే ఎందుకో నాకున్న మంచి అభిప్రాయం సన్నగిల్లింది..... అల్లా అందరి ప్రభువు... అంతిమ ప్రవక్త సర్వమానవాళికి కారుణ్యమూర్తి అంటూనే ఇది మీది కాదు.... పో అంటారు.... ఏమిటో అర్థం కాదు...." కోపం ఉద్రేకం విసుగు సునీతలో స్పష్టంగా కనబడుతున్నాయి.



# ౨౦

# అమూల్యం

ఓ సంక్షేమ సామ్రాజ్యానికి పట్టపు రాకుమారి సజ్వా నాజ్. ప్రపంచంలోని అందం, ఆనందం, అనురాగం, ఆప్యాయ తలన్నీ ఒకేసారి అమృతంలో కలయబోసి చేసిన అందాల రాశి సుల్తానా సజ్వానాజ్ మహజబీన్. పేరుకు వజ్రఖచిత సింహాసనాన్ని అధిష్టించిందేకాని ఆ అందాల కోమలాంగి తన ప్రజా హృదయ పీఠాలపై పరివేష్టితమై ఉంది. వారి మనో మందిరాలలో మయూరిలా విహరిస్తూ ఉంది. దైవం ఆమెకిచ్చింది ఒకే ప్రాణం కాని ఆ సామ్రాజ్యంలోని కోట్లాది ప్రజలకు ఆమెయే ప్రాణం.

మిసమిసలాడే పదహారేళ్ళ యవ్వనప్రాయంలో అడుగుపెట్టిననాడు సమస్త సామ్రాజ్యం సంబరాలు చేసుకుంది. అజాత శత్రువైన ఆ సౌందర్యరాశికి ఒకే ఒక్క శత్రువు స్వయానా తన అందం. ఆ అందాలరాశికి జోడైన అందాల యువకుడెవ్వడూ లేడు ఆ రాజ్యంలో. అంతఃపుర పరివారపు అభ్యర్ధనలు, మంత్రుల హితోక్తులు, జనగాణాల అభిష్టాలను వినమ్ర తతో స్వీకరిస్తూ తనదైన ఒక సహేతుకమైన షరతుతో స్వయంవరానికి సిద్ధపడి మహా మంత్రిని ఆజ్ఞాపించింది. 'మహా మంత్రీ' రాజ్యంలో చాటింపు వేయించండి. ఈ లోకంలో అన్నింటికన్నా విలు వైనది మా సమక్షంలో సమర్పించినవారిని వివాహమాడటానికి మేము సిద్ధంగా ఉన్నామని. ఆ యువకుడు ఎవరైనా కావచ్చు కటిక పేదవాడైనా సరే. 'చిత్తం రాజకుమారీ ఆజ్ఞ'. 'వెళ్ళండి మేము మా విశ్రాంత మందిరానికి వెడుతున్నాం, సభ పరిసమాప్తం.



రోజులు గడిచాయి. ఆనాటి సభా ముఖానికి రాజకుమారి వేంచేస్తున్నారు. వంది మాగధులు అందుకున్నారు. 'కోమల సామ్రాజ్య శ్రేష్ట వంశాంకురం, సర్వ జనహితైషి, ప్రజాసేవాతత్పర పిపాసిని, బాధాసర్పదష్ట జనోద్ధరణి సత్సమాజ నిర్మాణాభిలాషిణీ సామ్రాజ్య పట్టపు రాకుమారి సుల్తానా సజ్వానాజ్ మహా జబీన్ సభా సదనానికి వేం చేస్తున్నారహో' అంటూ దండక ఘోషలు మారుమోగాయి.

వేయి చందురుల అందాల ముఖారవింద భారానికి మోము ఒకింత వాలిపోయిన చందాన మేలి ముసుగుతో రత్నఖచిత సింహాసనంపై ఆశీనులయ్యారు పట్టపు రాకుమారి.

'రాజకుమారికి జయము జయము... "ఏమిటి విశేషం మహామంత్రీ..." 'మన ప్రకటన విని ఓ యువకుడు వచ్చాడు రాజకుమారీ'... 'ప్రవేశపెట్టండి... పరదా...' అంటూ ఆజ్ఞాపించింది రాకుమారి ఎడంచేత్తో తెరవైపు సైగ చేస్తూ.

'యువకా! ప్రపంచంలోని అన్నిటికన్నా విలువైనది... ఏం తెచ్చావు?'

'యువరాణీ ఏ అందాన్ని చూసి ప్రపంచం లోని అందాలన్నీ అసూయతో కుమిలి పోతాయో అలాంటి తమ అందంకన్నా ప్రపంచంలో విలువైనది ఏముం టుంది...? ఇంకా ఏదో అనబోగా మధ్య లోనే అందుకొని చిరుకోపంతో, 'యువకా!.. చాలించు నీ వ్యర్థ ముఖస్తుతి 'మహామంత్రీ... ఇతణ్ణి అవస్యమే మా సమక్షం నుండి తొలగించండి.

పరదాల ఆవల మబ్బుల మసకన చంద్రికలా కనిపించిన ఆ అందాల రాకుమారి ముఖారవిందం ఆ యువకుని మనోఫల కంపై చెరగని ముద్రవేసింది. అహెూ రాత్రులు అన్వేషణ సాగించి సాధించిన మరో అమూల్యమైన దానితో తిరిగి వచ్చాడు. కొలువులో ప్రవేశం లభించింది.

'యువకా! ఈసారి ఏ విశేషాన్ని తీసు కొచ్చావ్'... అడిగింది రాకుమారి అధికార స్వరంతో.

'రాకుమారీ తమను సమాధానపరచగల అమూల్య వస్తువు అన్వేషణలో వెడుతూ ఉంటే, మన పక్క దేశంలో ఒక నేరస్తుణ్ణి ఉరికంభానికి ఎక్కించేముందు నేరస్తునితో 'నీ చివరి కోరికేమిటని' అడిగారు. అందుకు ఆ నేరస్తుడు ఆ జన సమూహంలో ఓ తల్లిచంకన ఉన్న ముద్దుల బాబును ఒకసారి ముద్దాడనివ్వండి 'ఇదే నా చివరి కోరిక' అన్నాడు. అందుకు అంగీకరించగా ఆ నేరస్తుడు ఆ తల్లి చంకన ఉన్న బాబు బుగ్గలపై ముద్దుల వర్షం కురిపిస్తూ ఉంటే అంతకంటే జోరుగా వర్షిస్తున్న కన్నీటితో ఆ నేరస్తుడు బాబు కళ్ళల్లోనికి ఆకలిగా చూస్తూ 'బాబూ.. నా జీవితమొక రక్తసిక్త ప్రహసనం... హృదయం కఠినపాషాణ శిలా సదృశ్యం. బాబూ...! పాపిష్టి డబ్బు కోసం ఈ కసాయి చేతులతో నీలాంటి అమాయక లేత సిరిమల్లె మొగ్గలెన్నింటినో నిర్దయగా నలిపివేసి, ఏ పాపమెరుగని వాళ్ళ కన్నవారి కన్నీళ్ళను

కడుపునిండా తాగిన నరరూప రాక్షసుణ్ణి నేను. ఎందరో చిన్నారుల తల లను తాటికాయల్లా త్రెంచివేసిన తుచ్ఛుణ్ణి నేను... ఆ దేవుని సమక్షాన నిలబడబోయే సమయం ఇక నాకు ఎంతో దూరంలేదు.అందుకే నిన్ను వేడుకుంటున్నాను, ఆ బాబులందరి తరఫున నీవు నన్ను క్షమించు... క్షమించు నాన్నా క్షమించు. నా చివరి క్షణాల్లో ఈ కాస్తంత తృప్తితోనైనా వెడతాను బాబూ చెప్పు... క్షమించానని నీ అమాయక చూపుతో ఓ చిన్న సైగనైనా చెయ్యి తృప్తిగా వెడతాను' అంటూ ఆ బాబును గుండెలకు హత్తుకొని భోరు మంటూ ఉంటే రాజభటులు వచ్చి అతని నుండి ఆ బాబును లాక్కొని తల్లికి ఇచ్చివేసి అతణ్ణి ఉరికంభమెక్కించారు. లిప్తపాటులో అతని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

చలించిపోయిన రాజకుమారి చెమ్మగిల్లిన కళ్ళతో 'యువకా! ఈ విగారక విషయం మా హృదయాన్ని కలిచివేసింది. అసలు విషయానికి దీనికి ఏమిటి సంబంధం..? 'వచ్చిన విషయం వేగిరం చెప్పు... తెచ్చిన ఆ అమూల్యమైనదేమిటో సత్వరమే చూపించు' అంది. 'చిత్తం రాజకుమారీ... క్షంతవ్యుణ్ణి... ఇదిగో ఇటు చూడండి. ఇంతకంటే అమూల్యమైనది ప్రపంచంలో మరేది కాగలదు?' అంటూ తన కుడిచేతి చూపుడువేలిపైనున్న ఓ బిందువును చూపిస్తూ ఉంటే, 'యువకా, మా సమ యాన్ని వృధా చేస్తున్నావు. అది ఒక నీటి బిందువు అదెలా... మాట పూర్తికాక ముందే అందుకొని 'క్షమించండి రాజకుమారి ఇది నీటి బిందువే కాని దైవ భీతితో చితికిపోయిన పరితప్త హృదయం భోరున విలపిస్తూ కార్చిన ఆ నేరస్తున్ని కన్నీటి బిందువు. దేవునికి ఎంతో ప్రియ మైన బిందువు. 'ఆ యువకుని గంభీర స్వర పలుకులకు క్షణంపాటు సభ స్తంభించిపోయింది. సభాసదుల గుండెలు కంపించిపోయాయి. 'యువకా! మేము అంగీకరిస్తున్నాము. ఇది విలు వైనదే, సందేహం లేదు. అయినా ఇంతకంటే విలువైనది మరొకటేదో ఉందని మా అంతరంగం మాతో చెబుతూ వుంది... వెళ్ళు వెతికి తీసుకురా మేము నీకు మార్గం చూపమని దైవాన్ని వేడుకుంటాం...' అంటూ సింహాసనం నుంచి లేచారు రాజ కుమారి. ఆనాటి సభ అలా ముగిసింది.

❖ ❖ ❖

అంగబలాన్నైతే దేవుడు అన్ని జీవులకు ప్రసాదించాడు. మనోబలాన్ని మనిషికి మాత్రమే ఇచ్చాడు. ఆ మనోబలంతో మనిషి నిరంతర సృష్టిని శోధిస్తూనే ఉంటాడు. దొరికిన విజయాలను ఒడిలో వేసుకుంటూ అపజయాల నుండి 'అప'

అనే అక్షరాలను తొలగించుకోవటానికి విశ్వ ప్రయత్నాలు చేస్తూనే తన జీవన ప్రస్థానాన్ని కొనసాగిస్తూ ఉంటాడు.

అనుకున్నది సాధించటానికి అహో రాత్రులు పిచ్చివాడిలా తిరిగాడు ఆ యువకుడు. అంతకంటే అమూల్యమైనది మరేదీ ఉండదని అతనికి అనిపించింది. అమితానందంతో అవశ్యమే రాజకుమారి కొలువుకు చేరుకున్నాడు. విషయం తెలుసుకున్న రాజకుమారి ఆ యువకుణ్ణి సభలో ప్రవేశపెట్టమంది.

'రాజకుమారి గారికి జయము జయము..' పలికాడు

"యువకా! ఈసారి ఏం తెచ్చావు అది అన్నింటికన్నా అమూల్యమైనదిగా ఉండాలి సుమా!...

మా సమయాన్ని ఊరక వృథా చేయకు.

'చిత్తం రాజకుమారీ! నిద్రాహారాలు మాని అహర్నిశలు తిరుగుతూ ఒక ఊరు చేరు కున్నాను. అక్కడ ఓ పెద్ద జనసమూహం మూడు రోజులుగా ధార్మిక సమావేశం జరుపుకుంటూ ఉంది. అంతా వివిధ ప్రదేశాల నుండి వచ్చినవారు వేళ తప్ప కుండా ఆరాధనలను ఆచరిస్తున్నారు దైవనామస్మరణలో నిమగ్నులై ఉన్నారు. చూస్తూ ఉండగానే ఘోర అగ్ని ప్రమాదం జరిగింది. చాలామంది అగ్నికి ఆహుతై పోయారు. అంటూ ఉంటే మాట మధ్యలో అందుకొని... "యువకా! నిజమే ఈ విషాద విషయం ఆనాడే మా దృష్టికి వచ్చింది. ఆనాటి నుంచి మా మనసు కలతగా ఉంది. వారి కోసం మేము దేవుణ్ణి ప్రార్థించాము. వచ్చిన విషయం... మాట పూర్తికాకముందే అందుకొని 'రాజకుమారీ' ఇదిగో ఇటు చూడండి. ఇంతకంటే అమూల్యమైంది ఏముంటుంది?' అంటూ ఓ గుడ్డలో చుట్టుకొని తెచ్చిన దాన్ని విప్పి చూపిస్తూ ఉంటే "యువకా! ఏముంది అది వట్టి బూడిదేగా? 'రాజ కుమారీ ఇది మామూలు బూడిద కాదు. దైవారాధనలో బూడిదైపోయిన ఎన్నో పవిత్ర ఆత్మల సుగంధమిది. "కాదనము.. హృదయ పూర్వకంగా అంగీకరిస్తాము, ఐనా మా మనసులో ఇంకా ఏదో వెలితిగానే ఉంది. ఇంతకన్నా అమూల్యమైనదేదో ఉండాలని మా అంతరంగం చెబుతూ ఉంది. మా మనసు సమాధానపడేవరకు మా ఆత్మను వంచించుకో లేము. మమ్మల్ని ఏలుకునే యువకుడు మా మనసును సంపూర్ణంగా తృప్తిపరిచే వాడుగా ఉండాలి. వెళ్ళు... అలసిపో లేదను కుంటే అన్వేషణ కొనసాగించు... అంటూ సభ నుండి నిష్క్రమించారు రాజకుమారి.

❖ ❖ ❖

మనిషి దేనినైతే అమితంగా అభిమానిస్తాడో, దానిని సాధించడమే తన జీవిత లక్ష్యంగా చేసుకుంటాడో, అది సాధించగలేని తన జీవితాన్ని శూన్యంగా భావిస్తాడో, దానిని సాధించటంలో తన ప్రాణాన్ని సైతం తృణప్రాయంగా భావి స్తాడో ఆ తపన, ఆ అంకితభావ సౌందర్యా నికి విజయం సింగారించుకుని అతని ఒడిలో వాలుతుంది.

ఆకులు రాలిన చోటనే కొత్త చిగురులు వేయటం, కారుచీకట్లు తొలిగి కాంతి రేఖలు విరియటం, గ్రీష్మం ముగిసి వర్షం రావటం ప్రకృతి ధర్మం. ఇష్టాయిష్టా లతో ప్రమేయం లేకుండా వాటిని అనుసరించటం, అనుభవించటం మానవ ధర్మం. ఓ మాసం గడిచిపోయింది, తిరిగి వచ్చాడు ఆ యువకుడు. యాంత్రికంగానే కొలువు తీరింది రాజకుమారి.

'యువకా!... ఈసారి ఏమిటి? అంది రాజకుమారి అర్థమనస్కంగా... 'చిత్తం! రాజకుమారీ... అదో భీషణ సంగ్రామం. పోరాటంలో ఇరువైపులా సైనికులు పండుటాకుల్లా నేలరాలిపోతున్నారు. పదిరోజులుగా నిరంతరంగా సాగుతున్న సంగ్రామమది. ఒక వర్గానికి శతృసైన్యంతో సమతుల్యత లేకపోయినా పోరాటం హెూరుగా సాగుతూ ఉంది. ఒకచోట యాభై శతృసైనికుల మధ్య ఒంటరిగా మెరుపులా పోరాడుతున్నాడు ఒక యువకుడు. కొదమ సింహంగా గర్జిస్తూ పోరాటం సాగిస్తున్న ఆ యువకుని కరవాల ఝుళిపింపులకు శతృసైన్యం కకావికలమైపోతూ ఉంది. శత్రువుల తలలు తాటికాయల్లా ఒక్కొక్కటిగా నేలరాలుతున్నాయి. దూరం నుండి విసురుతున్న శత్రువుల శరాఘాతాలకు ఆ యువకుని అవయవాలు ఒక్కొక్కటిగా తెగిపడుతున్నాయి. అప్పటికే తనను చుట్టుముట్టి పోరాడుతున్న ఆ యాభై సైనికులంతా ఒక్కొక్కరుగా అంతా నేలకొరిగారు. తెగిపోయిన ఆ యువకుని అవయవాల స్థానంలో రక్తం ధారగా స్రవిస్తూ ఉంటే తడబడుతూ ఉండగా శత్రు సైనికులు వెనుక నుంచి బల్లాలతో ఖడ్గాలతో ఆ యువకుడి దేహాన్ని ఛిద్రం చేశారు. ఆ కొదమ సింహం నేలకొరిగింది. సత్సమాజ నిర్మాణానికి సత్యధర్మ స్థాపనకై జరిగిన ధర్మ యుద్ధంలో అమరుడైన ఆ యువకుడి రక్తాన్ని దైవదూతలు ఆకాశానికెత్తుకెళ్ళారేమో అన్నట్టు ఆకాశం ఎర్రబడింది. కళ్ళు తెరుచుకునే ఉన్నాయి ఆకాశం వైపు చూస్తూ పైవాడితో 'ప్రభూ! అనంత కరుణామయా!! నీవు ప్రసాదించిన ఈ ప్రాణం నీకే అర్పితం. ప్రభూ! నీసాక్షి... నీవు సృష్టించిన ఈ సృష్టి సాక్షి... నీవు వాగ్దానం చేసిన... నేను ఆశించిన నీ అనుగ్రహం సాక్షి... నీ స్వర్గం సాక్షి... ఈ

ధర్మ యుద్ధంలో నీవు ప్రసాదించిన ప్రాణం నీ ధర్మ సంస్థాపనకై అస్తమించిపోతున్న ఈ క్షణంలో నాలో కలుగుతున్న ఈ ఆత్మ సంతృప్తికి, మరణంలోని ఈ కమ్మదనానికి ఏ స్వర్గ సుఖాలు సాటిరావు. ప్రభూ! సత్య ధర్మ సంస్థాపనకై సత్యాసత్యాల మధ్య జరిగే ఇలాంటి ధర్మ యుద్ధాలలో పదే పదే ప్రాణత్యాగం చేస్తూ ఈ అమృత మాధుర్యాన్ని పదేపదే ఆస్వాదిస్తూనే ఉండాలనిపిస్తూంది' అంటున్నట్టుగా ఉంది. అంతవరకూ తెరుచుని ఉన్న ఆ యువకుడి కళ్ళు తెరుచుకున్నట్టే ఉన్నాయి. 'అల్లాహు అక్బర్!' అంటూ అధరాలు కంపిస్తూఉండగా ఆ యువకుడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి. రక్తంతో తడిసిన అమరవీరుడి కనురెప్పలను నా మునివేళ్ళతో... యువకా!... చాలించు ఆ తరువాత ఒక అక్షరం కూడా విని భరించే శక్తి నా గుండెకు లేదు అంటూ కన్నీరు మున్నీ రవుతూ కళ్ళను చెరుగుతో వొత్తుకుంటూ గద్గద స్వరంతో... యువకా! మరి ఆ అమూల్య.. మాట పూర్తికాకముందే అందుకుని 'రాజకుమారీ! ఇదిగో ఇది నా చేతికి అంటిన ఆ యువకుని రక్తపు మరక ఇంతకంటే అమూల్యమైనది ఈ సృష్టిలో ఏదైనా ఉందా?

"లేదు..లేదు.. లేనేలేదు... అంటూ గట్టిగా విలపిస్తూ ఉన్న ఆ రాజకుమారి స్వరం ఆ యువకుని గంభీర స్వరంలో కలిసి పోయింది. ఊరడిల్లటానికై ప్రయత్ని స్తూనే... 'మహామంత్రీ! చిత్తం రాజకుమారీ... 'మహామంత్రీ ఇకపై నన్ను అలా సంబోధించకండి కుమారీ... అని పిలవండి చాలు. నేను నా ప్రజల బిడ్డను ఇకనుండి ప్రజలంతా నన్ను ఆ పేరుతోనే పిలవాలి..మరోమాట.. ఈ క్షణం నుంచే ఈ రాచరిక వ్యవస్థను రద్దు చేస్తున్నాను. ఇది ప్రజల రాజ్యం ప్రజలే దీని పాలకులు. ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికలు జరిపించండి. ఈ రాజ్యాధికారాన్ని ప్రజల చేతుల్లో పెట్టండి. నా తండ్రి స్థానంలో ఉండి మీరే ఆ యువకునితో నా వివా హాన్ని ఏదైనా మసీదులో నిరాడంబరంగా జరిపించండి. ఇన్నాళ్ళుగా ఇలా సాగు తున్న ఈ రాజసభ ఈనాటితో ముగిసింది శాశ్వతంగా. నన్ను ఇన్నేళ్ళుగా ప్రాణంకన్నా మిన్నగా చూసుకున్న ప్రియమైన మా ప్రజలకు అస్సలాము అలైకుమ్ వ రహ్మాతుల్లాహి వబరకాతు. అంటూ సింహా సనం దిగి అంతఃపురంలోనికి వెళ్ళి పోయింది మాజీ రాజకుమారి సజ్వానాజ్.



# 21

# జీవిత సత్యం

ఆ మరునాడు ఆదివారం– సెలవు కారణంగా ఆ రోజు ప్రభుత్వ ఆసుపత్రిలో రద్దీగా ఉంది. అంత పెద్దదీ కాదు, మరీ చిన్నదీ కాదు. ఆ పట్టణానికి తగ్గట్టుగా ఓ మోస్తరుగా ఉన్న ఆ ఆసుపత్రి పదిమంది డాక్టర్లు తదితర సిబ్బందితో నడుస్తోంది.

అందమైన ముదురు ఎరుపు రంగు ప్లిమత్ కారు ఆసుపత్రి ఆవరణలో ఆగగానే అంతవరకూ అటూఇటూ కదలాడుతున్న జనసంచారం ఒక్కసారిగా ఆగిపోయింది. అందరి కళ్లు ఆ కారుపైనే నిలిచాయి. అలాంటి అందమైన కారు ఆ ఊళ్లోనే కాదు ఆ జిల్లాలో అదొక్కటే. అది పట్టణ మునిసిపల్ ఛైర్‌మెన్‌ది. ఆ కారు కన్నా అందమైన ఓ పాతికేళ్ల యువతి చైర్‌మెన్‌గారి భార్య ఆ కారు లోంచి దిగుతుందని అందరికీ తెలుసు. అందుకే అందరి కళ్లు ఆ అందగత్తె కోసం చూస్తున్నాయి. డ్రైవర్ డోర్ తెరిచాడు లేడిలా బయటకి గంతేసింది ఆ యువతి. అంతవరకు కదులుతున్న మనుషులే ఆగిపోయారు ఇప్పుడు ఆ మనుషుల కళ్లు కూడా కదలికలు లేకుండా ఒకింత ఆగిపోయాయి.

అందానికి తగ్గ అలంకరణలతో తన అందం ద్విగుణీకృతమైతే ఆమెలో అహం మూడు పువ్వులు ఆరు కాయలుగా కాస్తూ ఉంది. తాను అందగత్తెననే గర్వానికి వంత పాడుతున్నట్లు అందాల పోటీలో జిల్లా అందాల రాణి బిరుదు ఆమెను వరించింది. ఆమెలో అందం, అహం పడే పోటీలో అహందే పైచేయిగా ఉంటుంది అందరూ ఆమె వైపే చూస్తూ ఉంటే మరీ గర్వంతో మెట్లను చక చకా దాటేసుకుంటూ మెడికల్ ఒ.పి. అని వ్రాసి ఉన్న గది లోనికి ప్రవేశించింది.

"హలో డాక్టర్...."

అంతవరకు రోగిని పరీక్ష చేస్తున్న డాక్టర్ రషీద్ ముక్తసరిగా "కూర్చోండి" అంటూ మళ్లీ రోగిని పరీక్షించటంలో నిమగ్నుడయ్యాడు. తను కూర్చోతగ్గ కుర్చీ అక్కడ ఏదీ లేదనే అహంకారానికి తోడు తన అందానికి, అంతస్తుకు అందరూ

జోహార్లు పలుకుతూ ఉంటే డాక్టర్ రషీద్ మాత్రం మొదటి నుండి తనను నిర్లక్ష్యంగా చూడటం తన ఎయడ ప్రత్యేక శ్రద్ధ చూపకపోవటం పట్ల అతన్ని కసితీరా దులిపెయ్యటానికీ, తనంటే ఏమిటో అర్థమయ్యేలా చేయటానికీ సమయం కోసం ఎదురుచూస్తున్న ఆ యువతికి డాక్టర్ తీరుపై ఆగ్రహం హెచ్చింది. అశాశ్వితమైన తన అందంపై ఆమెకున్న అహంకారాన్ని అణచివేయాలని డాక్టర్ రషీద్ కూడా ఎంతో కాలంగా ఎదురు చూస్తున్నాడు.

అక్కడ ఇంకా మిగిలి ఉన్న ముగ్గురు రోగులను పరీక్ష చేస్తూ తనను పట్టించుకోకుండా ఉన్న డాక్టర్‌పై ఆ అందాల రాశికి కోపం అంతకంతకూ పెరిగిపోతూ ఉంది. రోగులంతా వెళ్లి పోయేటప్పటికి పన్నెండు కావస్తూ ఉంది. చేతులు కడుక్కొని తీరిగ్గా టవల్‌తో తుడుచుకుంటూ తన కుర్చీలో కూర్చొని టేబుల్‌పై ఉన్న ఎక్స్‌రే కవర్లపై పేర్లను ఒక్కొక్కటిగా చదువుతున్నాడు ఎక్స్‌రే కోసం. ఆమె డాక్టర్‌వైపు తీక్షణంగా చూస్తూ ఆ పక్కనే ఉన్న కుర్చీని కోపంగా లాక్కొని డాక్టర్ ఎదురుగా కూర్చుందామె. ఆమె గులాబి బుగ్గలు కోపంతో మరింత ఎర్రబడ్డాయి. పరిస్థితిని గమనించిన డాక్టర్ ఆమెకు గుణపాఠం చెప్పటానికి కొంతకాలంగా ఎదురు చూస్తున్న అవకాశం ఆసన్నమైందనుకున్నాడు. భరించరాని ఆలస్యం అవుతున్నా ఇంకా మౌనంగా ఎక్స్‌రేలు పరీక్షగా చూస్తున్న డాక్టర్ రషీద్‌పై ఆ యువతికి కోపం కట్టలు తెంచుకుంది.

"డాక్టర్...! ఏమిటి మీ ఉద్దేశం... ఏమిటి ఈ నిర్లక్ష్యం?... నేనెవరనుకున్నారు? కోపం, అహం, గర్వం మూడు ఏక కంఠంతో గర్జించాయి.

ఉద్దేశ్యమా?.... సదుద్దేశ్యమే.... ఇక మీ విషయమంటారా? మీరు నా పేషంట్, నేను మీ డాక్టర్ని... ఇంకా ఏదో అనబోయేలోగా మధ్యలోనే అందుకుంది

"అంతేనా?...'

"అంతగాక మరేమిటి"?

నేను చైర్‌మెన్ భార్యను..."

"కావచ్చు?"

"నేను ఈ జిల్లాకే అందాల రాణిని..."

"దైవానికి కృతజ్ఞత తెలుపుకోండి...." అన్నాడు ముక్తసరిగా

"నా అందాన్ని చూసి జనం పిచ్చివాళ్లయిపోతారు."

"పిచ్చివాళ్లు పాపం..."

ఆవేశంలో గుక్క తిప్పకుండా వేస్తున్న ప్రశ్నలకు డాక్టర్ ఇస్తున్న సూటి సమాధానాలు పట్టించుకోకుండా ప్రశ్నల వర్షం కురిపించింది ఆ యువతి. నేనెంతసేపయింది వచ్చి.... ఇంకా ఏదో అనబోతూ ఉండగా మధ్యలోనే అందుకొని ఆమెను శాంతపరచటానికి ప్రయత్నిస్తూ అన్నాడు డాక్టర్.

"చూడండి....! ఎందుకలా ఆవేశపడతారు.... "నేను డాక్టర్ని. నాకు పేషంట్స్ అందరూ సమానమే. వారి వ్యాధులకు చికిత్స చేయటమే నా ధర్మం. వారి అందాలతో, ఆస్తులతో, అంతస్తులతో నాకు నిమిత్తం లేదు. ఇంతవరకు నేను పరీక్షించిన పేషంట్స్ మీ కంటే ముందునుంచే ఇక్కడ కూర్చుని ఉన్నారు. మిమ్మల్ని కాదని మీ తరువాత వచ్చిన వారిని పరీక్షించలేదు కదా? ఛైర్‌మెన్ భార్యనన్నారు, మీలాంటి ఆర్థిక స్తోమత గలవాళ్లు అవసరమనుకుంటే ఎంతైనా ఖర్చుచేసి ఎక్కడైనా వైద్యం చేయించుకోగలరు. మీలాంటి వాళ్లకోసం గుక్కెడు గంజికి నోచుకోని ఆ అభాగ్యులను విస్మరించటం ధర్మం కాదు. అలా అధర్మంగా ప్రవర్తిస్తే నేను నా పరిధుల్ని అతిక్రమించినట్లవుతుంది. ఆ లోకంలో నేను దైవానికి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

అందాల రాణిని అన్నారు. మీరు అందంగా ఉండటంలో మీ గొప్పతనమేమిటో అర్థం కావటం లేదు. మిమ్మల్ని అలా అందంగా మీరే మలచుకున్నారా? మిమ్మల్ని ఇంత అందంగా సృష్టించిన దైవాన్ని స్తుతించండి మిమ్మల్ని ఇంతకన్నా అందంగా సృష్టించి అంధురాలిగా చేసి ఉంటే ఏం చేసేవారు? మీ అందాన్ని మీరు చూసుకునే అవకాశం కూడా ఉండకపోయేది. అలా జరగనందుకు ఆ దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి గాని అందం.... అందం..... అందం.... హుఁ.... వయసు మళ్లితే అంతర్ధానమైపోయే ఈ అశాశ్విత అందంపై ఎందుకీ అహంకారం?..... డాక్టర్ రషీద్ చెబుతూ ఉంటే టేబుల్‌పై వేలితో సున్నాలు చుడూతూ మూతి ముడుచుకుంటూ వింటున్న ఆ యువతి ఆ మాటల్లోని సత్యాన్ని గ్రహిస్తున్నట్టుగా కనిపించినా ఆ ప్రభావంపై ఆమెలోని అహం అధిగమిస్తూనే ఉంది.

డాక్టర్....! నాకు కావలసింది మీ సుభాషితాలు కావు... నా వ్యాధికి మందు....

నా అందం చాలా మంది కళ్లలో గుచ్చుకుంటున్న విషయం నాకు తెలుసు...." అంది భావగర్భితంగా ఎత్తిపొడుపుగా. ఆమె మాటల్లోని అంతర్యాన్ని గ్రహించి మెల్లిగా నవ్వుకుంటూ తన ఎదురుగా ఉన్న ఎక్సరే ల్యాబిపై నాలుగైదు ఎక్సరే ఫిలిమ్‌లను జాగ్రత్తగా జోడిస్తున్నాడు డాక్టర్ రషీద్. జోడిస్తున్న ఆ ఫిలిమ్‌లవైపే తదేకంగా చూస్తూ ఉందామె. డాక్టర్ ఆ ఫిల్ములను అలా ఎందుకు జోడిస్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు. గదంతా నిశ్శబ్దం ఆవరించింది. ఉన్నట్టుండి బయట మబ్బులు దట్టంగా కమ్ముకోవటం వల్ల గదిలో లైట్ వెలిగించాడు డాక్టర్. ఉరుముల శబ్దంతో జోరుగా గాలి వీస్తుంది. గదిలో బల్బు ఆర్పివేయటం, ఎక్స్‌రే ఫిల్ములు అమర్చిన ల్యాబిలైట్ వెలిగించటం ఏక కాలంలో జరిపించాడు డాక్టర్.

ఎక్స్-రే ల్యాబీపై వికృతంగా కనిపిస్తున్న మానవ అస్థిపంజరాన్ని చూస్తూనే కెవ్వున కేకపెట్టి వణికిపోతున్న ఆ యువతికి ఆ చల్లటి వాతావరణంలో కూడా ముచ్చెమటలు పోసినై "డాక్టర్!...ఏమిటిది...? ఈ భయంకర రూపాన్ని నేను చూడలేను.... నాకు భయంగా ఉంది.... ఆఫ్ చేయండి" అంటూ రెండు చేతులతో కళ్లు గట్టిగా మూసుకుంది. నవ్వుతున్నాడు డాక్టర్. "డాక్టర్ ఏమిటిది? మీకు నవ్వులాటగా ఉందా? ప్లీస్ పుట్ ఇట్ ఔట్...ఆ ఎక్స్-రే ల్యాబీని ఆఫ్ చేయండి..." అంది ఆమె.

"అదేంటీ?.... అపురూపమైన మీ అందాన్ని చూసి మీరే భయపడితే ఎలా?" అన్నాడు డాక్టర్ చిన్నగా నవ్వుతూ.

"ఏమిటి మీరంటున్నది...? నేను అంత భయంకరంగా ఉన్నానా?" అంది తీక్షణంగా.

"కాదు, మీరు భయంకరంగా లేరు... కాని భయంకరంగా కనిపిస్తున్న ఆ రూపం మాత్రం మీదే" అన్నాడు డాక్టర్ ముక్తసరిగా.

"మీ మాటలు నాకేమీ అర్థం కావటం లేదు. అంది కళ్లు పెద్దవిగా చేసి డాక్టర్ వైపు చూస్తూ"

"నాలుగు రోజుల క్రితం మీకు కొన్ని ఎక్స్-రేలు తీశానా"?...

"అవును"

" ఆ ఎక్స్-రేలన్నీ జోడిస్తే ఏర్పడిన ఈ అస్థిపంజరం మీదే... ఇప్పుడు

చెప్పండి.... దేన్ని చూసి మీ అహంకారం?" సస్పెన్స్‌ను క్లియర్ చేస్తున్నట్టుగా చెప్పాడు డాక్టర్. ఫెళఫెళమంటూ గుండెలు ఆగిపోయేలా శబ్దంతో అక్కడెక్కడో పడ్డ పిడుగు తన గుండెలపైనే పడ్డట్టనపించిందామెకు. ఒక్కసారిగా ఉలిక్కిపడింది. కుర్చీలోంచి మెల్లిగా లేస్తూ ఎక్స్-రే ల్యాబీపై కనిపిస్తున్న అస్తిపంజరం వైపు ఓరగా చూస్తున్న ఆమెకు ఎదురుగా ఒకవైపు నల్లరంగు కిటికీ అద్దంలో తన ముఖం కనిపించింది. ఇటు అద్దంలో తన ముఖాన్ని అటు ఎక్స్-రే ల్యాబీపైని అస్తిపంజరాన్ని పదే పదే చూస్తూ ఉంది జీవితసత్యాన్ని కాచి వడబోసిన అనుభూతిని ఒక్కసారిగా ఆస్వాదించినట్టనిపించింది ఆమెకు. ఆమె పరివర్తిత హృదయం పశ్చాత్తాపంతో ద్రవించిందనిపిస్తున్నట్లు ఆమె కళ్లల్లో నీళ్లు నిండాయి. ఆ కన్నీటి తెరల్లోంచి అస్తిపంజరాన్ని చూస్తూ ఇంతకాలంగా తాను సింగారించుకున్నది ఈ అస్తిపంజరాన్నేనా?.... విలువైన పట్టు వస్త్రాలు చుట్టింది ఈ ఎముకల గూటికేనా? దేన్ని చూసి ఈ అహంకారం....? ఎందుకీ అహంభావం?.... ఈ ఎముకల చట్రానికి ఒకింత కండచుట్టి ఎన్నో అందాలు సృష్టించిన దైవమా! నీకివే నా సహస్ర స్తోత్రమాలిక అంటూ భక్తి భావంతో ఆమె కళ్లు మూసుకుంది. కనురెప్పల ఒత్తిడికి జారిన కన్నీళు చెక్కిళ్లపై జాలునారుతూ ఉంటే కంపిస్తున్న ఆమె అధరాలు అప్రయత్నంగా ప్ర....భూ... అన్నాయ్ "అమ్మగారూ.... పిలిచారా....?" అంటూ వచ్చాడు డ్రైవర్. డాక్టర్ వ్రాసిన మందుల చీటిని యాంత్రికంగా అందుకొని "వస్తాను డాక్టర్ గారూ" అంటూ తలపై చెరుగు వేసుకొని నమ్రతగా వెళ్లిపోయింది ఆమె.





# ధర్మ సంస్థాపనార్థాయ

అది పోలీస్ గెస్ట్‌హౌస్. ఎలిమెంటరీ స్కూల్‌లోని తన శిష్యుడు రమేష్ నిరుపేద కుటుంబంలో నుంచి వచ్చి అలా ఎదిగి ఎదిగి పోలీస్ ఐ.జి.రమేష్‌బాబుగా మారిపోయినా, గుర్తుంచుకొని తన కారును పంపి తనను పిలిపించుకున్న తన శిష్యుణ్ని ఇన్నేళ్ల తరువాత చూడబోతున్నందుకు రిసిప్షన్‌లోని సోఫాలో కూర్చుని మురిసిపోతున్న మేస్టారు రవూఫ్ ఖాన్ గారితో, "తమర్ని దొరగారు పిలుస్తున్నారు రండి" అంటూ సవినయంగా తీసుకెళ్లి ఏ.సి.గది తలుపు డోర్ తెరిచారు, ఆ ఊరి పోలీస్ ఇన్స్‌పెక్టర్.. బాత్‌రూంలో నుంచి వస్తూ "నమస్తే సార్! ఎలా ఉన్నారు. నన్ను గుర్తుపట్టారా? నేను... రమేష్‌ని, మీరు ఆదరించి ముద్దుగా పిలుస్తూ ఉండిన "రమ్ము" గాడిని అంటూ పాదాభివందనం చేయబోయిన రమేష్‌ను వారిస్తూ భుజాలు పట్టుకొని లేపుతూ అతని గురుభక్తికి ముగ్ధుడై అతణ్ణి ఆపాదమస్తకం తనివితీరా చూస్తున్న మేస్టారు రవూఫ్‌ఖాన్‌గారి కళ్లు ఆనందంతో చెమ్మగిల్లి అప్రయత్నంగానే పెదవులపై చిరునవ్వు వెలిసింది.

ఓ అర్ధగంట సాగిన వారి సంభాషణలో పదిసార్లు పలుకరించిన సెల్‌ఫోన్ స్విచ్ ఆఫ్ చేస్తూ ఒత్తిడిలో కనిపించిన రమేష్ "మేష్టారూ! చదువుకునే రోజుల్లో అది చేయకు, ఇది చేయకు అంటూ మీరు నన్ను ఎన్నో చీవాట్లు పెట్టేవారు.. రైల్వే ప్లాట్ ఫారమ్‌పై కూలీ పని చేసైనా బ్రతుక్కో కాని పోలీస్ డిపార్టుమెంటులో మాత్రం చేరకు" అంటూ ఆనాడు ఒక దెబ్బ వేసి ఉంటే ఎంత బాగుండేది అనిపిస్తూ ఉంది" అంటూనే నవ్వారు రవూఫ్ మాస్టర్.

నైతిక పతనంతో కుళ్లిపోయిన సమాజంలో జరుగుతున్న నేరాలను ఘోరాలను ఏకరువు పెడుతూ తన గుండె బరువు తగ్గించుకోటానికేమో అన్నట్లు మొదలు పెట్టారు ఐ.జి.గారు. "మేష్టారూ! చదువుకుంటున్న రోజుల్లో మీరు నాకు చెప్పిన మానవీయ విలువలు ఈ సమాజంలో మచ్చుకైనా కనిపించటం లేదు. మనుషుల్లోని

ధనదాహం దేశాన్ని క్రిస్‌మస్ కేక్‌లా తినేస్తూ ఉంది. కావరమెక్కిన కామం కసికందులను సైతం విడువకుండా నమిలి మింగేస్తూ ఉంది, పగ, ప్రతీకారాలకు మనుషుల తలలు తెగిన తాటికాయల్లా రాలిపోతున్నాయి. వొలువలూడిన మానవీయ విలువలు సిగ్గుతో వొదిగిపోతున్నాయి. ప్రతి ఒక్కడూ ఏదో ఒక నేరం చేస్తూ ఉన్నాడు. ఈ సమాజాన్ని సంస్కరించవలసిన వారు సైతం నోటికి తాళం వేసుకొని అన్నింటికన్నా పెద్ద నేరం చేస్తున్నారు. ఇక్కడ ఎవరి ధన, మాన, ప్రాణాలకు భద్రతలేదు... పరిస్థితులు ఎంత భయంకరంగా ఉన్నాయంటే శాంతిభద్రతలు కాపాడవలసిన మా పోలీస్ డిపార్ట్‌మెంట్ సైతం తన భద్రతకై వెతుక్కోవలసివస్తూ ఉంది. నైతిక పతన వరదలో ఇలా కొట్టుకోపోతున్న సమాజం ఎక్కడ తేలుతుందో అర్థంకాక తలలు పట్టుకొని కూర్చోవటం మావంతయిపోయింది" అంటూ మాస్టారు కళ్లల్లోకి చూశాడు రమేష్. అంతవరకు తాను వెలిబుచ్చిన ఆందోళన అసలు సమస్యయే కాదు అన్నట్టు తన చిరునవ్వుతోనే సమాధానమిచ్చినట్లు కనిపించిన మేష్టారు, సావధానంగా, "రమేష్! ఇదంతా మనిషి తన సృష్టికర్త దైవం తనకు ప్రసాదించిన జీవన విధానాన్ని తిరస్కరించి తన మనోభిష్ట జీవనాన్ని ఎంచుకున్న దుష్ఫలితం... మనిషి దైవం కోరే జీవన విధానాన్ని ఆచరించగలిగితే ఓ సత్సమాజ సంస్థాపనం ఏనాటికైనా సాధ్యమే." అది వింటూ నీరసంగా నవ్వుతున్న రమేష్‌తో, "రమేష్! నీకు తీరిక ఉంటే ఓ అర్థగంట నాతో వస్తావా? అన్న మేస్టారుతో "అలాగే సార్... మీతో గడపాలనే ఉద్దేశంతోనే సాయంత్రం వరకు నేను ఏ ప్రోగ్రాం పెట్టుకోలేదు... పదండి" అంటూ ఇద్దరూ లేచి పోర్టికో వద్ద ఉన్న కారువైపు వెళ్లారు. నగర శివారులో విశాలమైన మైదానంలో ఎన్నో షామియానాలు, లౌడ్‌స్పీకర్ శబ్దాలు, ఓ వెయ్యికిపైగా జనం, ఏదో సమావేశం జరుగుతూ ఉంది. లంచ్ వేళ కాబోలు అంతా కోలాహలం కనీస అవసరాలు తీర్చే అన్ని వసతులతో ఓ కుగ్రామంలా ఉంది ఆ ప్రాంగణం. లోనికి వెళ్లి ఆపవలసిన చోట కారు ఆపి జనంలో తిరుగుతున్నారు మేస్టారుతోపాటు రమేష్. జనం కాస్త పలుచగా ఉన్న స్నానాల విభాగంలో ఒకచోట మేష్టారు తన జేబులోని పర్స్ తీసి రమేష్‌కు ఇస్తూ "రమేష్ ఇందులో పైకం ఎంత ఉంది లెక్కపెట్టు." "ఐదు వేలా, మూడు వందలా యాభై" అంటున్న రమేష్ నుండి ఆ పర్స్‌ను అక్కడే అలా జార విడిచి "ఇక అటువైపు పద" అంటూ అటా వెడుతూ తన కళ్లజోళ్లను, రిస్ట్‌వాచ్‌ను, శాలువను పెన్నును అక్కడక్కడా జారవిడుస్తూ వెళ్లి ఒకచోట ఆగి, "రమేష్, నీ

జేబులోని ఆ పెన్ ఇవ్వు" అంటూ తీసుకొని దాన్ని అక్కడే జారవిడిచి ఆ దగ్గరే ఉన్న టీ కొట్టు వైపునకు నడిచారు మాస్టారు.

రమేష్‌కు అంతా అయోమయంగా తోచి, "మేష్టారూ, ఏమిటిదంతా విలువైన వస్తువులన్నీ అలా పారేశారు... మాట పూర్తికాక ముందే అందుకున్న మాస్టారు రమేష్‌కు టీ గ్లాసు అందిస్తూ.. తాపీగా "రమేష్ ప్లీజ్ కాస్సేపు ఓపిక పట్టు" అంటూ తాగుతున్న టీ ఇంకా పూర్తి కాకుండానే లౌడ్ స్పీకర్‌లో "దయచేసి వినండి, ఈ సమావేశ ప్రాంగణంలో అక్కడక్కడా దొరికిన ఒక పర్సు, శాలువ, పెన్ను, ఓరిస్ట్‌వాచ్, కళ్లజోడు ఓ బాల్‌పెన్ మా వద్దకు చేరాయి. వాటి స్వంత దారులు మా ప్రకటనల విభాగం వద్దకు వచ్చి వాటిని తీసుకెళ్లాలని మనవి" అంటూ పదేపదే ప్రకటించడం జరుగుతూ ఉంటే, "రమేష్ వెంటరాగా మేష్టారు అక్కడికి చేరుకొని ఆనవాలు చెప్పి వాటిని తీసుకొని, "థ్యాంక్స్" అంటూ అలా నడుస్తూ పర్స్‌లోని నోట్లను లెక్కపెట్టి సరిగ్గా ఉన్నాయని తెలుసుకున్న రమేష్ బాబుకు ఆశ్చర్యంతో మాట పెకలటం లేదు. శాలువను చుట్టుకుంటూ, కళ్లజోడును సరిచేసుకుంటూ పెన్ను జేబులో పెట్టుకుంటున్న మాష్టారు కళ్లల్లో నింపారిన తృప్తితో "ఏం రమేష్! అన్నీ సరిగ్గా ఉన్నాయిగా? ఇక వెడదాం పద" అంటూ ఉంటే, "మాష్టారూ... వెళ్లడం అటుంచండి. ముందు ఈ విషయం చెప్పండి, ఇది ఏ పుణ్యస్థలం? ఇక్కడ ఉన్న జనం ఎవరు? నేనెక్కడున్నానో నాకే అర్థం కావటం లేదు.. ఇది కల కాదు కదా?..... ఏమిటిదంతా చెప్పండి మాష్టారూ" అడిగాడు రమేష్.

మాష్టారు తృప్తిగా చిరునవ్వులు చిందిస్తూ, "రమేష్! మనం మన భారతదేశంలోనే, మన ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నాం. ఇక్కడ తిరుగాడుతున్నది దైవదూతలేమీకాదు, మనలాంటి జనమే.... ఇంకా ఏదో అనబోతూ ఉండగా మధ్యలోనే అందుకుంటూ, "మరి ఈ నీతి, నిజాయితీల..." అంటున్న రమేష్‌ను మధ్యలోనే అందుకొని, "ఆఁ... అది అడగవలసిన ప్రశ్నే."

"ఇక్కడ జరుగుతున్నది ఒక ధార్మిక సమావేశం. ఇక్కడ ఉన్న జనం దైవభీతి పునాదులపై శీల నిర్మాణం గావించుకొని, ఒక సంక్షేమ సమాజ స్థాపనకై కృషి చేస్తున్న ఒక స్వచ్ఛంద సంస్థకు చెందినవారు. వారు ఆశించే ధర్మసంస్థాపనకు ఆచరణాత్మకమైన ఒక మచ్చుతునక ఈ ప్రాంగణం.

మరో విషయం ఇక్కడ రెండు వందలకు పైగా మహిళా సభ్యులు కూడా ఉన్నారు కాని చూస్తున్నావుగా ఒక్కరూ కనిపించటం లేదు. వారు ఉండవలసిన చోట ఉన్నారు. పైగా ఇక్కడ ఒక్క పోలీసూ లేడు. "బాబూ రమేష్ ఇప్పుడు చెప్పు ఈ ఊరేకాదు, ఈ రాష్ట్రం, ఈ దేశమంతా ఈ ప్రాంగణంలోలా ధర్మసంస్థాపనం చేయాలన్న ఈ సంస్థ ఆశయం నేరమా?"

"అంతకన్నా కావలసిందేముంది మాష్టారు గారు! ప్రభుత్వాలు లక్షలాది కోట్లు ఖర్చు పెడుతున్నది ఇలాంటి ఒక నేర రహిత సమాజాన్ని సృష్టించుకోటానికేగా? అయినా వాటి కలలు కల్లలుగానే మిగిలిపోతున్నాయి. స్వచ్ఛందంగా ఇంతటి మంచి మనుసుల మనుషులను తీర్చిదిద్దుతున్న ఈ సంస్థకు ఈ దేశం ఎంతో రుణపడి ఉంది" అని మాట్లాడుకుంటూ వెళ్లారు. వారి కారు ఆ ప్రాంగణ ముఖద్వారం దాటుతూ ఉండగా ఆ పసిడి మనుషుల సమూహాన్ని మరొకసారి చూడాలనిపించి వెనుదిరిగి చూస్తే ఆ ముఖద్వారానికి అత్యంత సుందరంగా వ్రాయబడిన ధర్మసంస్థాపన సంఘం ఆంధ్రప్రదేశ్ మండల సర్వసభ్య సంస్థాగతా సమావేశం శిక్షణా శిబిరం, నిజామాబాద్" అని కనిపించిన అక్షరాలను పదేపదే చదువుకున్నాడు పోలీస్ ఇన్స్‌పెక్టర్ జనరల్ రమేష్‌బాబు.



# ౨౩

# ఒకే దైవం ఒకే ప్రజ

అది సనా సూపర్ స్పెషాలిటీ కార్డియక్ హాస్పిటల్. బైపాస్ ఆపరేషన్లలో నూరుశాతం విజయం నమోదు చేసుకున్న నగరంలోని ఏకైక హాస్పిటల్ అది. అమెరికాలో శిక్షణ పొంది అక్కడే కొంతకాలం పని చేసి స్వదేశం తిరిగి వచ్చిన డాక్టర్ సాదత్ నేతృత్వంలో నిపుణులతో కూడిన వైద్యుల బృందంతో ఆ హాస్పిటల్‌కు మంచి పేరుంది. ఆధ్యాత్మిక భావాలుగల డాక్టర్ సాదత్ నిగర్వి, సౌమ్యుడు. ఆ హాస్పిటల్‌లో వార్డు బాయి మొదలుకొని అందరితో కలుపుగోలుగా వారిలో ఒకరుగా మెలగటం డాక్టర్ సాదత్ గారి నిరాడంబరతకు ప్రతీక. ఉదయం నమాజు అనంతరం ఖుర్ఆన్ పారాయ ణంతో ఆయన దినచర్య ప్రారంభమవు తుంది.

ప్రతిరోజులాగే ఆనాటి బైపాస్ ఆపరేషన్‌కు అంతా సిద్ధమైంది. ఆపరేషన్ థియేటర్ లోనికి వెళ్ళే ముందు బయట వేచి ఉన్న వారందరిని చిరునవ్వుతో పలుకరిస్తూ పేషంటు బంధువులకు ధైర్యం చెప్పటం ఆయన మంచితనానికి అద్దం పట్టేది.

ఐదు గంటలు పట్టే ఆపరేషన్ అది. అనుకోని అరుదైన సమస్యలు ఎదురై ఓ గంట ఆలస్యమైనా విజయవంతంగా ముగిసింది. థియేటర్ బయట ఫలితం కోసం ఆతృతతో వేచి ఉన్నవారికి ఆయన చిరునవ్వే సమాధాన మయింది.

ఆపరేషన్ అయిపోయాక తోటి డాక్టర్లతో తనకు ఎంతో ఇష్టమైన హెూటల్ నుండి తెప్పించిన టీ తీసుకోవటం ఆయనకు అల వాటు. ఆపరేషన్ విజయవంతం కావాలని ఆపరేషన్‌కన్నా ముందూ, విజయవంతంగా, ముగిసిన తర్వాత దైవానికి కృతజ్ఞత తెలు పుతూ నమాజు సలపటం ఆయన సాంప్ర దాయం, ఆ తతంగమంతా ముగించుకుని తృప్తిగా టీ సేవిస్తూ తోటి డాక్టర్లతో ఇందాకటి ఆపరేషన్ గురించి మాట్లాడుకుంటున్నారు. కాస్త సద్దుమణిగాక ప్రతి ఆపరేషన్‌లో

థియేటర్ బాయ్‌గా సేవలందిస్తున్న ప్రసాద్, డాక్టర్ సాదత్‌తో ఉన్న చనువు కొద్ది 'సార్! ఎప్పటినుంచో తమతో ఒక విషయం అడగా లని ఉంది. కానీ..... మధ్యలోనే అడ్డుకున్న సాదత్, ఇంత ఆలస్యం చేయడమే తప్పు ఇంకా ఆలస్యం దేనికి? ఊఁ... అడుగు... ' అంటూనే అక్కడున్న డాక్టర్లతోపాటు సాదత్ కూడా నవ్వుల్లో సృతి కలిపారు. అది, సిబ్బంది తో తన కలుపుకోలుతనానికి ఓ మచ్చుతునక. మీ వెంట ఉండి, మీరు చేసిన గుండె ఆపరేషన్లు ఎన్నో చూశాను. వారిలో అన్ని కులాలు, మతాల వారున్నారు. ధనవంతులున్నారు. పేదవాళ్ళూ, నల్లవాళ్ళు, తెల్లవాళ్ళున్నారు. అందరి శరీరాల్లో అన్ని భాగాలూ, అన్ని అవయవాలూ ఆవగింజంతయినా తేడా లేకుండా ఎక్కడివక్కడే ఉండి ఒకే విధంగా ఒకే తీరుగా కదులుతున్నాయి.... ఈ మాయ ఏమిటో అర్థం కావటంలేదు. అమాయకంగా అడిగాడు ప్రసాద్. డాక్టర్ సాదత్ సర్దుకుంటూ 'చాలా మంచి ప్రశ్న అడిగావు, ఈ ఒక్క ప్రశ్నకు సరైన సమాధానం తెలుసుకుని మసలుకోగలిగిన నాడు మానవాళికంతా శుభదినమవుతుంది. ... అంటూ తను కూర్చున్న రివాల్వింగ్ ఛేర్ నుండి లేచి ఆ ప్రక్కనే ఉన్న పెద్ద కిటికీ నుండి స్పష్టంగా కనిపిస్తున్న దృశ్యాన్ని చూడమంటూ ప్రసాద్‌కు అటువైపు దృశ్యాన్ని చూపించారు.

'అక్కడేం కొత్తదనం ఉంది.... మనం ప్రతి దినం చూస్తున్నదే కదా సార్..... అది బజాజ్ స్కూటర్ల షోరూం. కొత్త స్టాక్ వచ్చినట్టుంది.... అబ్బబ్బ ఎన్ని స్కూటర్లో' అన్నాడు, వందల సంఖ్యలో ఉన్న ఆ స్కూటర్లను చూస్తున్న ప్రసాద్.

ప్రసాద్! వాటి ఆకారంలో తేడాలేమైనా నీకు కనిపిస్తుందా? అడిగాడు డాక్టర్. ఎందుకుంటుంది సార్?....రవ్వంత కూడా ఉండదు. ఖరాఖండిగా చెప్పాడు ప్రసాద్.

'ఎందుకని?' ప్రశ్నించాడు డాక్టర్

'ఎందుకేంటి సార్?' వాటిని తయారుచేసింది ఒకే కంపెనీ కదా? జవాబిచ్చాడు ప్రసాద్.

'ఒకేవిధంగా ఉన్నవన్నీ ఒకే కంపెనీల్లోనే తయారై ఉంటాయంటావ్?...

'అంతేకదా సార్...'

'ఇందాక నువ్వడిగిన ప్రశ్నకు సమాధానమూ అదే... మానవుల్నందరినీ

సృష్టించిన దేవుడు ఒక్కడే కాబట్టి, దేహంలోని అవయవ నిర్మా ణమూ అవి పని చేసే తీరూ ఒక్కటిగానే ఉంటుందంటూ డాక్టర్ గారు ఇచ్చిన సమా ధానంతో గదిలో ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరిం చింది.

డాక్టర్ గారి సమాధానంతో ఆలోచనలో పడి పోయాడు ప్రసాద్. 'ఏమిటి దీర్ఘంగా ఆలో చిస్తున్నావ్'. అడిగారు డాక్టర్ నవ్వుతూ. 'తమరు చెప్పింది విన్న తరువాత దేవుడు ఒక్కడే అనే సత్యం వాడికి అర్థమైపోయి నట్టుంది. వాడి గది నిండా వ్రేలాడుతున్న ఎన్నో ఫోటోల్లో ఇప్పుడు ఏది ఉంచాలో ఏది తీసెయ్యాలో అర్థంకాక ఆలోచనలో పడి పోయాడల్లే ఉంది." అన్నాడు అక్కడే ఉన్న మరో వార్డ్‌బాయ్ నవ్వుతూ... నిశ్శబ్దంగా ఉన్న ఆ గది నుండి బయటికి వెళ్ళిపోయాడు చెరగని అదే ఆలోచనతో ప్రసాద్.



# ౨4

# ఇదేమి ఆచారం?

"ఎక్కడికెళ్లావురా... నీ కోసం ఈపాటికి రెండు సార్లు వచ్చి పోయాను" అంటూ ఖాన్ సాహెబ్ గేటు తెరుచుకుని లోపలికి వచ్చారు. కూర్చోమంటూ ప్రక్కనున్న కుర్చీ చూపిస్తూ" బయటి నుండి ఇప్పుడే వచ్చాను, ఏమిటి విశేషం? ఊరకరారు ఖాన్ సాహెబ్ గారు" అన్నాను నవ్వుతూ.

"అదే.... షమీమ్ పెళ్లి విషయం....."

"అవునూ ఆనాడు మాటా మంతీ అయిపోయిందిగా?" మాట పూర్తి కాకుండానే అందుకున్నాను.

"అదేరా... ఈ వేళ సాయంత్రం నాలుగు గంటలకు అబ్బాయి వాళ్లు వస్తున్నారు."

"మళ్లీ దేనికిరా. ఒరేయ్ మీరు నిజంగా నవాబులేరా!... ఇంకా పెళ్లీలేదు పెటాకులూ లేవు ఆడవాళ్లు ఒకసారి, పిల్లలు ఒకసారి, బంధువులొకసారి అని ఈ పాటికే అబ్బాయి తరఫువాళ్లు నాలుగుసార్లు వచ్చిపోయారు... వచ్చిన ప్రతిసారీ వంటలూ వార్పులు... పెళ్లి కంటే ముందే ఒక మినీ పెళ్లి అయిపోయేట్టుంది" ఖాన్ సాహెబ్ బాధ చూడలేక నేనే ఖర్చు భరిస్తున్న వాడిలా అనేశాను.

"నవాబులం కాదు. న...బా...బులం అను అంటే బట్టకు బువ్వకు లేనివాళ్లం అనీ అర్థం. ఒరేయ్ రిటైరయిన తరువాత నీవు నేను ఈ సమాజాన్ని తీరిగ్గా సంస్కరిద్దాం గాని మధ్యాహ్నం మూడు గంటలకల్లా ఇంటికి వచ్చేయ్. సుశీలమ్మను కూడా తీసుకురా. మరిచిపోకు" అని చెప్పి ఖాన్‌సాబ్ కుర్చీలోంచి లేచాడు.

పదేళ్ల కిందటి మాట. ఈ వీధికి నేను వచ్చిన కొత్తలో ఖాన్ సాహెబ్ కుటుంబం మాకు ఎంతో సహాయంగా నిలిచింది. ఖాన్ సాహెబ్ భార్య మంచికి మారుపేరు. నా భార్య కాయలాతో ఆసుపత్రిలో ఉన్న కాలంలో ఖాన్ దంపతులు పిల్లల్ని వాళ్ళింట్లోనే ఉంచుకొని వారి పిల్లల్లా చూసుకున్నారు. ఖాన్‌సాహెబ్ భార్య ఆసుపత్రిలో నా భార్యకు అన్నివిధాలా పరిచర్యలు చేస్తూ నా ఆప్తులను మరిపించింది. ఖాన్‌సాహెబ్

కోఆపరేటివ్ డిపార్టుమెంటులో గుమస్తాగా పనిచేస్తున్నాడు. ముగ్గురు కూతుళ్లు, ఇద్దరు కుమారులు. ఇంట్లో అంతా భక్తిశ్రద్ధలుపాటిస్తూ ఇల్లంతా ఎప్పుడూ ఒక మంచి వాతావరణంతో కళకళలాడుతూ ఉంటుంది. వారి అలవాట్లు, మంచితనాన్ని చూస్తే ప్రతి ముస్లిం ఇలా ఎందుకు ఉండదు? అనిపిస్తుంది. ఖాన్ సాహెబ్ దంపతుల మనసు సువిశాలమయినట్లే ఇంట్లో పేదరికమూ సువిశాలంగా పరచుకొని ఉంటుంది. ఉన్నంతలో అతికష్టంగా ఇద్దరి కూతుళ్లకు పెళ్లిచేయగా మిగిలిన ఒక్క అమ్మాయి పెళ్లి ఇటీవలే నిశ్చయమయింది. ఖాన్‌సాహెబ్ ఎదుటివారి కష్టాలనయితే పంచుకుంటాడు కాని తన కష్టాలు ఎవరికీ చెప్పుకోడు. పెళ్లికి పైకం ఎలా సమకూర్చుకున్నాడో ఏమో.

"ఇక లేవండి భోజనం వడ్డిస్తున్నాను" శ్రీమతి గొంతు విని ఒక్కసారిగా ఈ లోకానికి వచ్చాను. భోజనాలు ముగించుకొని నేను నా భార్య పక్క వీధిలోని ఖాన్ సాహెబ్ గారింటికి వెళ్లాము. ఖాన్‌సాహెబ్ ఎదురొచ్చి "రండి.. రండి.. అంతా వచ్చేశారు. మీ కోసమే ఎదురుచూస్తున్నాం." అంటూ ఆహ్వానించాడు. "రా... అత్తయ్యా!" అంటూ ఖాన్ సాహెబ్ కూతురు 'షాహిన్ నా భార్యను పక్క గుమ్మం గుండా ఇంట్లోకి తీసుకెళ్లింది.

ఖాన్ సాహెబ్ నన్ను అక్కడ ఉన్న వాళ్లకు పరిచయం చేశాడు. వారిలో నాకు బాగా పరిచయం వున్న వాళ్లు కూడా వున్నారు. ఇంతలో నా స్నేహితుడు ఉస్మాన్ కూడా వచ్చేశాడు. అందరం కలిసి రాజకీయాలు అవి ఇవీ పిచ్చాపాటి మాట్లాడుకున్నాం. కాస్సేపటికి ఇద్దరు పిల్లవాళ్లు ట్రేలో టీ కప్పులతో ప్రత్యక్షమై అందరికీ టీ ఇచ్చారు.

"అందరూ వచ్చినట్లేనా ఇంకెవ్వరయినా రావాలా?" ప్రారంభించాడు ఉస్మాన్.

"మా వాళ్లయితే అందరూ వచ్చారు. ఇక రానలసిన వాళ్లెవరూ లేరు. "పెళ్లి కొడుకు వారి నుండి ఒక కంఠం జవాబిచ్చింది.

పెళ్లికుమారుని తండ్రి, ఇంకా నలుగురు పెద్ద మనుషులు సాంప్రదాయ సిద్ధంగా గడ్డాలు, తలపాగలతో పెద్ద మనుషుల తరహాగా ఉన్నారు. కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది.

"ఈ సమావేశం ఎందుకు ఏర్పాటు చేశారు. ఇప్పుడు ఏం జరుగుతుంది." అడిగాను ఉస్మాన్‌తో మెల్లిగా తెలుసుకుందామని.

"దీన్ని మంగ్‌నీ అంటారు. ఇచ్చిపుచ్చుకోవటాలు, పెళ్లి తేది నిశ్చయిస్తారు" అన్నాడు ఉస్మాన్. ఒకాయన వస్త్రాలు నగ నట్రా వగైరా గురించి ముందే జరిగిన ఒప్పందాన్ని వినిపించాడు. అంతా సవ్యంగా ఉంది అని ఇరుపక్షాల వారు అంగీకరించారు. ఇంతలో ఖాన్ సాహెబ్ ఏదో సైగ చేశాడు. ఒకాయన ఒక వస్త్రం కప్పబడిన పళ్లెం తీసుకొచ్చి ఆ పెద్ద మనుషులలో ఒకరికి అందించాడు. అందులో ఏముందో అన్న కుతూహలంతో ఆవైపే రెప్పవాల్చకుండా చూస్తూ ఉండిపోయాను. ఆ పళ్లెం అందుకున్న ఖాన్‌సాహెబ్ తరపున పెద్ద మనిషి ఆ వస్త్రాన్ని తొలగించాడు. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. అందులో వెయ్యి రూపాయల నోట్ల రెండు కట్టలు కనిపించాయి. దానికి బ్యాంకుసీలు ఉండటం మూలానా అవి రెండు లక్షలు అని చెప్పకనే తెలిసిపోతుంది.

ఆ కట్టలను అందరికీ చూపించి "కట్నం బాపతు రెండు లక్షలు" అంటూ పెళ్లి కుమారుని తండ్రికి అందించబోతూ ఉన్న సమయంలో "అల్లాహు అక్బర్... అల్లాహు అక్బర్" అంటూ దగ్గర్లోనే ఉన్న మసీదు లౌడ్ స్పీకర్ నుండి అజాన్ వినపడసాగింది. అక్కడున్న వాళ్లందరూ యాంత్రికంగా తలపై గుడ్డవేసుకున్నారు. అల్లాహు అక్బర్ అంటూ ఆ వెయ్యి రూపాయల నోట్ల కట్టను అందిస్తూ ఉంటే దాన్ని పుచ్చుకుంటున్న పెళ్లి కుమారుని తండ్రి కూడా "అల్లాహు అక్బర్" అని మెల్లిగా ఉచ్చరిస్తూ నోట్లను లెక్కపెట్టసాగాడు. నేను ఖాన్‌సాహెబ్ వైపు చూచాను. పాపం ఆడ పిల్లను కన్నందుకు అపరాధం చెల్లించుకుంటున్నాడేమో అనిపించింది.

"ఆ డబ్బేమిటి?" అడిగాను ఉస్మాన్‌ను. "కట్నం' అన్నాడు ముక్తసరిగా.

అల్లాహు అక్బర్ అంటే అల్లాహ్ గొప్పవాడు అని అర్థం అని ఖాన్ సాహెబ్ నాతో చెప్పినట్లు గుర్తు. అది జ్ఞాపకం వచ్చి నేనేమి మాట్లాడలేకపోయాను. అంత పైకం తేవటానికి ఖాన్ సాహెబ్ ఏం తాకట్టు పెట్టాడో అనే ఆలోచన నన్ను వేధిస్తూ ఉంది.

అంతలో ఆ ఊళ్లోని మోతుబరి వ్యాపారి తిరుపాలు శెట్టిగారు వస్తే ఖాన్ సాహెబ్ వెళ్లి సాదరంగా పలకరించాడు. శెట్టిగారు ఏదో చెప్పారు ఖాన్ సాహెబ్‌తో. ఖాన్ సాహెబ్ ఏదో నచ్చజెబుతున్నట్టుగా కనిపించింది! శెట్టిగారు తల పంకించారు. ఖాన్ సాహెబ్ తన ఇద్దరు కుమారుల్ని పిలిచాడు. ఇద్దరూ వచ్చి వినయంగా నిలబడ్డారు. కాస్సేపు వారి మధ్య ఏవో మాటలు జరిగాయి. తరువాత శెట్టిగారు వెనకాలే ఖాన్ సాబ్ గారి ఇద్దరు పిల్లవాళ్లు వెళ్లిపోయారు. ఖాన్‌సాహెబ్ కాస్సేపు

అలాగే వారివైపు చూస్తూ తిరిగి వచ్చాడు.

అజాన్ అయిపోయింది. అంతా తలపై గుడ్డలు తొలగించారు. ఇంతలో ఇంట్లోంచి మరో పళ్లెంలో మిఠాయిలు వచ్చాయి. తలా ఒక ముక్క తీసుకొని తినటం ప్రారంభించారు. కులాసాగా కొన్ని కబుర్లు చెప్పుకున్నారు. ఆ తతంగం అంతటితో అయిపోయినట్టుంది. పెద్ద మనుషులంతా లేచి నమాజుకు వెళ్లిపోయారు. ఉస్మాన్ లేచి బయటికి నడిస్తే నేనూ వాడి వెంట వెళ్లాను. ఇద్దరం ఇంటికి కాస్తంత దూరం వెళ్లి నిలుచున్నాం. ఉస్మాన్ సిగరేట్ వెలిగించి ఘాటుగా పొగ వదిలాడు.

"ఉస్మాన్... ఒక విషయం అడుగుతాను చెబుతావా?" అన్నాను.

"ఊఁ... అడుగు" అన్నాడు అదో విధంగా నవ్వుతూ

"ఇస్లాంలో వరకట్నం తీసుకోవడం కూడా ఉంటుందా?"

"నీవు ఏ ఇస్లాంను గూర్చి మాట్లాడుతున్నావు చిట్టితండ్రీ?... ఇప్పుడే చూశావుగా" అదోరకంగా జవాబిచ్చాడు ఉస్మాన్

"చూస్తే అంతా నూటికి నూరుపాళ్లు మతధర్మాలు పాటించే పెద్ద మనుషుల్లా ఉన్నారు. అల్లాహు అక్బర్ అంటూ ఓ పెద్ద మనిషి డబ్బు అందిస్తే... అల్లాహు అక్బర్ అంటూనే మరో పెద్ద మనిషి పైకం అందుకుని జేబులో పెట్టుకుని నమాజుకు వెళ్లారే నిజంగా అల్లాహ్ గొప్పవాడు అనే భయం వీళ్ల మనసుల్లో ఉంటే ఈ పని చేస్తారా? నోటితో పలికేది ఆచరణలో లేనప్పుడు మసీదుకెళ్లి నమాజు సలుపటం వల్ల ఒరిగేదేమిటి?? చేయకూడని పని చేస్తూ పైగా అల్లాహ్ పేరు ఉచ్చరించడం కూడానా? ఖాన్ సాహెబ్ కుటుంబాన్ని చూస్తుంటే కాస్తో కూస్తో ధర్మాలకు కట్టుబడి, దేవునికి భయపడేది ముస్లింలే అని నాకొక అభిప్రాయం ఉండేది. కాని ఇందాకటి డ్రామా చూస్తే ఎక్కడున్నయ్ ధర్మాలు అనిపిస్తుంది...?

'ఒరేయ్ కాస్త తగ్గించు పెద్ద మనుషులొస్తున్నారు' అన్నాడు ఉస్మాన్ నమాజ్ చేసుకొని తిరిగొస్తున్న పెద్ద మనుషులను కాస్తంత దూరం నుండి చూస్తూ.

వారు ఏదో మాట్లాడుకుంటూ మా ముందు నుండి సాగిపోతున్నారు. నా కళ్లంతా డబ్బు తీసుకున్న పెళ్లి కుమారుని తండ్రి జేబుపైనే ఉంది. ఆయన నాకు దగ్గర నుండి వెళుతూ ఉంటే వెయ్యి రూపాయల నోట్ల కట్ట కొంచెంగా పైకి కనిపిస్తూ "పిచ్చివాడా! ధర్మాలను గూర్చి బాధపడుతున్నావా? ధర్మాలకేమయిందని, అవి గ్రంథాల్లో భద్రంగా ఉన్నాయి. మనుషుల్లాగా భ్రష్టుపట్టిపోలేదు.' అంటూ నా వైపు చూసి వెక్కిరించినట్లనిపించింది.



ఖాన్‌సాహెబ్ ఇంట్లో జరిగిన విషయాలు నన్ను కలిచివేస్తూనే ఉన్నాయి. నాకు భోంచెయ్యాలనిపించలేదు. "రాత్రి పది గంటలు కావస్తూ ఉంది. భోంచెయ్యకూడదా" అన్నాను నా భార్యతో.

"లేదండి నాకు భోంచెయ్యాలనిపించటం లేదు" ముక్తసరిగా జవాబిచ్చింది. కాస్సేపు మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం ఆవరించింది.

"ఖాన్ అన్నయ్య మీతో ఆ విషయం చెప్పలేదా?' అంది నా భార్య.

"ఏ విషయం?"

"కట్నానికని ఆయన తెచ్చిన పైకం విషయం."

"నాకేమీ చెప్పలేదు. నీకు తెలుసుగా. వాడు అలాంటివేవీ చెప్పుకోడు. ఇంతకూ ఏమిటి విశేషం?" అడిగాను.

"ఆ ఇద్దరు మగ పిల్లల్ని చదువుమానిపించి తిరిపాలు శెట్టి వద్ద అయిదు సంవత్సరాలకుగాను పనికి వదిలి ఆ రెండు లక్షలు తెచ్చాడట." అంది గద్గదిత స్వరంతో.

'నీవంటున్నది నిజమా?.. అన్నాను ఆశ్చర్యంగా.

"నజ్మా వదినే చెప్పింది. పాపం ఆమె కుమిలిపోతూ ఉంది." అంటూ కన్నీళ్లు ఒత్తుకుంటూ "ఏమండి నేను ఆస్పత్రిలో ఉన్నప్పుడు నాకు ఆమె చేసిన సేవను నేను జన్మలో మరిచిపోలేను... మనం ఏం చేసినా వారి రుణం తీర్చుకోలేము. పైగా ఆ పిల్లలు మనింట్లో మన పిల్లల్లాగానే ఆడుతూ పాడుతూ పెరిగారు కదా, వారిని ఈనాడు ఇలా తాకట్లు పెట్టడం నేను చూడలేను. ఇంట్లో ఉన్న నా నగలు తీసుకెళ్లి అమ్మేసి తిరిపాలు శెట్టికి ఆ పైకం చెల్లించి పిల్లల్ని విడిపించండి." అంది పొంగి వస్తున్న దుఃఖాన్ని బలవంతాన ఆపుకుంటూ.

"ఈ విషయం నాకు తెలియదు సుశీ! సరే అలాగే చేస్తాను. ఇక పడుకో" అన్నాను ఒక వైపు నా భార్య సలహాకు సంతోషిస్తూ, మరొకవైపు ఈ మాత్రం ఆలోచన నాకు ముందుగా తట్టనందుకు సిగ్గుపడుతూ, అల్లాహు అక్బర్ అంటూ కట్నం పైకం అందుకున్న ఆ పెద్ద మనిషిని తలుచుకుంటూ.



# ౨౫

## అనాథ

హమీదా ఓ మధ్యతరగతికి చెందిన అమ్మాయి. ఆమె బ్రతుకు కూడా మధ్యంతరంగానే చిందరవందరైపోయింది. పదో తరగతి చదువుతూ ఉండగానే తల్లీతండ్రి ఇద్దరూ ఓ బస్సు ప్రమాదంలో మరణించారు. కుటుంబ మంచితనాన్ని బాగా ఎరిగిన  ఆ వీధివారే ఇద్దరికీ అంత్యక్రియలు జరిపించారు. ఒకే కూతురు కావడం వల్ల హమీదా ఎంతో గారాబంగా పెరిగింది. కాలానికి వీటన్నింటితో పనిలేదు. తన పని తాను చేసుకుంటూ పోతుంది. ఒకరి ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేకుండా జనాన్ని శాసిస్తూ ఉంటుంది. తన వెంట తీసుకెళుతూ ఉంటుంది. అన్ని గాయాలకు దివ్య ఔషధం కాలం. మందులకు మానని ఎన్నో గాయాలను ఇట్టే మాన్పేస్తుంది. ఒక్కసారిగా అమ్మా, నాన్నను పోగొట్టుకుని అనాథగా మిగిలిపోయి వికలమైన హమీదా హృదయ శకలాలు నైజసిద్ధంగా క్రమేణా అతుక్కున్నా ఆ పీడ కలలు ఆమెను వెంటాడుతూనే ఉన్నాయి.

హమీదాను చేరదీసిన ఓ కుటుంబం ఆమెకు ఏ లోటూ రానివ్వలేదు. చేసుకున్న మంచి వెంట వస్తుందన్నట్టు ఆమె అమ్మానాన్నల మంచితనంతో ప్రభావితమైన ఓ యువకుడు హమీదాను పెళ్ళి చేసుకోవటానికి ముందుకొచ్చాడు. ఎవరి కోసమూ ఆగని క్షణాలు హమీదా పెళ్ళి కార్యాన్ని ముగించాయి. అబ్బాయి మంచివాడు. హమీదా పరిస్థితి బాగా ఎరిగినవాడు. ఆమెతో గతాన్ని మరిపించి తన ప్రేమాభిమానాలతో ఆమెను మురిపించటానికి శతవిధాలా ప్రయత్నించేవాడు. సుఖదు:ఖాలు మిళితమైన హమీదా జీవితం అలా సాగిపోతూ ఉంది. అమ్మ బిడ్డను ఉదయాన ఒక దెబ్బకొడితే సాయంత్రానికి ఆ అమ్మే రెండు బొమ్మలను కొనిస్తుంది. బిడ్డను ఓదార్చటానికి. దాసులపై డెబ్భై తల్లుల ప్రేమ గల దేవుడు హమీదాకు ఒకేసారి రెండు కుందనపు బొమ్మల్ని ఇచ్చాడు. రెండేళ్ళ కాపురం తరువాత  హమీదాకు కవలలు కలిగారు. ఒక బాబు, ఒక బేబి. ధార్మిక వాతావరణంలో పెరిగిన హమీదా

పిల్లలకు ఎంపిక చేసుకున్న మంచి పేర్లే పెట్టింది కాని ముద్దుగా పిలుచుకునే ఆ పేర్లే స్థిరపడ్డాయి.



కాలం కదిలిపోతుంది మౌనంగా, పిల్లల మురిపాలతో ఘనీభవించిన గతం మెల్లిగా కరిగిపోసాగింది. విషాదాల నకాబ్ నుంచి హమీదా తేలికపాటి చిరు నగుమోము అప్పుడప్పుడు మసగ్గా కనిపించేది. కష్టాలకుకూడా ఒక యూనియన్ ఉన్నట్టుంది. ఏ దిక్కులేని వాళ్ళపై ప్రణాళికాబద్ధంగా కూడబలుక్కొని దాడి చేస్తుంటాయి. హమీదా భర్తకు అంతుపట్టని అనారోగ్యం పీడిస్తూంది. దిక్కులేని వారికి ప్రభుత్వం ఆసుపత్రులే దిక్కు అన్నట్టు నెలల తరబడి మందులు తిన్నా అసలు వ్యాధి అంతుబట్టటం లేదు పిల్ల డాక్టర్లకు. వ్యాధి తీవ్రమవుతూఉంది. చేస్తున్న ఆ పనీ చెయ్యలేక రెండు మాసాలుగా ఇంట్లో పడుకునే ఉంటాడు. ఎవరిపరిస్థితులు ఎలా ఉన్నా సంసారం సాగాలిగా. కాలం ఒక్కోసారి మనుషుల్ని శిక్షించినా బ్రతకటానికి అవసరమైన శిక్షణ, మార్గాలుకూడా చూపుతూ ఉంటుంది. మొదట మానసికంగా భారమే అనిపించినా ఇంటి అవసరాల కోసం ఆమె చేయతగ్గ కూలీనాలీచేయటానికి అలవాటైపోయింది హమీదా. ఐదవ తరగతిలోనే పిల్లలిద్దరూ స్కూల్ మానేసి దిన కూలీపనుల్లో అమ్మకు సహాయంగా ఉంటారు. చదువుకుని ఎదగవలసిన రోజుల్లో ఇతరుల ఇళ్ళల్లో పాచి పని చేయటం, పెళ్ళిళ్ళ సీజన్‌లో అమ్మ వెంట వంట పనికి పోవటం, వికసించవలసిన గులాబి మొగ్గల్లాంటి పిల్లలు ఇలా కమిలి పోవటాన్ని చూసి హమీదా తన కన్నీళ్ళను తానే తాగేది ఇతరులకు కనిపించకూడదని. పరిస్థితులను గమనిస్తూ ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలోని హమీదా భర్త మౌన వేదన చెప్పరానిది, చెప్పలేనిది.



రంజాన్ నెలవంక కనిపించింది. అంతా ఒకటే కోలాహలం. ఆ నెలవంకలో హమీదాకు తన బాల్యం కనిపించింది. ఆ అదృష్టం, ఆ ఆనందం తన పిల్లలకు లేకపోవటం చూసి కుమిలిపోయింది. ఐనా బాబును నమాజ్‌కు వెళ్ళమంది. తాను బేబీతో ఇంట్లో ఆచరిస్తుంది. ఉన్నదాంట్లో తల్లితోపాటు ఇద్దరు పిల్లలు సహరీ తింటారు. ఉపవాసాలు పాటిస్తున్నారు. హమీదా భర్త ఆరోగ్యం నానాటికి క్షీణిస్తూ ఉంది.

డాక్టర్ల సలహాపై భర్తను జిల్లా ఆసుపత్రికి తీసుకెళ్ళింది హమీదా, పిల్లల్ని పక్కింటివాళ్ళ వద్ద వదిలి. ఇరుగుపొరుగు వారు హమీదాకు ధైర్యం చెప్పి ఖర్చులకు కాస్త పైకం ఇచ్చి పంపించారు. అవసరమైతే అన్నివిధాలా ఆదుకుంటామన్నారు. పరీక్షలన్నీ ముగిసిపోవటానికి వారం రోజులు పట్టింది. డాక్టర్ హమీదాను పిలిచాడు. ఆయన ముఖ కవళికలు ముందుగానే ఏదో అశుభ సంకేతాలు పలుకుతున్నట్టున్నాయి. చూడమ్మా నీ భర్తకు 'క్యాన్సర్'. పిడుగులాంటి మాట పూర్తికాకముందే కళ్ళు తిరిగి తూలిపోతున్న హమీదాను నర్సులు కాస్త సంభాళించి పట్టుకున్నారు. వ్యాధి బాగా ముదిరిపోయింది అయినా ప్రయత్నిస్తాం' అంటూ ముగించాడు డాక్టర్.

భర్తను తమ ఊరికి తీసుకెళ్ళింది హమీదా. వీధివారికి ఈ విషయం తెలిపి జరగవలసింది చూద్దామని ఊరు చేరుకున్నారు. రాత్రయింది తరావీ నమాజు ముగిసింది. జన సంచారం పల్చబడింది. భర్త మంచం పక్కనే హమీదా, ఇద్దరు పిల్లలు చాపపై పడుకున్నారు. భార్యాభర్తలకు నిద్రపట్టటంలేదు. ఒకరితో ఒకరు మాట్లాడాలని ఇద్దరూ ప్రయత్నిస్తున్నారు. భావాల బరువుతో మాటలు పెకలటం లేదు. 'హమీదా...! పిలిచాడు భర్త. నిశ్శబ్దం చీల్చుకుంటూ.. 'ఆ!.. ఏమండీ...' అంది హమీదా ఉలిక్కిపడుతూ.. అంతే ఆ తరువాత మాటలుకాదు ఏడుస్తున్న శబ్దం... లేచి కూర్చొంది హమీదా. చంటిపిల్లాడిలా ఏడుస్తున్నాడు భర్త. 'ఏమండీ.. ఏమిటండీ... నాకేదో భయంగా ఉంది.. అంటూ ఉండగానే 'హమీదా... అల్లాహ్ సాక్షిగా చెబుతున్నాను. నన్ను నమ్ము.. ఈ వ్యాధిని కావాలని దాచి నీకు మోసం చేశానని మాత్రం అనుకోవద్దు. నా కంతా తెలిసిపోయింది. ఇక నేనెంత కాలమో బ్రతకను... నా వ్యాధి కోసం ఎవరినీ ఏమీ అడక్కు, ఏదైనా ఉంటే పిల్లలకు తినిపించు, నా తరువాత... ఇంకా ఏదో చెప్పబోతూ ఉండగా "వద్దండీ... అంత మాటనకండి' అంటూ చంటిపిల్లలా రోదిస్తూ ఉంది హమీదా. ఇద్దరూ బాగా అలసిపోయేలా ఏడ్చారు. గుండె కాస్త తేలికపడింది. 'హమీదా!.. దైవం మనకిచ్చిన ఈ చిన్న జీవితంలో నావల్ల నీకేదైనా కష్టం కలిగివుంటే నన్ను క్షమించు అంటూనే 'చాలండీ... చాలు ఇక ఏ చిన్నమాటనైనా భరించే శక్తి నాలో లేదు... మీకు ఏ సేవ చేయలేకపోయాను. మీరే నన్ను క్షమించాలి' అంది మిగిలి ఉన్న కన్నీళ్ళను కురిపిస్తూ..



అమ్మనాన్నకు తెలిస్తే బాధపడతారని వారికి తెలియ కుండానే చిన్నపాటి కూలీపనులు చేస్తున్నారు పిల్లలు. ఆనాడు సాయంత్రం అన్నాచెల్లెలిద్దరు చెరో రెండు ఆపిల్ పళ్ళు తెచ్చి కోసి చెరో ముక్క నాన్న నోటికి అందిస్తూ ఉంటే కంట తడిపెడుతూనే ఎంతో ఆప్యాయంగా తింటున్నాడు నాన్న. కాస్సేపయింతరువాత పిల్లల్ని పక్కకు పిలిచి 'బాబూ... ఆ పళ్ళెక్కడివిరా... అడిగింది హమీదా. బేబి అందుకొని అమ్మా... ఈ వేళ అసర్ నమాజు తరువాత మన పక్క వీధిలోంచి ఓ పెద్ద ఊరేగింపు... ఏవేవో వంటకాలు పెట్టిన పళ్ళాలు.. ఒక్కో పళ్ళెం మోసేవాళ్ళకు పది రూపాయలు ఇస్తుంటూ నేనూ, బాబూ చేరో పళ్ళెం మోసుకెళ్ళాం. అక్కడికి కాస్త దూరంలోని వీధిలో ఒక అబ్బాయి తొలి రోజా ఉన్నాడట. వాళ్ల అమ్మమ్మ ఇంటి నుంచి అతని ఇఫ్తార్ కోసం అబ్బో ఎన్ని వంటకాలో ఒక పెద్ద క్యూ అంటే నమ్ము. అమ్మా అవును మాకు ఎవ్వరూ ఇలా చెయ్యలేదే... అంటూ ఉంటే పెదవులపై పెల్లి ఉబికివస్తున్న దు:ఖాన్ని మునిపళ్ళతో ఆపుకుంటూ... "కలవాళ్ళ అబ్బాయి పద్నాలుగేళ్ళ వయసులో తొలి రోజా పెడుతున్నాడని అలా చేశారు బాబూ..." మీరు పుట్టిన తొలిరోజు నుంచే రోజాలు ప్రారంభించారుగా.. పుడుతూనే పాల కరువు, పెరుగుతూ తిండి కరువు. వాళ్ళు సంవత్సరానికొకసారి రమజాన్‌లోనే రోజాలు పెడతారు బాబూ మీ జీవితాలలో ప్రతి దినం రోజాయే కదా? వారికంటే మీరే అదృష్టవంతులు బలహీనంగా నవ్వుతూ ఓదార్చింది హమీదా. 'అమ్మీ... ఈ కలవాళ్ళందరూ జకాత్ ఇస్తే ఎవరూ పస్తులుండవలసిన అవసరంలేదటగా... వాళు ్ళ జకాత్ ఎందుకివ్వరు? అంది బేబి. నీవు చిన్న పిల్లవు అదంతా నీకర్థం కాదులే అంటూ ముగించింది హమీదా.



రంజాన్ గడిచింది. పండుగ ముగిసింది. ఆ అయిదవ రోజు రాత్రి ఉ న్నపాటుగా భర్తకు రక్తపువాంతులు అయ్యాయి. గుండె పగిలిపోయిన హమీదా పక్కింటి వాళ్ళను లేపింది. ఇరుగుపొరుగు వారు గుమిగూడి రాత్రికి రాత్రి అస్పత్రికి తీసుకెళ్ళారు. డ్యూటీ డాక్టర్ పరీక్షగా చూశాడు. 'లాభంలేదు.. తీసుకెళ్ళండి. చనిపోయాడు.. అన్నాడు. హమీదా గుండెలపై వేయి పిడుగులు ఒక్కసారిగా కురిశాయి. కుప్పకూలి పోయింది.

ఆ మరునాడు సంస్కారాలు జరిగిపోయాయి. భుజాలపై వెడుతూ ఉంది శవపేటిక. ఆనాటి అమ్మానాన్నల శవయాత్ర కళ్ళలో తిరిగింది హమీదాకు. తల్లీ బిడ్డలను ఓదార్చగల మాటలు ఆ వీధి వారి వద్దనేకాదు.. ప్రపంచంలో ఎవరి వద్దా లేననిపించింది. ఇంట్లో జనం ఒక్కొక్కరుగా వెళ్ళిపోయారు. హమీదాకు పిల్లలకు భోజనం తేవటానికని. ఆకాశం వైపు తదేకంగా చూస్తుంది హమీదా. ఏవేవో ఆలోచనల దొంతరలు కదలాడుతున్నాయి హమీదా మనసులో... 'అమ్మీ... ఈ కలవాళ్ళు జకాత్ ఇచ్చివుంటే నాన్న బ్రతికేవాడు కదూ? వాళ్ళు ఎందుకివ్వరు? అన్న బేబీ మాటలకు, ఈ ప్రశ్నలకు సమాధానం ఇస్లాం ధర్మానికే అంతుబట్టటంలేదు. నీకూ, నాకూ ఏం అర్థమవుతుంది అంది హమీదా మనసు.



# ౨౦

# ఇది కథ కాదు

నా పెళ్లి, నా స్నేహితుడు రహమాన్ పెళ్లి ఒకే దినం ఇదే కర్నూలులో జరిగి అప్పుడే ఇరవై ఏళ్లు గడిచాయి. ఈనాడు వాడి కూతురు హసీనా పెళ్లికి నేను ఇక్కడికి మళ్లీ రావటం తలచుకుంటే అంతా ఒక వీడియో సినిమా చూసినట్లుంది. హసీనాను ఎక్కువగా ఎత్తుకు తిరిగేవాడిని. సైకిల్‌పై కూర్చోబెట్టుకుని ఊరంతా తిరిగే వాడిని. మొన్నటి వరకు నేను ఎత్తుకొని తిరిగిన పాప హసీనా ఈనాడు పెళ్లి కూతురు. ఇంతలో ఎంత మార్పు?

ఊహాలోకంలో నుండి బయటపడి రిస్టువాచి చూసుకున్నాను. సమయం తొమ్మిదిన్నర. నికా పదిన్నరకు. బాత్‌రూంకెళ్లి మరోసారి ముఖం కడుక్కొని హోటలు రూంకు తాళం వేసి బయలు దేరాను. వీధివాళ్ల పరామర్శలు, నిష్ఠూరాలు అన్నింటినీ దాటుకుంటూ పెళ్లి ఇంటికి చేరాను. ఏర్పాట్లలో హడావిడిగా ఉన్న రహ్మాన్ నన్ను చూస్తూనే పనులన్నీ మానేసి నా వద్దకు వచ్చి కౌగిలించుకొని ఇప్పుడేనా రావటం, ఏదీ సుశీలమ్మ రాలేదా? అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తూ ఇంట్లోకి తీసుకెళ్లాడు. స్త్రీలందరూ అడ్డు తొలుగుతూ పరదాలోకి వెడుతున్నారు. నన్ను సరాసరి పెళ్లి కూతురు హసీనా ఉన్న గదికి తీసుకెళ్లాడు.

చమ్కీలు తొడిగిన ఎర్రటి జిలుగు చీర, చేతులకు కాళ్లకు నిండా గోరింటాకు, ఆభరణాలు - కుందనపు బొమ్మలా ఉన్న హసీనా నన్ను చూస్తూనే సంతోషంతో మామయ్యా అంటూ గెంతేసింది. నేను ఎత్తుకొని తిరిగిన ముద్దులపాప హసీనాను అలా చూస్తూ నిశ్చేష్టగా నిలబడిపోయిన నా కళ్లలో ఆనందం, దుఃఖం కలబోసిన కన్నీళ్లు నిండాయి. ఆ బరువుతో మాటలు పెకలలేకపోయాయి. రహమాన్ వైపు చూశాను. వాడి స్థితి అలాగే ఉంది. కొంగుతో ముఖం కప్పుకొని హసీనా వెక్కి వెక్కి ఏడుస్తూంది. ఎవరు ఎవర్ని ఓదార్చాలో అర్థం కాలేదు. అందర్నీ అలరిస్తూ అల్లారు ముద్దుగా పెరిగిన ఆడ కూతురు అందరికీ ఒక్కసారిగా వీడ్కోలు చెప్పి మరో ఇంటికి అంకితం కాబోతున్న ఆ సమయం చూసిన వింత అనుభూతికి చలించని వారు ఉండరు. "హసీనా, పద ఒకసారి నిన్ను సైకిల్‌పై కూర్చోబెట్టుకొని ఊరంతా

తిప్పుకువస్తా" అన్నాను. ఆ గంభీర వాతావరణాన్ని తేలిక పర్చాలని ప్రయత్నిస్తూ.. ఏడుస్తూనే నవ్వింది హసీనా. హసీనాను దీవించి బయటికి నడిచి స్నేహితుల గుంపులో కలిసిపోయాను.

నా స్నేహితులలో సన్నిహితుడు నజీర్ హుసైన్ నేనూ కలసి ఎన్నో కబుర్లు చెప్పుకున్నాం. రిస్టువాచి చూసుకున్నాను. పన్నెండున్నర అయింది. "నికా పదిన్నరకు అని పెళ్లి పత్రికలో ఉంది మరి..."

"ఏ నికా అయినా పెళ్లి పత్రికల్లో వేసిన సమయానికి జరిగిందా?" మాట ముగించక ముందే అందుకున్నాడు నజీర్.

"నిజమే... ఎందుకనీ "తెలుసుకోవాలనే ఆతురత కొద్ది అడిగాను.

"అది అంతే" అన్నాడు ముక్తసరిగా. ఇంతలో ఒక టాపులేని జీపులో పెళ్లి కుమారుడు రానే వచ్చాడు పరివారం వెంటరాగా. ముందే అక్కడ ఉన్న జనానికి పెళ్లి కుమారుని వెంటవచ్చిన జన సమూహం కలిసిపోయేటప్పటికి రద్దీ ఏర్పడింది. అంతా హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. పహిల్వానులా ఉన్న ఒకతను జీపు దగ్గరికి వెళ్లి పెళ్లి కుమారుడ్ని ఎత్తుకొని వస్తూ ఉండటం కనిపించింది. నా గుండె ఆగిపోయినంత పనైంది. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

"ఏమిట్రా అలా కంగారు పడిపోతున్నావ్"... అన్నాడు నజీర్ నా భుజం తడుతూ.

"రహమాన్ ఇలా ఎందుకు చేశాడు... అన్నాను తేరుకొని.

ఏం చేశాడు?

"అందాల భరిణె హసీనాకు ఈ కుంటి సంబంధమా"?

ఎవరన్నారు అబ్బాయి కుంటి వాడని?

మరెందుకు అతన్ని ఎత్తుకు పోతున్నారు. నడవలేడా?

ఓహెూ అదా.... అది సంప్రదాయం. నీవెప్పుడూ ముస్లింల పెళ్లికి వెళ్లలేదా? అన్నాడు నజీర్ ఆపుకోలేనని నవ్వుతో..

హమ్మయ్య... అనుకున్నాను. అయినా పెళ్లి కొడుకు నడవగలినిప్పుడు ఆయన్ను ఎందుకు మోసుకోవలసి వచ్చిందో నాకు అర్థం కాలేదు.

అంత బరువు మోసుకొని నికా వేదిక వద్దకు వెడుతున్న వ్యక్తిని ఇంటి ముఖ ద్వారం వద్ద నిలిపవేశారు కొంతమంది కుర్రాళ్లు.

అక్కడేదో రసాభాసా జరిగింది. ఎర్రటి నీళ్లతో దిష్టి కూడా తీశారు. అలా అడ్డుకున్న కుర్రాళ్లకు కొంత పైకం ఇచ్చి ముందుకు సాగిపోయారు, బహుశా అదీ సంప్రదాయమే కావచ్చు అనుకున్నాను. ఆ తరువాత పెళ్లి కొడుకును సరాసరి మరో తలుపు వద్దకు తీసుకెళ్లారు. అక్కడ పెళ్లికూతురు తలపై  పెళ్లి కొడుకుతో దోసిళ్లతో బియ్యం వేయించారు. పెళ్లి కూతురు కూడా అదే విధంగా పెళ్లి కుమారుని తలపై బియ్యం వేసింది.

"తలంబ్రాలు వేయిస్తున్నారా?" అని అడిగాను నజీర్‌తో తెలుసుకుందామనే ఆదుర్దాతో. 'తలంబ్రాలు కాదు అదో పద్ధతి" అన్నాడు ముక్తసరిగా నజీర్.

ఆ తరువాత పెళ్లి కుమారుడ్ని నికా వేదికపై దించారు. నికా కార్యక్రమం ముగిసింది.

ఒక వ్యక్తి పెళ్లి కొడుకు తలపై నుండి మూడుసార్లు దిగదీసిన కలకండ ముక్కల్ని జనంలోకి విసిరివేశాడు. వాటిని ఏరుకోటానికి కొంత తొక్కిసలాట జరిగింది. పెళ్లి కుమారుడ్ని ఒక్కొక్కరుగా అందరూ ఆలింగనం చేసుకొని శుభాకాంక్షలు తెలియజేశారు. ఇక నా వంతు వచ్చింది. అందరిలాగా నేనూ ఆలింగనం చేసుకున్నాను. పెళ్లి కుమారుని ఉదర భాగంలో ఏదో లావుపాటి వస్తువు కట్టి ఉండడం గమనించాను. ఆ విషయాన్ని నజీర్‌కు అడిగితే "అది ఎండు కొబ్బరికాయ" అన్నాడు.

భోజనాలు ముగిశాయి. ఆ కార్యక్రమం అలా ముగిసింది. ఆ కార్యక్రమాన్ని మొదలంటా చూసిన నా మనసులో కొన్ని విషయాలను నజీర్‌తో అడిగి తెలుసుకోవాలనిపించింది. భోజనాలు ముగించుకొని నేనూ నజీర్ ఒక గదిలో కూర్చున్నాము. ఒక్కొక్కరుగా చాలా మంది వెళ్లిపోయారు. సమూహం పల్చబడింది. నజీర్‌ను అడగాలనుకున్నవి అడగటం మొదలుపెట్టాను.

"నజీర్, ముస్లింల వివాహాల్లో మరే పెళ్లి ఇంత వివరంగా చూడటానికి నాకు అవకాశం లభించలేదు. నాకు అర్థం కాని కొన్ని విషయాలు అడుగుతాను చెబుతావా అన్నాను.

"అదేమిట్రా పోలీస్ ఆఫీసర్‌లా ప్రశ్నిస్తున్నావు. అడుగు నాకు తెలిసింది చెబతాను" అన్నాడు తమలపాకు మడుస్తూ

"ముస్లింల పద్ధతులు విధానాలు ఆచారాలు ఒకటిగానే ఉంటాయని, అవి ప్రవక్తగారి ప్రవచనాలకు, సంప్రదాయాలకు అనుగుణంగా ఉంటాయే కాని తమ

ఇష్టం వచ్చినట్లుగా జరుపుకోవటం కూడదు అంటారు కదా, పెళ్లి కుమారునికి నడవగల శక్తి ఉన్నా ఎందుకు ఎత్తుకున్నారు? పసుపు సున్నం కలిపిన రంగు నీళ్లతో పెళ్లి కుమారునికి దిష్టి తీశారు అలా ఎందుకు చేశారు? నికాకు పూర్వమే వధూవరులు ఒకరి తలపై ఒకరు బియ్యం వేసుకున్నారు. నిఖా కానంతవరకు వధువుకు వరుడు భర్త కాజాలడు. ఆ విధంగా భార్యాభర్తలు కాని వ్యక్తులతో తలపై బియ్యం ఎందుకు వేయించారు? ఎర్రటి గుడ్డలో ఎండు కొబ్బరు కాయను వరుని ఉదర భాగాన కట్టారు ఎందుకని? అన్నిటికన్నా ముఖ్యమయినది పెళ్లికి వచ్చిన అందరికీ మహా ఇబ్బంది కలిగించే విషయం ఏమిటంటే నిర్ణయించిన సమయానికి నికా జరుగక గంటల తరబడి ఆలస్యంగా జరుపటం ముస్లింల పెళ్లిలో సర్వసాధారణం. ప్రకటించిన సమయానికి కట్టుబడి ఉండరు. ఎందుకని? ప్రవక్తగారి కాలం నుండే ఇలా జరుగుతూ వస్తూ ఉందా? ఆ కాలంలో ఇలాగే చేసేవారా? ఇస్లాంలో ఇవన్నీ అనుమతించబడ్డాయా? ఇలా చేయటానికి ప్రవక్తగారు అనుమతించారా"?

ప్రశ్నించాను సమాధానం కోసం ఎదురుచూస్తూ విక్రమార్కుని భుజంపై శవంలాగ. నేను అడుగుతున్న ప్రతి ప్రశ్నకు నజీర్ ముఖంలో మార్పును గమనించాను నజీర్ తన చేతిలోని తమలపాకులను పరధ్యానంగా అటు ఇటు ముడుస్తున్నాడే కాని వాటిని నమలడం మరిచిపోయాడు. అంతవరకూ తలవంచుకొని తమలపాకులను మడుస్తున్న నజీర్ ఒక ముద్దాయి తరఫున వాదించే లాయర్‌లా నా వైపు చూశాడు అదోలా. నిజమేగా మంచి ప్రశ్నలేవేశావ్. సమాధానంగా ఒక్క విషయం మాత్రం చెప్పగలను. మానవ మహోపకారి కాలంలో ముస్లిలలో ఇలాంటి దురాచారాలు ఉండేవి కావు, అలా చేయటం వారి బోధనలకు విరుద్ధం అని మాత్రం చెప్పగలను. అంటూ ఉండగానే వాడి తమ్ముడు అన్వర్ హుసైన్ ఏదో పనిమీద పిలిస్తే వెళ్లిపోయాడు నజీర్.

నజీర్ వెళ్లిపోయాడే గాని నా మనసులో ప్రశ్నలు ప్రశ్నలుగానే ఉండిపోయాయి. ముస్లింల ఏ విధానమయినా ప్రవక్త గారి బోధనల ప్రకారమే ఉండాలి కదా మరి నేటి ముస్లింలు ఆ ప్రవక్త గారి ప్రవచనాలకు సంప్రదాయాలకు విరుద్ధంగా ఇవన్నీ ఎందుకు చేస్తున్నారో అర్థం కాలేదు. ఇంకెవరయినా ముస్లింలతో ఈ ప్రశ్నలకు సమాధానం అడిగి తెలుసుకోవాలనుకున్నాను. కాని ఇంత వరకు ఏ ముస్లిం నాకు సరయిన సమాధానం చెప్పలేకపోయాడు.



# 27

# సత్సమాజం కోసం ...

మానవరాశి ఉనికిలోనికి వచ్చింది మొదలు మనిషికి శాంతిభద్రతలు కొరవడ్డాయి, మనిషి జీవితం నరకప్రాయమై పోయింది. మనిషి వల్లే, నాటి నుండి నేటి వరకు రాజ్యాలూ, ప్రభుత్వాలూ, సమాజాలు తమ ఖజానాలలోని పెద్ద మొత్తాలను ఖర్చు చేసిందీ, చేస్తున్నదీ ఓ నేరరహిత మానవ సమాజ నిర్మాణం కోసమే.

ఇంకా ఇలా ఎంతకాలం ఎంత ధనం ఖర్చు చేస్తూనే ఉండాలో ఎంతమంది ధన మాన ప్రాణాలు మంటల్లో మాడిపోవాలో కాని అందువల్ల మనిషి ఆశించిన నేరరహిత సమాజం స్థాపించబడే కాలం కనుచూపు మేరలో కనిపించటం లేదు. చేదు ఫలాలను అనుభవిస్తూ కూడా మానవ జాతి తన దిశను మార్చుకోనంత వరకు అలాంటి సమాజ స్థాపన ఎన్నటికీ జరుగదనటానికి గతమే సాక్ష్యం.

చెడును ఎవరూ కోరుకోరు. అంతా మంచి జరగాలి, మంచిగా ఉండాలి. ఇది సర్వజన కలకాల ఘోష. మరి దీనికోసం మనిషి ఏం చేయాలి? అతని అంతరంగాన్ని మార్చుకోవాలి" "ఓస్...అంతేగా, మానవజాతి ఇంతటి సుదీర్ఘ ప్రస్థానంలో ఘోరాతి ఘోర రక్త సిక్త పరపీడను వదిలించుకొని శాంతిమంత జీవితాన్ని గడపగలిగే ఒక మంచి సమాజాన్ని స్థాపించుకోటానికి మనిషి ఆ మాత్రం తన అంతరంగాన్ని మార్చుకోవటం ఏమంత కష్టమని?.....ఆ మాత్రం చేసుకోలేక ఇంత కాలంగా ఇంత సతమతమవుతున్నాడా మనిషి?... పూర్‌ఫెలో అన్నాడు మణి. "ఆc... ఆc... ఆగు అది అంత సులభమైనదే అయితే నందన వనంలా సృష్టించుకున్న తన సుందర సమాజాలను స్మశానాలుగా చేసుకున్న కోటానుకోట్ల గత జనమంతా చవటలనుకున్నావా? "సత్తార్ భాయ్ విషయాన్ని కాంప్లికేట్ చేయకు... నా మటుకు నేను చేయవలసిన ఆ కొండలు మోసే, కొంపలు కూలే పనేదో చెప్పు చేసి చూపిస్తాను. "మణీ!... ఆవేశపడకు "నిజమే... చేయాలని అనుకోవాలే గాని అది తేలికైన పనే... పైగా అది ఎవరో చెప్పేది, కొత్తగా రచించుకునేది, ఏ పార్లమెంటులోనో చర్చించుకుని

తీర్మానాలు చేసుకునేది ఎంత మాత్రం కాదు. ఉన్నదే... చెప్పబడిందే... ఆచరించాలి... అంతే "అబ్బ మరీ విసిగించక... అదేదో చెప్పరా బాబూ" చూడు మణీ! విధాత సృష్టిలో ఒక్క మనిషినే విలక్షణంగా చాలా అపురూపంగా ప్రత్యేకంగా సృష్టించాడు." "మనిషిలో కోరికలు కలిగించి వాటిని నియంత్రించుకోమనటం, స్వార్థాన్ని నూరిపోసి దాన్ని చంపుకోమనటం, కోపం, ఈర్ష్యా, ద్వేషం, మద మత్సరాలను జనింపజేసి వాటిని తుంచుకోమనటం, ఒకటేమిటి ఈ లోకాన్నంతటిని మనిషి కోసం అడుగడుగునా అత్యంత ఆకర్షణీయంగా చేసి వాటివైపు చూడకు అని ఆదేశించటం వింతలలోకెల్లా వింతకాదా? ఒక విధంగా నీ మస్తిష్కంతో ఆలోచిస్తే ఇదేం పిచ్చి పని అని అనిపించదా?"

"నిజమే మానవ సృష్టి అంత పిచ్చిగా ఉంది ఎందుకని? "ఆс... అలా దారికి రా... విను మనిషిని పరీక్షించటానికి దైవం అతని సృష్టిని అలా చేశాడు. "పరీక్ష? ఎందుకని? "తాను ఆదేశించిన జీవితం గడిపిన వారికి బహుమానంగా స్వర్గాన్ని ప్రసాదించటానికని" "స్వర్గం ఎందుకని?" అది మానవ జీవన చివరి మజిలీ కాబట్టి.

"ఈ పరీక్షలో తప్పితే?" "అలాంటి వారికి కూడా ఎటూ కాని పరిస్థితుల్లో వదలకుండా వారికోసం నరకం సిద్ధంగా ఉంది." "మరి ఈ పరీక్షా సమయం ఎంతో మరి?" "ఆయువు పర్యంతం." "ఇంతకూ మనిషి నేర రహితంగా ఉండలేడంటావా?" ప్రశ్నించాడు మణి.

"ఎందుకు లేదు.. ఖచ్చితంగా... అన్నిటిలాగే దానికీ ఓ పద్ధతి ఉంది.. దాన్ని ఆచరించగలగాలి." అందుకు ఎంత ఖర్చవుతుంది? "ఏమీలేదు... అంతా ఉచితం" "భలే వాడివే.. పిడికెడు మట్టి కూడా ఉచితంగా దొరకని ఈ కాలంలో మనిషిని అన్ని చెడుల నుండి దూరం చేయగల చికిత్స ఉచితమా?" చెప్పరా బాబూ నీకు పుణ్యముంటుంది ఒకరికి కాదు నీవు మానవ జాతికే మేలు చేసిన వాడవవుతావు... అయినా తెలియక అడుగుతాను... ఈ కిటుకు వెనుకటి జాతులకు తెలియదా?" "తెలుసు... ఇదేం కొత్త కాదు... ఆది మానవుడి నుండి వస్తున్నదే... ఆచరించినవాళ్లు కృతార్థులయ్యారు... కృతార్థులవ్వాలనుకున్నవారు ఆచరించుకోవచ్చు. బలవంతంలేదు... ఈ మందుకు డేట్ ఆఫ్ ఎక్స్‌పైరీ లేదు.

బాగుపడాలనుకునేవారు ప్రళయదినం వరకూ ఈ మందు సేవించుకోదగ్గదే.” “సత్తార్ భాయ్ ఇక మాటలు వద్దు వెంటనే చెప్పు వ్రాసుకుంటా” మణీ! సులభంగా అర్థం కావటానికి దీనిని నీకు ఒక రూపకం రూపకంలో చెబుతా విను.

అంతర్జాతీయంగా పేరు ప్రతిష్ఠలు గల ఓ జ్యోతిష్కుడు ఉండేవాడు ఎదుటి వారి ముఖం గానీ, ఫోటోగాని చూసి వారి అంతరంగం ఎలాంటిదో చెప్పేస్తాడు, అదీ నూటికి నూరు పాళ్లు ఖచ్చితంగా. అతను చెప్పిన కేసుల్లో ఫెయిల్ ఒక్కటీ లేదు. ఆయన తన ప్రపంచ పర్యటనలో భాగంగా ఓ నగరానికొచ్చాడు. అతణ్ణి ఆట పట్టించటానికని కొందరు యువకులు ఆ నగరంలోని ఓ సత్పురుషుని ఫోటో తీసుకెళ్లి ఆ జ్యోతిష్కునికి చూపించి ఆయనను గూర్చి చెప్పమని అడిగారు. ఆ సత్పురుషుని గుణం కల్తీ లేని బంగారం. మచ్చలేని అతని వ్యక్తిత్వం ఆ ఊరి జనానికంతా సుపరిచితం. ఆ సత్పురుషుని ఫోటో చూసిన తక్షణమే “ఇతడు సకల చెడుల పుట్ట. ఒక్కొక్క చెడును గురించి చెబితే చేంతాడంత అవుతుంది. ఇతని అంతరంగం అన్ని చెడులకు నిలయం” అన్నాడు ఆ జ్యోతిష్కుడు తెచ్చిన వారికి ఆ ఫోటో తిరిగి ఇచ్చివేస్తూ. అది విన్న ఆ యువకులకు మతి భ్రమించినంత పనైంది. మంచితనానికి ఆ సత్పురుషుడూ, జ్యోతిష్యంలో ఆ జ్యోతిష్కుడూ వాసిలో ఇద్దరికి ఇద్దరూ ఖచ్చితమైన వారే. దిక్కుతోచక తిరిగి వెళ్లి జరిగిన విషయాన్ని ఆ సత్పురుషునికి చెప్పారు ఆ యువకులు. “ఆ జ్యోతిష్కుడెవరో మహా మేధావిలా ఉన్నాడు. అతను చెప్పింది నూటికి నూరు పాళ్లు నిజం” అన్నాడు చిరునవ్వుతో ఆ సత్పురుషుడు. జుట్టు పీక్కున్నంతపనైంది ఆ యువకులకు. “అయ్యా మహానుభావా! మీరిద్దరూ మహానుభావులే కావచ్చు కాని మా మట్టి బుర్రలకు ఎక్కని మీ భావాలలోని అర్థమేమిటో కాస్త చెప్పండి అన్నారు. ఇందులో రహస్యమేమీలేదు ఆ జ్యోతిష్కుడు చెప్పిన దుర్గుణాలన్నీ అంతర్గతంగా ప్రతి మనిషిలో ఉన్నట్టు నాలో కూడా ఉన్న మాట వాస్తవమే. ఇది నా “లోని” విషయం నాకు మాత్రమే తెలుసు, కాబట్టి నేను చెబుతున్నది అక్షరాలా నిజం నమ్మండి. “మరి మీలోని ఆ చెడులు మాకు ఏనాడూ కనిపించలేదే?” అడిగారు ఆ యువకులు.. ఆ సత్పురుషుడు వారి వైపు మరో చిరునవ్వు విసురుతూ “చూడండి బాబూ మనిషి మనసు అత్యాశల ఓ అక్షయపాత్ర. అది మానవ జాతి అశాంతి అలజడులకు కారకం. మానవ సమాజం పాలిట హలాహలం. దానిపై మూత బిగించి దానిపై ఎంతగా బరువు పెడితే సమాజానికి అంత క్షేమకరం. తన ప్రతి

కదలికను దైవం గమనిస్తున్నాడనీ, ప్రతి దుష్కర్మకు తాను దైవానికి సమాధానం చెప్పుకోవాలనే "దైవభీతి" మాత్రమే దానికి తగిన బరువు. నా వికృత విశృంఖల మనోవాంఛల పాత్రపై నేను ఆ బరువును పెట్టుకున్నాను. అది అలా ఉన్నంతకాలం ఆ హలాహల విషవాయువులు బయటికి వెలువడవు. ఇంతకాలంగా అలాంటి "నన్నే" మీరు చూస్తున్నది. నాలోని చెడు ఆలోచనలను అదిమి పట్టిన దైవభీతి అనే ఆ బరువు ఎప్పుడయితే సడలి తేలికపడుతుందో నాలోని ఆ చెడులు ఒక్కసారిగా ఉబికి ప్రత్యక్షమవుతాయి, నా అసలు రూపం బహిర్గతమవుతుంది. సర్వమానవుల నీతి ఇంతే. మానవ సమాజంలోని సమస్త చెడులకు మూలకారణమైన విశృంఖల మనోవాంఛల చీడను అణచివేయటం కేవలం ఒక్క దైవభీతితోనే సాధ్యం" అంటూ ముగించాడు ఆ సత్పురుషుడు.

మంచి సమాజానికి కేవలం మనుషులే కాదు మంచి మనసుల మనుషులు అవసరం. మనోవాంఛలకు కళ్లెం వేయటం వల్లనే ఆ మంచి మనసులు మొగ్గలు తొడుగుతాయి. దైవకారుణ్య హిమ సమీర వీచికలకే ఆ మొగ్గలు వికసిస్తాయి. అది వినా ఓ సుందర మానవ సమాజ నిర్మాణం ఓ కథగా, కలగానే మిగిలిపోతుంది.



# ౨౮

## ఓటి బతుకులు

"అమ్మా ఇంత అన్నం పెట్టు తల్లీ", ఆ దీన నాదం కడుపు నిండిన వాళ్లకు కమ్చీ దెబ్బలా ఉంది. నోటి వరకు వచ్చిన ముద్దను అప్రయత్నంగా కంచంలో జారవిడిచిన ఫరీదా, భర్త వారిస్తున్నా ఓ ప్లేట్‌లో కాస్త అన్నం వేసుకుని ఆమెకు వేద్దామని వరండాలోకి వచ్చింది. బిచ్చగత్తెను ఆ స్థితిలో చూసి చలించిపోయిన ఫరీదా కాస్సేపు అలాగే నిలబడిపోయింది. ఆమెపై తాండవిస్తున్న దుర్భర దారిద్ర్యం ఆమె కళ్లలో నుండి తొంగిచూస్తున్న యవ్వనాన్ని ఆపలేకపోతూ ఉంది. పాతికేళ్లలోపుగానే ఉన్న ఆమెను చూస్తూంటే కాస్త చదువు సంస్కారం ఉన్న విధివంచితలా ఉంది. ఆ చిన్న వయసులోనే చంకలో ఒకడు, కడుపులో ఒకడు. చింపిరి జుత్తు, చిరిగిన వస్త్రాలు, ఎన్నాళ్లయిందో స్నానం చేసి జోలెతో సహా చిరగని వస్తువంటూ ఏదీ లేదు ఆమెపై. ఎన్నాళ్లయిందో సరిగా తిండిలేక కడుపు వీపునంటుతూ ఉంది. ఆకలిగా చూస్తూ ఉంటే తేరుకొని తనవద్దకు వస్తున్న ఫరీదాను చూసి చేతిలోని పళ్లెం చాచింది. చిల్లులు పడ్డ ఆ పళ్లెంలో వేయబోయి "ఈ పళ్లెం పగిలిపోయింది... ఆ జోలె పట్టు వేస్తా" అంది ఫరీదా జోలెవైపు చూస్తూ.

"జోలెలో పిల్లాడున్నాడమ్మా..." అంది కాస్త తెరిచి చూపిస్తూ.

ఆ జోలెలో ఏడాది నిండని ఓ బాబు గుడ్లు మిటకరిస్తూ ఆమె స్తనాన్ని బలంగా చీకుతూ ఉంటే కలుగుతున్న బాధ ఆమె ముఖ కవళికల్లో కనపడుతూ ఉంది. ఆ దృశ్యాన్ని చూసిన ఫరీదా కళ్లలో నీళ్లు తిరిగాయి. కడుపులోని వాడు రక్తాన్ని తాగుతూ ఉంటే, జోలెలో వాడు పాలుతాగుతున్నాడు. చంకలో ఉన్నవాడు అమ్మనే బొమ్మగా చేసుకొని ఆమె ముఖం మీద కొడుతూ గిల్లుతూ ఆడుకుంటున్నాడు. ఎన్నాళ్ల నుంచి అలా గిల్లుతూ ఉన్నాడో ముఖమంతా గాట్లు పడ్డాయి. అయినా ఆమె పెదవులపై బలహీనమైన చిరు నవ్వు "ప్రభూ!..... ఓ నిఖిలలోక నియామకా!! సృష్టిలో తల్లిని ఏ ఉత్కృష్ట పదార్థంతో చేశావయ్యా...." అంటూ బావురుమంది

ఫరీదా మనసు. "ఈ ఇద్దరు పిల్లల తలలకు ఆ కట్టేమిటి?" అడిగింది ఫరీదా. "క్రింద పడ్డారమ్మా... రక్తమొచ్చింది కట్టు కట్టాను....." అంది ఆమె ముక్తసరిగా చంకనున్నవాడి తల నిమురుతూ. "నీ తలకు ఆ కట్టు ఏమిటి ప్రేమగా అడిగింది ఫరీదా "అదీ.... అదీ.... నిన్న రాత్రి మా ఆయన కొట్టాడమ్మా......చూపులు వాల్చి నసుగుతూ అమాయకంగా అంది కాస్త సిగ్గుపడుతూ రాని చిరునవ్వును తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ. "కొట్టాడా.....? ఎందుకని?" ఆమె భర్తపై కోపంతో అంది ఫరీదా. "అన్నం తక్కువ తెచ్చానని కొట్టాడు" చంటి పిల్లలా గొల్లుమని ఏడుస్తూ "నువ్వే చెప్పమ్మా..... ఎవరేస్తారు అన్నం.... ఎవరో నీలాంటి కొంతమంది మంచోళ్లు తప్ప..... ఎంత తిరిగినా అంతే దొరుకుతుంది.... నేనేం చెయ్యాలి.... తాగొచ్చి బాగా కొడతాడు...." చెరుగుతో ముక్కు తుడుచుకుంటూ ఆమె అంటూ ఉంటే ఎంత చీకినా పాలు రాలేదేమో జోలెలోని వాడూ ఏడుస్తున్నాడు...." నువ్వు ఏడవకే అమ్మా.... నువ్వు ఏడిస్తే నాకూ ఏడుపొస్తుంది" అన్నట్టులా ఉంది వాడి ఏడుపు. చంకలోని వాడు ఆమె మూతి గిల్లటం మానేసి ఆమె కన్నీళ్లు తుడుస్తున్నాడు అదో ఆటలా. ఆ దృశ్యం చూసిన ఫరీదాకు భోరున ఏడ్వాలనిపించింది.

"నువ్వు చదువుకున్న దానిలా...." ఫరీదా మాటను మధ్యలోనే అందుకొని "ఔనమ్మా.... టెన్త్ పాసయ్యాను".... ఆ పై మాట పెగలలేదు. పొంగివస్తున్న దుఃఖంతో వణుకుతున్న పెదాలను మునిపళ్లతో నొక్కి బలవంతంగా ఆపుకోటానికి ప్రయత్నిస్తూ "మా అమ్మా నాన్నా ఒక బస్సు ప్రమాదంలో చనిపోయారు... మా పేదరికాన్ని చూసి దగ్గర బంధువులెవ్వరూ నన్ను ఆదుకోలేదు... దిక్కులేని దాన్ని ఘోరంగా మోసపోయాను...." అంది బోరున ఏడుస్తూ.

అంతా విన్న ఫరీదా కళ్ల వెంట నీళ్ళు కురిశాయి. దుఃఖం కోపం ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నట్లు "వాణ్ని చూపు, పట్టుకొని ఎముకలు విరగ్గొడతాను" అంది ఫరీదా. "ఆయన మంచం పడితే చూడవలసింది నేనే గదమ్మా మందులు మాకులు డబ్బు ఎక్కడి నుంచి తెచ్చేది...." అన్న ఆమె అమాయక మాటలను విన్న ఫరీదా ముఖంలో జాలి, ప్రేమ, నవ్వు మిళితమయ్యాయి. బిరబిరా ఇంట్లోకి వెళ్లి వండుకున్నదంతా తీసుకొచ్చి పళ్లెంతోపాటు తీసుకెళ్లమని చెబుతూ "అమ్మాయ్.... నీ ఇద్దరి పిల్లల తలలూ, నీ తలా, నీ కంచం.... ఆ ప్లాస్టిక్ బేసిన్ అన్నీ పగిలే ఉన్నాయ్... వొంటి పైని నీ గుడ్డలన్నీ ఆ జోలెతో సహా అన్నీ చిరిగే ఉన్నాయ్.... నీ

వద్ద పగిలిపోనిదీ, చిరిగిపోనిదంటూ ఏదైనా ఉందా?" అడిగింది ఫరీదా తనదైన శైలిలో...

"హూс.. లేకేం... ఉందమ్మా" అంది ఆమె నిస్పృహగా... "ఏమిటది?" అడిగింది ఫరీదా ఆ మాత్రానికైనా సంతోషిద్దామని. "నా.... దురదృష్టం.... నా చిన్నప్పటి నుండి చెక్కుచెదరకుండా ఉంది అదొక్కటే నమ్మా.... అదొక్కటే...." వస్తానమ్మా.... బొంగురుపోయిన గొంతుతో అంటూ తన భుజాన అటూ ఇటూ వేలాడుతున్న పగిలిపోయిన పాత ప్లాస్టిక్ ముక్కల కావిడిని సర్దుకుంటూ, పగిలిపోయిన పాత ప్లాస్టిక్ సామానులు కొంటాం.... అంటూ గట్టిగా అరుస్తూ అలా వెడుతూ ఉంటే ఆవరించిన కన్నీటి తెరల్ని కనురెప్పలతో వొత్తుకుంటూ "హూс.... అవి కూడా పగిలినవే...." అనుకుంటూ భారంగా ఇంట్లోకి వెడుతున్న ఫరీదా స్మృతుల్లో ఎప్పుడో తన చదువుకునే రోజుల్లో సభలు సమావేశాల్లో గొప్పోళ్ల నోట విన్న "కలకంఠి కంట కన్నీరొలికిన గరళమైపోవును అమృతమే"

"ఏ దేశంలో స్త్రీ కన్నీరు పెడుతుందో అక్కడ పంటలు పండవు"

"ఆలయాన వెలసిన ఆ దేవుని రీతి ఇల్లాలే ఈ జగతికి జీవన జ్యోతి" లాంటి మాటలు మరోసారి వినిపించాయి.



# ౨౯

# ఆచరణ లేని ఆరాధనలేల?

ఆమె ముప్పై ఏళ్ల వయస్కురాలు, ఆరేళ్ల బాబు. ఓ నాలుగేళ్ల అమ్మాయి ఆమె వెంట ఉన్నారు. వారి దుస్తులు బాగా మాసిపోయి ఉన్నయ్. పాలిపోయిన వారి ముఖాలు, పీక్కుపోయిన వారి కళ్లు చూస్తూనే తెలిసిపోతుంది. కడుపునిండా తిండి లేక ఎన్నాళ్లో అయి ఉంటుందని.

ఆకలౌంతూందమ్మా.... అన్నట్టుంది ఆ పిల్లలు. ఏదో చెప్పి ఓదారుస్తూ ఉంది ఆ తల్లి.

"ఎవరమ్మా నీవు?.... ఇలారా" అంది అంతవరకూ వారిని గమనిస్తున్న ఎదురింటావిడ. అయిష్టంగాననే వెళ్లింది ఆమె. పిల్లలు తల్లిని వెంబడించారు.

"ఎవరమ్మా నీవు? అన్నం కావాలా?" అంది అప్యాయంగా ఆమెను పిలిచిన గృహిణి కాంపౌండు గేటుకు దగ్గరగా వస్తూ.

ఆ మాటలు వింటూనే కళ్లల్లో నీళ్లు తిరిగాయి ఆమెకు. పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని బలవంతంగా ఆపుకోటానికి ప్రయత్నిస్తూ.. "నేను అడుక్కోటానికి రాలేదమ్మా! నా భర్త చిన్న వ్యాపారం చేస్తూ మమ్మల్ని పోషిస్తూ ఉండేవాడు. దేవుని దయవల్ల మా సంసారం లోటు లేకుండా సాగిపోతూ ఉండేది. కాని ఇటీవలె ఓ లారీ ప్రమాదంలో నా భర్త చనిపోయాడు... " పొరలి వస్తున్న దుఃఖంలో మాటలు ఆగిపోయాయి. "ఏడవకమ్మా, కాస్త ముందు వెనక అందరూ దేవుని వద్దకు వెళ్లి పోవలసిన వాళ్లమే" అంటూ ఓదార్చింది ఆ గృహిణి.

"వాళ్ల నాన్న ఉండగా నా పిల్లలు ఏనాడూ పస్తుండలేదు. ఆ తరువాత ఇంట్లో ఉన్న కొద్దిపాటి సామాను ఒక్కొక్కటిగా అమ్మి అర్థ కడుపుకైనా తినేవాళ్లం. కాని నిన్నటి నుండి అదీ లేదు. ఏం చెయ్యాలో దిక్కు తోచక ఇంటి నుండి ఇలా బయలుదేరాను" అంది ఆ స్త్రీ కన్నీళ్లొత్తుకుంటూ. "నీ పేరేమిటమ్మా" అడిగింది గృహిణి.

"ఆయిషా, ఫాతిమా, ఖాసిం ఈ పిల్లలకు వాళ్ల నాన్న అతి గారాబంగా పెట్టుకున్న పేర్లు... మీ ఇంట్లో ఏదైనా పని ఇప్పించండమ్మా పని చేసుకుంటూ నా పిల్లల్ని పోషించుకుంటాను" అంటూ ఆశగా అడిగింది.

"లేదమ్మా, ఈ ఇంటికి అలాంటి అవసరమేదీ లేదు. రా, కాస్త అన్నం పెడతాను తినిపోదురుగాని" అంటూ గేటు తెరిచి లోపలికి వెళ్లిపోయింది ఇంటావిడ. పిల్లల ఆకలి బాధ చూడలేక అయిష్టంగానే అడుగు ముందుకు వేసింది ఆయిషా పిల్లల్ని చెరో చేత్తో పట్టుకొని.

"అమ్మా! అడుక్కు తినకూడదు అనే దానివిగా?" అన్నాడు ఖాసిం అమ్మ నేర్పిన ధర్మాలు గుర్తుకురాగా.

"నిజమే బాబూ! మనం అడక్కు తినటం లేదు. ప్రేమతో ఈ తల్లి పెడతానంటుంటే విధిలేని పరిస్థితుల్లో మనం వస్తున్నాం" అన్నది ఆ స్త్రీ.

"ఏయ్.... ఎవరు నువ్వు? ఎందుకిలా లోపలికి వస్తున్నావ్? ఇదేం నీ బాబుగారి ఇల్లనుకున్నావా? వెళ్లు." గర్జిస్తూ బయటికి వచ్చింది ఓ ముసలావిడ చేతిలో జపమాల ఆడిస్తూ.

"ఏమైంది నీకు! బర్రెలా ఉన్నావు- కష్టం చేసుకోలేవూ?"

"అందుకే వచ్చానమ్మా!"

"నోర్మూయ్! అంతా నటన. దొంగలు అంతా దొంగలు. ఇంట్లో పని మనిషిగా చేరి దోచుకుపోవటం నేర్చుకున్నారు. ఊఁ వెడతావా లేదా...?"

"రెండు రోజులుగా పిల్లలు పస్తున్నారమ్మా! ఆ తల్లి కాస్త అన్నం పెడతానంటే...."

"చాల్లే. ఇదేం ధర్మసత్రం అనుకున్నావా? అది నా కోడలు. నన్నడగకుండా అదెవరు నీకు అన్నం పెట్టటానికి? కావాలంటే దాని బాబు ఇంటికి తీసుకెళ్లి పెట్టమను ఊఁ వెళ్లు."

"ఒసేవ్...! అంటూ లోపలికి వెళ్లిపోయింది ముసలావిడ.

"అమ్మా వెడదాం పద. ఆమె మళ్లీ వస్తే కొడుతుందేమో అన్నాడు ఖాసిం భయంతో.

"నిజమే బాబూ, వెడదాం పద." అంటూ వికల మనస్సుతో వెను తిరిగింది ఆయిషా

"అమ్మా" పిలిచాడు ఖాసిం నడుస్తూనే.

"ఏం బాబూ?"

"అపనిందలు వేయకూడదని ప్రవక్తగారు చెప్పారన్నావుగా?

"ఔను బాబూ!"

"మరి ఆ ముసలమ్మ చేతిలో జపమాల, ఆమె తీరు చూస్తే ఐదు పూటలా నమాజు చేసే విధంగా కన్పిస్తూంది మరి ఆమె నిజం తెలుసుకోకుండా నిన్ను దొంగ అనేసిందే?" ప్రశ్నించాడు కొడుకు ఖాసిం.

"ఆవిడ సంగతి ఏమోగాని నువ్వు మాత్రం అలా చెయ్యకు" అంది బలహీనంగా నవ్వుతూ.

అలా ఆ తల్లీ పిల్లలు ఓ ఫర్లాంగు దూరం నడిచి వెళ్లారు. అక్కడ రోడ్డు పక్కనే ఓ విశాలమయిన భవనం, సుందరంగా తీర్చిదిద్దిన చెట్ల మధ్య శోభాయమానంగా ఉంది. గేటువద్ద చౌకీదార్లు, ఖరీదైన జాతి కుక్కలు. చూస్తేనే అది ఓ కోటీశ్వరుని ఇల్లని ఇట్టే తెలిసిపోతుంది. ఇంటి వరండా భాగంలో ఇరవై ఏళ్ల ఓ అందమైన యువతి సీమ కుక్కను వళ్లో పెట్టుకుని దానికి ఖరీదైన బిస్కెట్‌లను బలవంతంగా తినపించటానికి ప్రయత్నిస్తూ ఉంది.

ఆయిషా గేటు దగ్గరకు రాగానే ఆమె ఎత్తుకున్న ఫాతిమా కళ్లు అప్రయత్నంగా ఆ బిస్కెట్టుపై పడ్డాయి. ఆ చిన్నారి ఆశగా అటు చూస్తూ "అమ్మా బిస్కట్టు" అంది ఆ వైపు చెయ్యెత్తి చూపుతూ.

అదేమిటో అని నడుస్తున్న ఆయెషా గేటు దగ్గరే నిలబడి పోయింది.

"ఏయ్.... కౌన్‌హై చలే జావ్ యహాఁ సే.. మేరే సోనీకో నజర్ లగ్‌జాయేగి..... బద్మాష్ లోగ్ కహీఁ కె. ఏయ్ మాలీ! అంటూ దిష్టి తగులుతుందేమో అన్నట్టుగా కుక్కపై తువాలు కప్పుకొని లోపలికి వెళ్లిపోయింది ఆ యువతి.

ఆ మాటలు విన్న ఆయిషా కళ్లల్లో మరోసారి నీళ్లు తిరిగాయి.

"పదండి బాబూ వెడదాం..." అంటూ నడక సాగించింది. ఆకలి మంటకు

మండుటెండ తోడై నవటానికి శక్తిలేక ఆ దగ్గర్లో ఉన్న చెట్టుకింద అరుగుపై చతికిల బడింది ఆయిషా.

"చల్లగా ఉంది కాస్సేపు పడుకోబాబూ!..." అంది ఆ విధంగా కాస్సేపయినా పిల్లలు ఆకలి బాధను మరిచిపోతారేమో అనే ఆశతో.

ఏదో ఆలోచిస్తున్న ఖాసిం ఆ మాటలు వినిపించుకోకుండా "అమ్మా!" అని పిలిచాడు.

"ఏం బాబూ.. ఆకలైన వాళ్లకు అన్నం పెట్టాలని ప్రవక్త గారు చెప్పారన్నావు కదూ? "ఔను బాబూ అది ప్రవక్త గారి ప్రవచనం మన మందరం పాటించాలి"

"ఇందాక ఆమె కుక్కకు బలవంతంగా బిస్కట్టు తినిపించింది. కాని ఆకలితో మనం వస్తే గద్దించి వేసిందేమిటి?

"ఆ కారుణ్యమూర్తి చెప్పిన ప్రవచనాలు అనుసరించే వారికోసమే నాయనా!" అంది ఓదార్పుగా ఆయిషా.

"పోమ్మా! నువ్వు అట్లాగే అంటావు. నాన్న పోయిన తరువాత మనల్ని ఎవరూ ఆదరించటం లేదు. ఆకలితో ఉంటే ఇంత అన్నమైనా పెట్టడం లేదు. పైగా కసిరి కొడుతున్నారు. ప్రవక్తగారు అనాధలను ఆదరించారన్నావు, ప్రేమగా చూసేవారన్నావు. మరి ఆయన మాటలు ఇక్కడ ఒక్కరూ వినటం లేదు" అని విసుకుంటూ "అమ్మా ఒక మాట చెప్పనా?" ఆశగా అడిగాడు ఖాసిం స్వరం తగ్గించి.

"చెప్పు బాబూ!"

నాకు చాలా ఆకలేస్తుందమ్మా! ఇక్కడ మనకు ఎవరూ అన్నం పెట్టేటట్టు లేరు గాని... నేను ప్రవక్త గారి దగ్గరికే వెళతాను. నీకు చెల్లికి కూడా అన్నం తీసుకొస్తాను. ఆయన ఎక్కడున్నారో చెప్పు" అన్నాడు.

ఆ మాటలు విన్న ఆయిషాకు దుఃఖం కట్టలు తెంచుకుంది.

"బాబూ....! అంటూ ఖాశింను గుండెలకు హత్తుకుంది.

ఆ విధంగా ఆకలితో అలసిన ఆ అనాధ జీవులకు చెట్టు కింద చల్లగాలికి కాస్సేపటికే కునుకు పట్టింది.

ఓ అరగంట తరువాత ఆ దగ్గర్లో బయలు దేరిన ఓ పెద్ద కలకలానికి దిగ్గున

లేచింది ఆయిషా. కాస్త దూరంలో రోడ్డుపై ఓ పెద్ద జన సమూహం కనిపించింది. తలా ఓ మాట అంటున్నారు. కలగలుపుగా అస్పష్టంగా ఉన్న ఆ మాటలు సరిగ్గా అర్థం కాలేదు ఆయిషాకు. పడుకున్న పిల్లల వైపు చూసింది. ఖాసిం కనిపించలేదు. గుండెలు పగిలిపోయినంత పనైంది ఆయిషాకు. ఫాతిమాను ఎత్తుకొని ఆ గుంపు వైపు గబగబా నడిచింది. జనాన్ని తోసుకుంటూ ముందుకు వెళ్లింది. ఆ దృశ్యాన్ని చూస్తూనే కెవ్వున కేక పెట్టి కుప్పకూలి పోయింది ఆయిషా.

అది ఓ అంబాసిడర్ కార్. కారు ముందు భాగంలో ఖాసిం శవం రక్తపు మడుగులో పడి ఉంది. ఎవరో ప్రభుత్వ శాఖాధికారి కుక్క కాలికి ముల్లుగుచ్చుకుంటే దాన్ని డాక్టరు వద్దకు తీసకెళుతున్నారట. దారిలో ఆ కారు ఢీ కొని పిల్లవాడు ప్రాణాలు వదిలాడని చెప్పుకుంటున్నారు జనం. అక్కడున్న స్త్రీలు స్పృహ పడిపోయిన ఆయిషా ముఖంపై నీళ్లు చల్లారు.

కాస్సేపటికి తేరుకున్న ఆయిషా ఖాశిం శవంపై పడి బాబూ..... పెళ్లిపోయావా.... ఆకలి ఆకలి అంటూ ప్రవక్త దగ్గరకు వెళ్లి పోయావా బాబూ.... మా కోసం అన్నం తెస్తానన్నావే. ఎప్పుడొస్తావు బాబూ! అంటూ హృదయ విదారకంగా విలపించసాగింది.

"భయ్యా! ఉఠో భయ్యా" అంటూ అమాయకంగా ఏడుస్తూ శవం చేయి పట్టి లాగుతూ ఉన్న చిన్నారి ఫాతిమాను చూసిన జనం గుండెలు తరుక్కుపోయాయి.

ఏమండీ సాయిబు గారూ! అస్తమానం ఇలా జపమాల తిప్పుకుంటూ తిరిగే బదులు ఇలాంటి దిక్కులేని వాళ్లను ఆదుకోటానికి మీలాంటి వాళ్లు ఏదైనా ప్రయత్నం చేయకూడదు?" అంటూ అక్కడే చేతిలో జపమాల పట్టుకొని ఉన్న ఓ సాయిబు గారిని ఉద్దేశించి మరో ఆయన అంటుడటం వినిపించింది.



# 30

## వినిపించే ధర్మం కనిపించాలి

మీలాదున్నబి సందర్భంగా సీరత్‌పై బహిరంగ సభ ప్రతిఏటా జరుపుతారు ఆ ఊళ్లో నిర్వాహకులు. ఈసారి మునుపెన్నడూ లేనివిధంగా రాష్ట్ర స్థాయిలో ప్రముఖ వక్తలను ఆహ్వానించి పెద్దఎత్తున ఏర్పాట్లు చేశారు. జనం కూడా పెద్దసంఖ్యలో హాజరయ్యారు. నగరంలోని ప్రధాన రోడ్లకు ఇరువైపులా అలంకరించిన రంగురంగుల విద్యుద్దీ పాలతో మిరుమిట్లు గొలిపే ఫ్లడ్‌లైట్లతో పట్టపగలుగా మారిపోయింది ఆ రాత్రి. ఊరంతా పండుగ వాతావరణం నెలకొని శోభాయమానంగా ఉంది. ఇక సభా ప్రాంగణం, వేదిక స్థలమయితే ప్రత్యేకంగా అత్యంత సుందరంగా అలంకరించబడింది. ఇతర మతాలకు చెందిన ప్రముఖ వక్తలను కూడా ఆహ్వానించటం ఆ సమావేశపు ప్రత్యేకత.

వివిధ మతాలకు చెందిన ప్రముఖులు ఒకేచోట అలా ఆశీనులు కావటం చూస్తుంటే భిన్నత్వంలో ఏకత్వా నికి ప్రతీకగా నిలిచిన ఓ సుందర భారతదేశపు చిన్ని నమూనాలా కనిపిస్తూ వుంది ఆ వేదిక. ఖరీదైన జుబ్బా పైజమాతో వేదికపై కన్వీనర్‌గా ఉన్న ఓ యువకుడు స్వచ్ఛమైన తేనెలొలుకు తెలుగు భాషతో వేదికను అలరిస్తున్నాడు. ప్రేక్షకులను ఆకట్టుకుంటున్నాడు... "మహాశయులారా! ఏటి నీటి అలలకు గలగలలు నేర్పిన, సాగర కెరటాలకు పరుగుల పరవళ్ళు చూపిన, ప్రేక్షకుల మనో మస్తిష్కాలలో చెరగని జ్ఞాపకాల జ్ఞాపికలను అందించగల తెలుగు భాషా కోవిదులు రాష్ట్ర దళిత సంఘ నాయకులు, విశ్వవిద్యాలయ ఆచార్యులు గౌరవనీయులైన శ్రీ యాదయ్యగారిని ప్రసంగించవలసిందిగా ఆహ్వానిస్తున్నాను. శ్రీ యాదయ్య గారు... అంటూ కన్వీనర్ కాస్త పక్కకు తొలుగుతూనే ప్రేక్షకుల నుండి పెద్దపెట్టున ఆగ కుండా మ్రోగుతున్న కరతాళ ధ్వనుల మధ్య ప్రేక్షక సమూహానికి నమస్కరిస్తూ మైక్రోఫోన్‌ను అనువుగా సర్దుకుంటూ ఉంటే కరతాళ ధ్వనులు ఆగిపోయి నిశ్శబ్దం ఆవరించింది. యాదయ్యగారి ప్రసంగం అందుకుంది.

... గౌరవనీయ సభాధ్యక్షులు, వేదికనలంకరించిన గౌరవనీయ మిత్రులు, శుభప్రదమైన ఈ సీరత్ సభను పెద్ద ఎత్తున ఏర్పాటు చేసి ఇతర ధర్మాల సోదరులను

కూడా తమ వేదికపై ఆహ్వానించిన సభా నిర్వాహకులూ, ముస్లిం, ముస్లి మేతర సోదర సోదరీమణులూ, భావి కాలానికి వారసులైన వర్తమాన యువకులూ అందరికీ నమస్తే... అనంత కరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో... అనగానే ప్రేక్షకులు చప్పట్లు చరుస్తూ ఉంటే... నాకు తెలుసు ఇంకా నేనేమీ మాట్లాడకుండానే మీరు చప్పట్లు చరుస్తున్నారంటే యాదయ్యా ఏమిటి.. అల్లాహ్ పేరు తీసుకోవడమేమిటని... కదూ... మహాశయులారా! ఇలాంటి సభల్లో నేను మాట్లాడటం ఇది తొలిసారి కాదు. ఇలాంటి సభలకు ముస్లిం సోదరులు నన్ను ప్రేమతో ఆహ్వానించినప్పుడు నాకు కలిగే సంతోషాన్ని వ్యక్తం చేయటానికి భాష చాలదు. అందుకు నేను నా రాష్ట్ర దళితుల తరఫున, యావత్ ముస్లిమేతర సోదర సోదరీమణుల తరఫున ముస్లిం సోదర సమాజానికి నా శతకోటి సలాములు...(మళ్ళీ చప్పట్లు మారు మ్రోగాయి). అయ్యా! మీరు పదేపదే అలా చప్పట్లు కొడుతూ ఉంటే ఇక చాల్లే పద.. పద అంటూ నా వీపు చరుస్తారేమోనని భయంగా ఉంది. (ప్రేక్షకుల్లోనుండి నవ్వులు). యాదయ్య ఒక్కసారిగా గంభీర వదనులై.. సోదర సోదరీమణులారా! నవ్వులు కాదు. ఈనాడు మానవజాతికి జాతి అంతా కట్టకట్టుకొని భోరున ఏడ్వవలసినంత నైతికంగా పతనమైపోతూ వుంది మన జాతి. ఇక్కడ నేనెవరినీ వ్యక్తిగతంగానో, వర్గపరంగానో, మతపరంగానో ప్రస్తావించడంలేదు. మతాలు ఏవైనా, వర్గాలు ఏవైనా అవన్నీ మానవ సమూహాలే. నేను మానవజాతిని ప్రస్తావిస్తున్నాను. నేనూ ఆ కుటుంబంలోని ఒక సభ్యుణ్ణే కాబట్టి నన్ను నేనూ ప్రస్తావించుకుంటున్నాను. పైవాడు సృష్టించిన మానవ జాతి దానవ జాతిగా మారిపోతూ ఉంది. ఉత్తమ జన్మనిచ్చి దేవుడు ఉత్కృష్టంగా సృష్టిస్తే నికృష్టంగా మారిపోతూ ఉంది. ధర్మ అధర్మాలను, విహిత అవిహితాలను మరిచి తనకు తానే సిగ్గుపడేంతగా నైతిక పతనంవైపు ఘోరాతిఘోరంగా దూసుకుపోతూ ఉన్న మన మానవజాతి ఏమైపోతుందో? చివరకు ఎక్కడ తేలుతుందో? తలుచుకుంటే భయమేస్తూ వుంది. మహాశయులారా! ఇలాంటి సభల్లో మాట్లాడటానికి నన్ను ఆహ్వానించటానికి వచ్చే నా ముస్లిం మిత్రులు కొంత ఇస్లాం సాహిత్యాన్ని ఇస్తూ ఉంటారు. నేను శ్రద్ధగా చదువుతూఉంటాను. ఖుర్ఆన్‌లోని ఒక వచనం చదివినప్పుడు.. నిజం చెబుతున్నాను నమ్మండి. నేనైతే వణికిపోయాను. ఆ వచనం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అదే గుండె దడ. ఇప్పుడూ ఆ దడతోనే అంటున్నాను 'నవ్వుతున్నారా? మీకు ఏడ్పురావటంలేదా?' అంటూ మానవజాతిని ప్రశ్నిస్తుంది ఆ వచనం. 'మీ జీవన పర్యవసనాన్ని వాస్తవాల కోణంలో ఆలోచించగలిగిన నాడు మీరు నవ్వడం మానేస్తారు'. అంటారు ఒక సందర్భంగా

అయినా చివరిమాటగా చెబుతున్నాను. ఇహలోక సమస్యలకూ, పరలోక సాఫల్యా నికి ఇస్లాం ఒక్కటే పరిష్కారం, దైవప్రవక్త ముహమ్మద్ గారి శుభకర జీవితమే మానవాళికి ఆదర్శం అని మళ్ళీ మళ్ళీ నిస్సంకోచంగా, నిర్ద్వందంగా చెబుతున్నాను. ఈ సందర్భంగా ముస్లిం సమాజానికి నా సవినయమైన మనవి ఏమిటంటే.. ప్లీజ్... ప్లీజ్.. వెయ్యిసార్లు ప్లీజ్. మీరు విశ్వసించిన ఇస్లాం ధర్మాన్ని మీ ఆచరణ ద్వారా చూపగలిగితే చూడాలని తరతరాలుగా సామాజిక అణిచివేతకు గురవుతున్న మాలాంటి అమాయక జనం మీ వైపుగా ఆశగా చూస్తున్నారు. వారికి కావలసింది సభలూ, సమూహాలు, సమావేశాలూ, రంగురంగుల లైట్లు కాదు. అవైతే అంతటా ఉన్నాయి. అసలు ఆ సంస్కృతి నుంచి విసిగి వేసారిన సమాజం నిజధర్మ పునాదులపైని ఓ సత్సమాజం కోసం ఎదురు చూస్తూ ఉంది. ఈనాడు మానవాళికి కావాలసిందల్లా ఆ మహాప్రవక్త ప్రచనాలకూ, ఖురాన్ వచనాలకు కార్యరూపం. వాటిని ఆచరించి చూపి మరణశయ్యపై ఊపిరిలొదటానికి సిద్ధంగా ఉన్న మానవతను రక్షించటం ముస్లిం సమాజం ప్రథమ కర్తవ్యం.

నా ముస్లిం సోదర సోదరీమణులారా! నన్ను అపార్థం చేసుకోకండి. ఇది చేదుగా అనిపించే తీపి నిజం. నా ఈ సుదీర్ఘ ప్రసంగపు సారాంశాన్ని ఇక ఒకే ఒక్క చిన్న వాక్యంలో చెబుతాను. 1300 సంవత్సరాలుగా లోకానికి ఇస్లాం వినబడుతూనే ఉంది, కాని కనపడటంలేదు. కనిపిస్తే కౌగిలించుకోటానికి లోకం సిద్ధంగా ఉంది. లోకానికి ఇస్లాంను ఆచరణాత్మకంగా చూపవలసిన బాధ్యత, దాన్ని ఆశ్రయిం చినవారమని చెప్పుకునే ముస్లిం సమా జానిదే! గొంతులోని ఇస్లాంను గుండెలో చూపించండి. ఆ పనిచేసి రేపు దేవుని దగ్గర మిమ్మల్ని మీరూ రక్షించుకుంటూ సోదర జనాన్ని రక్షించండి. దేవుడు మనందరికి సద్బుద్ధిని ప్రసాదించుగాక.. సెలవ్" అంటూ కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళి తన స్థానంలో కూర్చున్నారు యాదయ్య. నిశ్చేష్టులైన జనం నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఏదో మంత్ర ప్రభావానికి గురైనట్టు.



తన సాంప్రదాయాలను ఎవరైతే త్రోసిరాజంటారో ధర్మంలో లేని విషయాలు కల్పించుకుంటారో వారు తన లోనివారు కాదంటారు ఆ మహా మనీషి. ఆ మానవ మహోపకారి. ఇక ఈ చేదు నిజాలు కాస్త వినండి. ప్రశాంత చిత్తంతో ఆలోచించండి. మరీ ముఖ్యంగా మహత్తరమైన ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసిన నిర్వాహకులూ! నన్ను క్షమించండి. అంతటి మహా వ్యక్తిత్వాన్ని స్మరించుకుంటూ జరుపుకుంటున్న ఈ శుభదినం నగరమంతా దేదీప్యమానంగా అలంకరించటానికి దొంగతనాన్ని ఏవగించుకున్న ఆ మహానుభావుని జన్మదిన సభకు దొంగ కరెంటా? తనను క్తీర్తిస్తూ పాడకండి అంటూ వారించిన ఆ ప్రవక్తను కీర్తించు కుంటూచెవులు చిల్లలుపడేలా హోరొత్తించే సకల సంగీత వాయిద్యాలతో పాటలా? ప్రతిచోటా దుబారా... దుబారా... దుబారా చేస్తూ షైతాన్‌తో సోదర భావమా? తన సాంప్రదాయాలలో లేనివి, చెప్పనివి కొత్త వాటిని సృష్టించేవారు తన వారు కాదంటూ ఒకవైపు ప్రవక్త మహాశయులు నిర్ద్వందంగా చెబుతూ ఉంటే ఎన్ని కొత్త విషయాలు చేర్చారంటే వాటిలో అసలు ప్రవక్తగారి ప్రవచనాలు దాదాపు కనుమరుగైపోతున్నాయి. లేదా వక్ర భాష్యాలకు గురవుతున్నాయి. ఇలా ఎందుకు చెబుతున్నానంటే ఆ చీటిలో వ్రాసి పంపిన ప్రశ్న 'మీరెందుకు ఇస్లాం స్వీకరించలేద'న్నందుకు. ఇప్పుడు నేనేకాదు నాలాంటి కోటానుకోట్ల మందిని తొలిచివేస్తున్న విషయమేమిటంటే ఇస్లాం ధర్మవాసులనబడుతున్న ముస్లిం సమాజం తరతరాలు గడిచిపోయినా ఆ ధర్మగ్రంథమైన ఖురాన్ ఆదేశాలకు, మహాప్రవక్త ముహమ్మద్ ప్రవచనాలకు ఆచరణలో ఎందుకు అంకితం కాలేకపోతూ ఉంది? వారి జీవితాలలో ఆ ధర్మం ఆచరణ రూపంలో ఎందుకు ప్రస్ఫుటం కాలేకపోతూ ఉంది? వారి జీవితాలను ఇతర ధర్మాల వారి జీవితా లలో పోల్చి చూసుకుంటే కొన్ని ఆరాధనల విషయంలో తప్పచెప్పుకోతగ్గ మార్పు ఏమీ కన్పించడంలేదు. అదే వివాహం, అవే కట్నకానుకలు, అవే వేధింపులు, అవే దినాలు, అవే తద్దినాలు. ప్రాపంచిక వ్యవహారాలలో అన్నీ అవే ధోరణలు, అవే కీచులాటలు, అవే కోర్టు వ్యాజ్యాలు, అదే అవినీతి, అక్రమాలు వారి పండుగలలోలాగే అవే సమూహాలు, అవే జండాలు, అవే సమాధుల మొక్కులు, అవే ఊరేగింపులు, ధర్మం నిషేధించిన డాన్సులు, ఈలలు, అవే వాయిద్యాలు, అవే గానా బజానాలు అన్నీ అవే అనైతికాలు అంతెందుకు చివరకు ఇప్పుడు ఇక్కడే మనందరికీ సజీవ సాక్ష్యంగా నిలిచిన అవే అక్రమ కనెక్షన్ల అవినీతి లైట్లు హోరెత్తించే పాటలు, లౌడ్‌స్పీకర్లు.. అన్నీ అవేగా ఉన్నప్పుడు కేవలం ఉపన్యాసాలతో ఫలితమేముంటుంది?

ఇంకేం మిగిలింది? ఏ పేరు తో పిలుచుకోవాలి ఈ కసాయితనాన్ని...

మహాశయులారా! చాలా సమయమే తీసుకున్నాను. ఇక ఐదే ఐదు నిమిషాల్లో ముగించటానికి ప్రయత్నిస్తాను. ఇంతవరకు చెప్పుకున్నదంతా మానవజాతిని కాటికి చేర్చే రోగాన్ని గురించి.... అయినా ప్రాణాలు పోయేవరకూ బ్రతికించుకోటా నికి ప్రయత్నాలైతే చేస్తూనే ఉండాలిగా? నాకు తెలిసినంతవరకు ఈ రోగానికి దైవగ్రంథమైన ఖురాన్ వైపు మరలటమొక్కటే చికిత్స, మానవ మహోపకారి ముహమ్మద్ ప్రవక్త ఆచరించి చూపిన ఆదర్శ జీవితమే మరణశయ్యపై మూల్గుతున్న ఈ మానవాళి మనుగడకు ఏకైక మార్గం. మహాశయులారా! మరీ ముఖ్యంగా వేదికపైని మిత్రుల్లారా సమాజంలోని మేధావుల్లారా!...తరతరాలుగా సమాజంలోని మిథ్యాభావాల ఉక్కుపాదాల కింద నలిగిపోతూ అణగారిన అసంఖ్యాక మానవ సమూహంలోని వాడిగా, నా మాటగా చెబుతున్నాను. భావధాస్యంతో నాలాంటి దిక్కులేని, మార్గం తెలియని కోటానుకోట్ల జనం అంధకారంలో అలమటిస్తూ ఓకాంతి రేఖ కోసం ఎదురుచూస్తున్నారు. ఆ కాంతిరేఖ ఇస్లాం తప్ప మరేదీ కాజాలదు. ప్రవక్త మార్గమే వారికి ఏకైక మార్గం.. ప్రసంగం కొనసాగుతూఉండగానే జనంలో నుంచి ఎవరో వ్రాసి పంపిన కాగితం ముక్కను అందుకున్న యాదయ్య దాన్ని చదువుకొని నవ్వుకుంటూ.. 'మరి మీరెందుకు ఇస్లాం స్వీకరించకూడదు?' అని వ్రాసి పంపిన ఈ చీటి కోసమే నేను ఇంతవరకూ ఎదురు చూస్తున్నాను. అందుకు ఆ సోదరునికి చాలా చాలా థ్యాంక్స్. విజ్ఞులైనవారు నాలాంటి వాడిని అడగవలసిన ప్రశ్నే ఇది. నేను ఇలాంటి సభలో మాట్లాడిన చోటల్లా ఇలాంటి ప్రశ్నలు వేస్తుంటారు.

ఇస్లాంను గూర్చి ఇంత మంచి అభిప్రాయం ఉన్నవాణ్ణి నేనెందుకు స్వీకరించలేక పోయాను? అంటున్నాడు ఓ సోదరుడు. నిజమే.. దీని సమాధానం నా ప్రసంగంలోనే వస్తుంది. 'వృధా ఖర్చు చేసేవారు షైతాన్ సోదరులు' అంటుంది ఖుర్ఆన్. ఒకసారి దొంగతనం చేసిన ఒక మహిళను విడిచిపెట్టమంటూ ప్రవక్తకు సిఫారసు చేస్తే అందుకు ప్రవక్త మహాశయులు ఆగ్రహోదగ్రులై 'ఆమె స్థానంలో నా కూతురు ఉండినా శిక్షించవలసిందే' అన్నారు ఆ మహాప్రవక్త. ఒక శుభసం దర్భంగా పాటలు పాడుకుంటున్న మహిళలు కొందరు ప్రవక్తగారు వస్తూనే వారిని పొగుడుతూ వ్రాసిన పాటలను పాడడం మొదలెట్టినప్పుడు వెంటనే దాన్ని ఆపి దైవాన్ని స్తుతిస్తూ పాడుకుంటున్న ఆ పాటలనే పాడుకోమన్నారు. డప్పు వినా మరే సంగీత వాయిద్యాలు అభిల షణీయం కాదన్నారు ప్రవక్త. సమయం లేదు కాబట్టి ఈ కొన్నింటిని మాత్రమే ఉదహరిస్తున్నాను. మొత్తంగా తాను తెలిపిన ధర్మానికి

ముహమ్మద్ ప్రవక్తగారు. చూశారా ఒకే ఒక్క చిన్న వచనం, చిన్న ప్రవచనం... నేననుకుంటాను ఇదొక్కటి చాలు మన జీవితాలను సంస్కరించుకోటానికి, ఒక సత్సమాజాన్ని నిర్మించుకోటానికి. మహాశయులారా! నేను దేవలోక విషయమో పాతాళలోక విషయమో మాట్లాడటం లేదు. మానవలోక విషయమే, స్వయాన మనం జీవిస్తున్న మన లోక విషయమే మాట్లాడుతున్నాను. ఈనాడు సాంకేతిక వైజ్ఞానిక రంగాలలో ఎంతో ప్రగతి సాధించుకున్నాము. అనుమానం ఎంతమాత్రం లేదని మన జేబుల్లోని సెల్‌ఫోనే సాక్ష్యమిస్తోంది. బ్రహ్మాండమైన విశ్వాన్ని మడిచి మనిషి పిడికిలిలో పెట్టేసింది మనిషికి దేవుడు ప్రసాదించిన జ్ఞానం. గ్రహాంతరాలకు ప్రయాణం కడుతున్నాం. ఆకాశంతో మాట్లాడుతున్నాం. నక్షత్రాలలో నివాసమేర్పరుచుకోవటానికి ప్రయత్నిస్తున్నాం. సంతోషమేకాని నైతికంగా మన ప్రయాణం ఎటు? పాతాళాలకు! ఒకవైపు భౌతిక ప్రగతి మరోవైపు నైతిక అధోగతి. కోటి విజ్ఞాన జ్యోతులు వెలిగించుకుంటూనే అజ్ఞానాంధకారం లోనికి పయనం!

మహాశయులారా! చెప్పండి ఎంతగా దిగ జారిపోతున్నాం. మనిషిలోని స్వార్థం, ఈర్ష్యా, ద్వేషం మదమత్సరాలు అవినీతి, అక్రమాలు, మానభంగాలు మారణహోమాలు, దగా, మోసం, కుట్ర, హత్యలు, రక్తపుటేరులు ఇంతకన్నా మనకు ఏం సాధించిపెట్టింది? ఈ భౌతిక అభివృద్ధి... మిత్రులారా! నా ఈ రోదన, ఆవేదన కొత్తదేమీ కాదు. మన అందరి గుండెల్లో నిండి పొరలిపోతున్నదే ఈ ఆవేదన, కాకపోతే నేను చెప్పగలిగిన స్థానంలో ఉన్నాను. చెప్పమనే నన్ను పిలిచారు. మీరు వింటున్నారనే చెబుతున్నాను. మహాశయులారా! నైతిక పతనంతో కుళ్ళిపోయిన మనుషుల మనుసుల్ని గూర్చి మీకు ప్రత్యేకంగా చెప్పవలసింది ఏదీలేదు. ఇవన్నీ మీకు తెలియని ఏవో కొత్త వింత విషయాలు ఎంతమాత్రం కావు. అందుకే నేను విలువైన మీ సమయాన్ని వృధా చేయదలుచుకోలేదు. పతనమవుతున్నా ఎంత పతనమవుతున్నామో కూడా కాస్త తెలుసుకొని, మన ప్రగతి సాధించిపెట్టిన కంప్యూటర్లలో కనీసం నిక్షిప్తమైనా చేసుకోగలిగితే, బాగుపడటానికైనా ఇంకా భ్రష్టుపట్టదలచుకున్నా భావితరాల కోసం ఉపయోగకరంగా ఉంటుంది. మహాశయులారా! మనిషి నైతిక పతనపు పరాకాష్టకు చేర్చే ఈ విషయాన్ని నేను ఆ మానవజాతికి చెందిన ఒక మనిషిగా సిగ్గుపడుతూనే చెబుతున్నాను. ఒకనాడు అల్లారుముద్దుగా గోరుముద్దలు తినిపించి పెంచిన కన్నతండ్రి స్వహస్తాలే కన్నకూతురి పాలిట కబంధ హస్తాలై కాటేస్తుంటే... (ఉద్విఙ్నుడై గాద్గదిక స్వరంతో జేబులోని కర్చీఫ్‌తో కంటితడి తుడుచుకుంటూ)... క్షమించండి... అంటూ ఏం మిగిలింది?